To the Professor of Telugu
Osmania University
With the best compliments of
The author
R.






గ్రంథకర్త:
కవికొండల
వేంకట సత్యనారాయణమూర్తి.

# విశాఖమండలచరిత్రము.



గ్రంథకర్త:

కవికొండల
వేంకట సత్యనారాయణమూర్తి






కాకినాడ ముద్రాక్షరశాల,

కాకినాడ.

1927

 [వెల 0-12-0

M. VENKATARANGAIYA, M. A.
*Senior Professor of History
and Economics,
Maharaja's College*

Vizianagaram

1—1—1927.

I have gone with great pleasure through portions of the "History of Vizagapatam District" written by M.R.Ry. K.V. Satyanarayanamurti Garu of Sringavarapukota. I find that he has taken great pains to consult all available sources of information and that he has produced a most readable and detailed account. In our country local history is not paid that attention which it deserves and which it secures in other contries; and the enterprise therefore of our author is all the mere welcome. The book will be of interest to the general public. It is sufficiently informing and its language is chaste and dignified. In my opinion it can be profitably used by pupils in High School Classes and by teachers in charge of Elementary Schools as well as by pupils under going training It supplies a long felt want and I am sure that the author will receive encouragement from the discerning public of the Andhra country.

M. VENKATARANGAIYA.

**Andhra Research University (Inc.)**
VIZIANAGARAM CITY (S. India)

*Chancellor*
HIS HIGHNESS THE MAHARAJA
SAHEB BAHADUR OF VIZIANAGARAM RAJ.

*President*
Chevalier, Baron of Aran
B. SESHAGIRIRAO, M. A. (MADRAS)
Ph. D., (Wies.) M. S. A. (Paris)

I have read with great pleasure the History of the Vizagapatam District composed by Mr. K. V. Satyanarayana Pantulu of Sringavarapukota. The endeavour is not an easy one and I must say it has been carried on with great pains and considerable success. The narrative is lucid, flowing and unpretentionaly good. I have added marginal notes in the MSS submitted to me indicating where and how the text may be improved and differences of view are possible. I have no hesitation in recommending it as a non-detailed reading book in the Upper Secondary Forms, but I believe, as a book of Andhra Local History, easily the first of its kind in Telugu dealing with stirring times and lofty personalities, it deserves a place in every Andhra home.

Devi Palace,
Vizianagram.

B. SESHAGIRI RAO,
President,

2-1-27.

# BIBLIOGRAPHY.

## తెలుగు.


1 పూసపాటివారివంశావళి.

2 పూసపాటివారికైఫీతు.

3 కాకర్లపూడివారివంశావళి.

4 జయపురమువారివంశావళి.

5 బొబ్బిలివారివంశావళి.

6 ఒరిస్సాకైఫీతు.

7 చామర్లకోటకైఫీతు.

8 (కటకము) గజపతులవంశావళి.

9 విశాఖపట్టణము శాసనములు.

10 కొతాము దానశాసనము.

11 ఖండేపల్లిదానశాసనము.

12 సింహాచలము శాసనములు.

13 రామకృష్ణనారాయణార్జునీయము.

14 వరాహపురాణము.

15 కాశీఖండము.

16 ప్రబోధచంద్రోదయము.

17 ఉషాభ్యుదయము.

18 కృష్ణవిజయము.

19 రంగరాయచరిత్రము.

20 "వైరిహరరంహా" శతకము.

21 మహమ్మదీయమహాయుగము.

22 ఆంధ్రులచరిత్రము.

23 కళింగరాజ్యము.

24 హిందూమహాయుగము.

25 కవులచరిత్రము.

26 కవిజీవితములు.

27 పెద్దాపురముసంస్థానము చరిత్రము.

28 విశాఖపట్టణముజిల్లా గెజటీరు.

29 విశాఖపట్టణముజిల్లా మేన్యువలు.

30 విజయనగరము దినచర్యనుండి కార్మైకేల్ దొరగారిచే వ్రాసియివ్వఁబడిన అంశములు.

31 విశాఖపట్టణము ఛీపులకును చెన్నపురిదొరతనమువారికిని జరిగిన ఉత్తరప్రత్యుత్తరములు.

32 ప్రాచీనలేఖమాల. (నాగరి)

## ENGLISH.

33 Madras Manual of Administration Vol I.

34 Vizianagram treaty.

35 Sewell's lists of Antiquities Vol. I.

36 Persian History of Meer Allum.

37 Col. Malleson's Decisive battles of India.

38 History of the Nizams of Dekan Book III.

39 Broom's History of the Rise and Progress of the Bengal Army Vol. I.

40 Orme's History Vol. III.

41 Cambridge's War in India.

42 Aitchison's Treaties Vol VIII.

43 Meadows Taylor's Students Manual of the History of India.

44 D. Adams the makers of British India.

45 Reports of "the Committee of Secrecy" in the year 1781.

46 The Aristocracy of S. India.



P. C. VENKATAPATI RAJU,
B. A., M. L. C. &
PRESIDENT DISTRICT BOARD,
VIZAGAPATAM.

శ్రీ

## — : కృతిపతివంశాభివర్ణనము : —

శా. శ్రీవాణీవనితాదిదేవతరుణీ । సీమంతసంసక్తము
క్తావారంబు పదారవిందనఖచం । ద్రశ్రేణిధారావధూ
టీవృత్తిం గదియం దనర్చు జయవా । టీస్థానదుర్గామహా
దేవిం భక్తిభజింతుఁ దన్నతదయా । దృష్టిప్రసారాప్తికిన్

(కృష్ణవిజయము. ఆ. ౧. ప. ౧.)

మాకృతిపతివంశాభివర్ణనమునకు శ్రీ పూసపాటి తమ్మభూపాలప్రణీతంబైన కృష్ణవిజయమును, శ్రీ పూసపాటి వేంకటపతిరాజప్రణీతంబైనఉషాభ్యుదయమును, విజయనగరసంస్థానము వ్యాజ్యమున వాదిప్రతివాదులచే నంగీకరింపఁబడిన శ్రీపూసపాటివారి వంశవృక్షమును, రామకృష్ణనారాయణాష్టసీయమును, వరాహపురాణమును నాకు తోడ్పడినవి.

కృతిపతియగు శ్రీపూసపాటి కుమారవేంకటపతిరాజావారివంశమునకు మూలపురుషుఁడు మేవాడ్ ప్రభువగు శిలాదిత్యుఁడు. వీనికిఁ బూషావతి యను ధర్మపత్నియందు గ్రహారాట్పుపూషుఁడు అను నిరువురుపుత్రు లుద్భవించిరి. ఈపూషునకు విజయరాజనియు మాధవవర్మయనియును నామాంతరములు కలవు. కర్ణాటరాజ్యములోని విజయనగరమీవిజయరాజుచేఁ గట్టఁబడినదనియే వాడుక. ఇతనికి బుద్ధ

ర్మయనుకుమారుఁడు కలఁడు. ఇతఁడు తన బాహుపరాక్రమము లోకమునకు వెల్లడియగునట్లు కొంతకాలము రాజ్యమును పరిపాలించెను.

గీ. భువనవర్మసుతుఁడైన యా బుద్ధవర్మ
పుత్రు సుచరిత్రుఁ గాంచె న మిత్రజైత్రి
నిజమనోంబుజనిహిత త్రినేత్రుఁ గులప
విత్రు మాధవవర్మనృప ప్రకీర్తి.

ఈమాధవవర్మ వశిష్ఠ, ధనంజయ, కౌండిన్య, కాశ్యపగోత్రజులతో నాంధ్రదేశమునకు విచ్చేసి కృష్ణాతీరమునతన రాజ్యమును స్థాపించుకొనెను. ఇతఁడు, "గీ. శాలివాహన సుశకవర్షముల సంఖ్య, యరయ నేనూటపదునాలుగైననాఁడు..." కృష్ణాతీరమున నింద్రకీలాద్రిపైనున్న కనకదుర్గను సేవింపనామె యీతనితపంబునకుమెచ్చి కనకవర్షము కురిపించెను. ఆధనముతో నీయన విజయవాటిక యను నామాంతరముగల బేజవాడనగరమును కట్టించిదానిని తనకు రాజధానిగాఁ జేసికొనెను. ఇతఁడు నిడుదవోలువద్దకూడ నొకకోట కట్టించెను. ఇతనికుమారుఁడు దేవవర్మ. ఈతఁడు తన ధర్మపత్ని యగు మైలమాంబయందుభీమన యను పుత్రునిఁ బడసెను. ఇతఁడు బాహు పరాక్రమమున మిక్కిలి వన్నె కెక్కినవాఁడు. ఇతఁడు మైలమాంబపుత్రుఁ డగుటచే మైలమ భీముఁడనియును, యుద్ధమున నద్వితీయమగు బాహుపరాక్రమము

చూపుటచే మహాోద్దామభీముఁడనియును, నియమా రాముఁడగుటను చిక్కభీముఁ డనియును బిలువబడుచుండెను. ఇతఁడు తనరాజధానిని బెజవాడనుండి 'ఏరువ' యను గ్రామమునకు మార్చి యచ్చట కోటకట్టుటచే నితఁడు "ఏరువభీముఁ"డనియును నామాంతరము కలదు. ఇతఁడు భల్లాణరాజుతో యుద్ధముచేయుసందర్భమున నాత్మచ్ఛేద మొనరించుకొనుటచే నీతనికి 'పరిచ్ఛేది' యను నామముకూడ కలదు. నాఁటినుండియు కొంతకాలము యీవంశమువారు పరిచ్ఛేదు లని పిలువఁబడుచుండిరి. ఈతని శాసనమొకటి శా. శ. 925 సం॥న కానఁబడుటచే నీతఁడా కాలమునాఁటివాఁడై యుండవలెను. వేములవాడభీమకవిచే రచింపఁబడినదని చెప్పఁబడుచున్న ఈ క్రిందిపద్యమునుబట్టిచూడ నితఁడు వేములవాడ భీమకవియు సమకాలికులని తోఁచుచున్నది.

చ. గరళపుముద్ద లోహ నువ।గాఢమహాశనికోట్లు సమ్మెట
హారునయనాగ్ని కొల్మి యుర।గాధిపుకోఱలు పట్టుకార్లు
క్కరులయురంబు దాయి లయ।కాలుఁడు కమ్మరి వైరివీర
హారణగుణాభిరాముఁ డగు।మైలమభీమన ఖడ్గసృష్టికిన్.

ఈమైలమభీమునకు అమలభూపతి యను కుమారుఁడు కలఁడు. ఇతఁడు "పూసపాడు" అను నగరమును కట్టి దానిఁ బరిపాలించుకొనుచుండుటచే నాఁటినుండియు నీ వంశమువా

గాసపాటివారను గృహనామము కలిగినవి. ఇందుకు ఉపాఖ్యా
యమున —

“గీ. పూసపా డనునగరంబుఁ । బ్రోచుకతనఁ
బూసపాటిపురాంకుఁ డై । పొగడు గనియె ”

యనియున్నది.

ఈయమలభూపతికి అక్కాంబయను సతీతిలకమువలన
య్యపరాజు జనించెను. ఈతనికి చల్లాంబవలన తిమ్మరా
దయించెను. ఈతిమ్మరాజునకు అన్నమదేవివలన రాచిరాజు
నించెను.

ఈ రాచిరాజు పెక్కుశత్రురాజుల జయించి పెక్కు
బిరుదములఁ గాంచెను. ఈతనిగూర్చి “కృష్ణవిజయ” కారుఁ
ట్లువ్రాసెను.

చాళుక్యవీర రా । జ్య స్థాపనాచార్య
బిరుదంబు పూనుబం । ధురయశుండు
ప్రాథదేవాఖ్యభూ । పాలసన్మాన్యుఁడై,
రాజ్యపట్టము గన్న । రాజసుతుఁడు
ధృతి దామెరాధీశు । తిమ్మన నోడించి
యరిగాపు చేసిన । పురుషవరుఁడు
మ్లేచ్ఛరాజుల గెల్చి । మేలుబల్ దుర్గంబు
లాక్రమించిన విక్ర । మాధికుండు

సీ. ధార్మికాగ్రణి షోడశ । దానకర్త
మన్నెరాయసురత్రాణ । మాళవాధి
పతి శిరస్సూలసహకార । బాంధవాంక
సహితుఁ డగు తమ్మవిభురాచ । శౌరి వెలయు.

పై పద్యమువలన నీతఁడు చాళుక్యరాజులకుఁ దోడ్పడి వారిరాజ్యమును బునరుద్ధరించినట్లును (క్రీ॥ శ॥ 1456-77? సంవత్సరముల నడుమ పరిపాలన మొనరించిన) ఘోగ్రీశదేవరాయలవలన సన్మానింపఁబడినట్లును దామెర తిమ్మవిభుని మహామ్మదీయప్రభువులను మాళవసైన్యమును గెల్చి యామన్నెరాయని "మన్యసుల్తాన్" బిరుదమును గైకొనినట్లును తాన నగుచున్నది.

ఈతఁడు దాకులూరి యెఱ్ఱనృపాలుని కుమార్తెయగు సూరమాంబవలన ముగ్గురుపుత్రులను బడసెను. వారిముగ్గురిలో పెద్దవాఁడగు తిప్పరాజు 'మన్నెసులతాను' బిరుదమును వహించెను. రెండవయాతఁడగు తమ్మిరాజు మిక్కిలి పరాక్రమశాలి. ఇతనికి మాధవవర్మయను నామాంతరముకలదు. ఇతనిఁగూర్చి ఉషాభ్యుదయగ్రంథకర్త యిట్లువ్రాసెను.

మ. అనినందాపురశైలసన్నిధి గజేం । ద్రానీకముం గూల్చి యాం
చెనసేన్ శ్రీగజపత్యభిఖ్య గుడశై । లేంద్రుండు శ్రీరంగరా
జన రేంద్రుం డల యోడపల్లెవిభుఁడు । స్సైన్యంబునం దోడఁగై
కొనియెన్నారలపట్టణంబులసిరుల్ । ఘోరప్రతాపంబునన్.

గీ. త్రిభువనీరాయబిరుదప్రదీప్తుఁడైన
రావుసింగని సంగర రంగమందుఁ
దునిమె పెదవీఁటిచెంత స ద్వినుతుఁడగుచు
కలన శరణన్న బాహాదిఖానుఁ గాచె.

పై పద్యములనుబట్టి చూడ సీతఁకు జయపురపురాజుల కుఁ బూర్వపురాజధానియగు నందాపురముసన్నిధిని గజపతులను గెలిచి వారి "గజపతి" బిరుదమును తాను గ్రహించినట్లును బెల్లముకొండప్రభువగు రంగరాజును, ఓడపల్లెరాజును జయించినట్లును పిమ్మట సుప్రసిద్ధుఁడగు (నెల్లూరు) రావుసింగభూపాలుని పెదవీఁటిచెంత సంహరించి తన్ను శరణుజొచ్చిన బాహాదిఖానును రక్షించినట్లును తెలియుచున్నది. పైవిషయమునుబట్టి తమ్మిరాజునకు రావుసింగభూపాలుఁడు మున్నగువారు సమకాలికు లని తోఁచుచున్నది. పూసపాటివారిలో మొదట "గజపతి" బిరుదమును వహించిన యీ తమ్మిరాజు అన్నమాంబయందు రాచిరాజు, తిప్పరాజు, కృష్ణమరాజు లను ముగ్గురుకుమారులం గాంచెను. అందు రాచిరాజు మిగుల పరాక్రమవంతుఁడు. ఇతఁడు నవభారత మను నొకగ్రంథమును రచించెను. పెక్కండ్రురాజుల జయించి గండపెండెరమును దాల్చెను. కటకపురాజగు ప్రతాపరుద్రగజపతి తనకుమార్తె సీతనికిచ్చి వివాహముచేసి కేతవర మను పట్టణ మీతనికిచ్చెను. ఇతనికాలములో విజయనగరసామ్రాజ్యాధీశ్వరుఁ

డగు కృష్ణదేవరాయలు కళింగరాజ్యముపైకి దండెత్తివచ్చి కటకమును జయించి ప్రతాపరుద్రుని రెండవకుమార్తెయగు తుక్కాంబను వివాహము చేసికొనెను. ఆసంబంధమున రాచిరాజును రాయలవారును తోడియల్లుండ్రగుదురు. పైవిషయమును దెలియఁజేయుచు కృష్ణవిజయమున నీపద్యమున్నది.

సీ. నవభారతాఖ్యాన । నవ్యకావ్యమునకు
నాయకుం డయ్యె నే । నరవరుండు
కటకేశ్వరుని చేతఁ । గని కేతవర మాత్మ
పురముగా నేలె నే । భూవిభుండు
నిలిపె బారుహాము న్న । నృప గండపెండేర
మెపుడుడాకాల నే । నృపతిమౌళి
యఖిలసద్గుణవతి । యక్కమాంబాదేవి
పాణిపీడనుఁ డయ్యె నే । పార్థివుండు
గీ. ప్రథితగజపతిరాజపీ । రప్రతాప
రుద్రతనయాధినాయకా । రూఢ తమ్మి
రాజజనకతఁ గాంచె నే । రాజతిలక
మతఁ డలరు తమ్మవిభురాచ । యప్రభుండు.

ఇతని తమ్ముఁ డగు తిప్పరాజు గొట్టిముక్కుల యన్నమరాజుగారికుమార్తె యగు మల్లమాంబవలన కృష్ణమరాజు రాచరాజు తమ్మిరాజు లను ముగ్వురుపుత్రులను గాంచెను. అందు కృష్ణమరాజు, తిరుమలరాజు దాసరాజు కుమార్తె

యగు తిరుమ్మాంబవలన పెదజగన్నాధరాజు చినజగన్నాధ రాజు లనునిరువురు పుత్రులం బడసెను.

అందు పెద్దజగన్నాధరాజు విశాఖమండలములోని విజయనగరసంస్థానాధీశ్వరులకును కృతిపతియగు శ్రీ పూసపాటి కుమారవేంకటపతిరాజావారికిని మూలపురుషుఁడు. ఈ పెదజగన్నాధరాజునకు కృష్ణమరాజు రామరాజు అని యిరువురుపుత్రులు కలరు. అందు కృష్ణమరాజుగారి కుటుంబము శ్రీ విజయనగరముసంస్థానమువారిది. రామరాజుకుటుంబము శ్రీ కుమారవేంకటపతి రాజావారిది. ఈ గ్రంథములో విజయనగరముసంస్థానమునుగూర్చి వ్రాసినభాగములో కృష్ణమరాజుగారి వంశమును గూర్చి విపులముగా వ్రాయఁబడెను గావున నిచ్చట రామరాజుగారికుటుంబమును మాత్రమే తెలియ జేసెదను.

—: రామరాజుగారి కుటుంబము :—

ఈరామరాజునకు జగన్నాధరాజు, కృష్ణమరాజు, భగవాన్‌రాజు అను మువ్వురు పుత్రులు కలరు. అందు జగన్నాధరాజు బారుహామన్నెములను జయించి వారిచే మన్ననల నందుచున్నట్లు పొట్నూరు ప్రభువులగు శ్రీ పూసపాటి వేంకటపతిరాజ మహారాజులుంగారు తమ ఉపాభ్యుదయ మను ప్రబంధమున వ్రాసియున్నారు. కృతిపతుల నివాసస్థానమగు కొండాముడు శా శ. ౧౬౩౭ (క్రీ॥ శ॥

(1715) సంవత్సరమున అగ్రహారముచేసి దానికి వేంకటపతిరాజ పట్టణమని పేరు పెట్టినది యీ వేంకటపతిరాజుమహారాజులుంగారే. రామరాజుగారి రెండవకుమారుఁడగు కృష్ణమరాజుగారు రేఁగపూసపాటివారికి మూలపురుషుఁడు. ఈయనకు రఘునాథరాజు, గోపాలరాజు, ఆచార్యరాజు లనుముగ్గురు పుత్రులు కలరు. వీరు ముగ్గురును మిక్కిలి బాహుపరాక్రమ ములు. ఇంతివఱకు కృష్ణవిజయగ్రంథకర్తయు, ఉషాయగ్రంథకర్తయు తమవారి బాహుపరాక్రమమును గా తమగ్రంథముల వర్ణించిరి. పిమ్మటివారు తమ ము దాఁటినవారై యుండనోపు. ఆముగ్గురిలో నాచార్యరాజునకు వేంకటపతిరాజును, వేంకటపతిరాజునకు కృష్ణమరాజును, కృష్ణమరాజునకు నరసింహరాజును, నరసింహరాజునకుఁ గుమారరాజును జనించిరి. వీరందఱును విజయనగర సంస్థానాధీశ్వరులకు (కృష్ణమరాజుగారి కుటుంబమునకు) కార్యమునందును ఖడ్గమునందును దోడ్పడుచు సన్నిధానవర్తులుగనే నెలకొనుచుండిరి. అందు కుమారరాజుగారు గొప్పరాజనీతిజ్ఞులు. అందుచే మూడవవిజయరామగజపతి మహారాజులుంగారు (1845-79) వీరి కమీనుపని నొసఁగిరి. రేఁగగ్రామమును విడిచి వీరికాలములోనె కొరాము గ్రామమున నీకుటుంబమువారు ప్రవేశించిరి. వీరికి 5 గురుపుత్రులు కలరు. వారిలో నద్వితీయులగు ద్వితీయపుత్రరత్నము నర

సింహాద్రిరాజుగారు మన కృతిపతికి జనకులు. ఈయనకుమారు లలో నగ్రగణ్యులు మన కృతిపతు లగు శ్రీకుమారవేంకట పతిరాజావారు. వీరు కోటాములోనె ప్రాథమికవిద్య నభ్య సించి హూణభాషను విశాఖపట్టణము A. V. N. కాలేజీలో నభ్యసించిరి. పిమ్మట వీరు చెన్నపట్టణమున పట్టపరీక్షయం దుత్తీర్ణులై కొంతకాలము న్యాయశాస్త్రమును గూడ నభ్యసించిరి. తదనంతరము కారణాంతరములవలన చెన్న పురి వీడి వీరు కోటాము రావలసివచ్చెను. అప్పు విజయనగరసంస్థానమునకు ప్రభువుగానున్న ఆనందగజ మహారాజావారి తల్లియగు అలకరాజేశ్వరికి దత్తపుత్ర లగు నాలుగవవిజయరామగజపతికిని వీరికిని సంస్థానము యొక్క వారసత్వమును హక్కును గూర్చి జరుగుచుండిన వ్యాజ్యములో వీరు వాదులుగా నుండుటచే నా వ్యాజ్య మును కొంతకాలము నడిపించి ఉభయపక్షములవారును చెన్నపురి యున్నతన్యాయస్థానమున ఉభయులకును నను కూలముగా నుండు పద్ధతులపై రాజీనామా చేసికొనిరి. ఆరాజీనామాలో శ్రీమదానందగజపతిమహారాజావారి మర ణశాసనము ననుసరించి రాజ్యమును విజయరామగజపతియు వారి సంతతియు ననుభవించుటకును వాదులు ఆనంద గజపతిమహారాజావారికి సరియైన వారసులగుటచే వీరు సంస్థానమునుండి కొంతధనమును తబ్జీగా ననుభవించుటకును,

ఇఁకముందు నాలుగవవిజయరామగజపతికుటుంబమున కే తరమునందైనను దత్తత సంభవించినప్పు డీవాదులకుటుం బమునుండియే వారు పెంచుకొనుటకు నుదహరింపఁబడెను.

శ్రీకుమార వేంకటపతిరాజుగారు పుట్టిననాఁటినుండి యు సేవకావృత్తి యనున దెట్టిదో యెఱుఁగక కేవలము దేశ సేవాతత్పరులై కొంత కాలము విశాఖపట్టణముతాలూకా బోర్డునకు అధ్యక్షులుగా నుండి యిప్పుడు విశాఖపట్టణము జిల్లాబోర్డున కధ్యక్షులై యొప్పుచుండిరి. ఈయన 1920 సం వత్సరము చెన్నపురిశాసనసభ యెన్నికలలో అఖిలభారత జాతీయమహాజనసభవారి యుత్తరువు ననుసరించి మండల నాయకులై మండలములో నిం చుమించుగా నన్ని పోలింగు స్టేషనులనుండియు ఓట్లపెట్టెల నొక యోటైన పడకుండ ఖాలీ పెట్టెలనే మఱల దొరతనమువారికార్యాలయమునకు పం పించి, జాతీయమహాజనసభ-శాసనసభాప్రవేశమునకు సమ్మ తింపఁగనే 1923, 1926 సం॥ యెన్నికలలో మండలములో నభ్యర్థుల నందఱిలోను అత్యధికమగు సమ్మతుల నొంది రెం డుసారులును శాసనసభాప్రవేశ మొనరించుటయే వీరు "సర్వజనసమ్మతు"లని తెలియఁజేయుచున్నది. వీరు ఆంధ్ర విశ్వవిద్యాలయమునను మఱికొన్ని సంఘోపసంఘముల యందుఁగూడ సభ్యులుగానుండి ప్రజాసేవ యొనరించు చున్నారు.—ఇట్టి సద్వంశసంభవుని—నిట్టియోగ్యతముని—

నిష్టప్రజారంజకుని— ఇష్టాశ్రితజనకల్పతరువును నాకృతి కధీశ్వరునిగాఁ జేసి నాకృతిని ధన్యతనొందించుకొంటిని.

సీ. మకుటమే లోటుగా । మండలా బాతయుఁ
బాలించుచుండిన । పార్థివేంద్రు
దండపాశంబుల । దరిఁ జేరకుండనె
ధర్మంబు పాలించు । ధర్మమూర్తి
నఘుగుణాలు తడప్రగా । నర్థుల కోర్కెలఁ
దీర్చంగి సమకట్టు । ధీరవర్యు
నానందగజపతి । యనుజుఁ డీతండని,
చెప్ప నొప్పగు సు। క్షేత్రశ్రేష్ఠ వేత్తు

గీ. నన్ను పోషించుచున్నట్టి । నరపతీంద్రు
వితత వర యశస్సాంద్రు మత్కృతిపతీంద్రు
క్షితిని దీర్ఘాయు వొసఁగి ర।క్షింపు మయ్య
మహితబ్రహ్మాండభాండని।ర్మాత ! ధాత !!

సీ. 'ఏవంశమునకుఁ ద్రి ।యావర్ణనీయుఁ డౌ
కమలబాంధవుఁ డాది । కర్త యయ్యె
ఏవంశమునకు న।భీష్టదేవత నీల
గళురాణి బెజవాడ । కనకదుర్గ
ఏవంశమున నుద । యించి మాధవవర్మ
ఖ్యాతిగా గురియించె । కనకవృష్టి

ఏవంశమున నుద।యించువారలు
క్షత్రివంశోద్భవుల కెల్ల । వందనీయు
గీ॥ లట్టి శ్రీపూసపాటి మ।హాన్వయమునఁ
గలశవారాశిఁ జంద్రుని । గతిజనించి
కీర్తి గన్న వేంకటపతి । క్షితితలేంద్రు
మత్కృతి పతీంద్రునిఁ । బ్రోవుమా రమేశ!
సీ. ఆశ్రయించినవారి । కర్థ మిచ్చుటె కాని
పొమ్మ్మ లేదనని సత్పుణ్యమూర్తిఁ
దా నిచ్చినది తర।తరము లుంచుటె కాని
మధ్య ఛేదింపని । మహితయశుని
నిజపోష్యులెల్లరి । స్వజను లట్టులె కాని
పరదృష్టి చూడని । భవ్యమూర్తి
శరణన్ననరినైనఁ । గరుణఁ జూచుటె కాని
ద్వేషంబుఁ బూనని । విమలయశుని
గీ. పూసపాటికులాంభోధి । పూర్ణచంద్రు
శ్రీకుమార వేంకటపతి । క్షితితలేంద్రు
దివ్యసద్గుణసాంద్రు మ।త్కృతిపతీంద్రు
మహితకరుణరక్షింపు ము।మామహేశ.

క. వేం. సత్యనారాయణమూర్తి.

# విశాఖమండలచరిత్రము.



## విశాఖపట్టణము.



నేను వ్రాయుచున్నది విశాఖమండలచరిత్రము. కావున ముందుగా నా పట్టణమున కాపే రెట్లువచ్చినదియు, దానికిఁ గల నామాంతరమును నయ్యది మండలమునకుఁ బ్రధానస్థాన మగుటకుఁ గల కారణమును లోనగువిషయములు కొన్ని సంక్షేపముగా వ్రాయుచున్నాను.

కొన్నిశతాబ్దములకిందట నొక యాంధ్రరాజు తాను కాశీనగరమునకుఁ దీర్థయాత్రము విచ్చేయుచు మార్గమధ్యమున నిచ్చట విడిసెను. ఈప్రదేశముయొక్క రామణీయకత కతఁ డచ్చెరు వొంది యచ్చట నొకదేవాలయ ముండిన బాగుండు నని యాతఁడు చింతించి యచ్చట తన యిష్టదైవ మగు విశాఖస్వామికోవెల కట్టించెను.

సముద్రతీరమునఁ గట్టఁబడిన యాదేవాలయము నానాఁటికి నుత్తుంగతరంగంబులరాపిడివలన శిథిలమై చిరకాలముకిందటనే సముద్రమునం గలిసెను. విశాఖస్వామికోవెల

విశాఖపట్టణమున 'తీర్థపురాళ్లు' అని యిప్పుడు పిలువఁబడు చుండిన ప్రదేశమునకుఁ గొంతదూరమున సముద్రములో నుండెడిది. సముద్రము విశాఖస్వామికోవెలను ముంచుటయే కాక క్రమక్రమముగా ముందునకు వచ్చి మఱికొంతభూభాగ మునుగూడ నాక్రమించుకొనెను. సముద్రముచే నాక్రమింపఁబడిన యీ భూభాగమునకే 'లాసన్సు-బే (Lawson's Bay) యని పేరు.

పూర్వకాలమునుండియు విశాఖస్వామికోవెలయుండిన ప్రదేశముననే పుణ్యదినములయందు స్నానము చేయుట యాచార మగుటచే నిప్పుడును మనవా రచ్చటనే స్నానము చేయుచున్నారు. అందుచేతనే అచ్చటనున్న రాళ్ళకుఁ దీర్థపురాళ్ళని పేరు వచ్చినది. ఈ విశాఖస్వామికోవెలవలననే యీపట్టణమునకు విశాఖపట్టణ మనునామము కలిగెను.

—: కులోత్తుంగచోడనగరము. :—

ఈ విశాఖపట్టణమునకు 'కులోత్తుంగచోడనగర' మను నామాంతర మున్నట్లు కొన్ని శాసనములు తెలుపుచున్నవి. క్రీ. శ. 1907 సం॥ ప్రాంతమున విశాఖపట్టణమునకు దక్షిణముగా నున్న 'దుర్గ'కొండపైని 5 శాసనములు బయల్పడినవి. అందు మూడు తెలుఁగుభాషను రెండు తమిళభాషను గలవు, ఇవి, శా. శ. ౧౦౧౨, ౧౧౦౨, ౧౧౨౦, ౧౧౭౨ (క్రీ. శ,

1090, 1180, 1198, 1250) సంవత్సరములలో వ్రాయఁబడి నవి. అందు మొదటిశాసనమున—

"శ్రీమతు విశాఖపట్టణమైన కుడో్త్తుంగచోడపట్టణమున......" (శా. శ. ౧౦౧౨) అనియును,

రెండవశాసనమున:—

"శ్రీమత్ విశాఖపట్టణ మానకుళోత్తుంగచోళపట్టణత్తు......" (శా. శ. ౧౧౦౨) అనియును,

మూడవశాసనమున:—

"...విశాఖపట్టణ మన్నకుళోత్తుంగచోడపట్టణము..." (శా. శ. ౧౧౨౦) అనియును,

నాలుగైదుశాసనములలో:—

"...విశాఖపట్టణమానకుళోత్తుంగ చోలపట్టణత్తిల్..." (శా. శ. ౧౧౭౨) అనియును కలవు.

పై శాసనములనుబట్టిచూడ క్రీ. శ. 1090 సంవత్సరమునకుఁ బూర్వమే కుళోత్తుంగచోడుఁ డనుపేరు గల యొక రాజీపట్టణమును జయించి దానికి 'కుళోత్తుంగచోళనగర' మని పేరుపెట్టిన ట్లూహింపవలసి యున్నది. లేక- ఇందు మొదటిశాసనమున "స్వస్తిశ్రీమదనంతవర్మ...ప్రవర్తమాన విజయరాజ్య సంవత్సరంబులు ౧౭ శకవరుషంబులు ౧౦౧౩......" అని యుండుటచే నా కాలమునఁ గళింగరాజ్యమును

బరిపాలించుచుండిన అనంతవర్మ చోడగంగు తన మాతామహుఁ డగురాజేంద్ర కుళోత్తుంగచోడదేవుని పేర నాపట్టణమునకు కుళోత్తుంగచోళనగర మని పేరిడి యుండవలెను. క్రీ. శ. 1098–99 సంవత్సరముల నడుమ సింహాచలమున నీ రాజకుళోత్తుంగచోళదేవుని శాసనమే కానవచ్చుచున్నది. అందుచే 1074–1118 సంవత్సరముల నడుమ చోళరాజ్యమును పరిపాలించిన (కళింగగంగు మాతామహుఁ డగు) కుళోత్తుంగచోళదేవుని నామమే యీ విశాఖపట్టణమునకు పెట్టెననుట నిశ్చయము.



# మొదటి భాగము.

—: కళింగరాజ్యము :—

ఇప్పటివలెఁ బూర్వ మీదేశము రాష్ట్రములు, మండలములను నామములతో వ్యవహరింపఁబడక రాజ్యములు, సీమ లనునామములతో వ్యవహరింపఁబడుచుండెను. అందు మనము నివసించియున్న రాజ్యమునకుఁ గళింగరాజ్య మని పేరు. ఈ కళింగరాజ్యమునకు సరిహద్దులు తఱచుగా మారుచుండుటచేత దీనికి సరియైన హద్దు లేర్పఱచుటకు వీలు లేదు. అయినను దాదాపుగా నుత్తరమున మహానది, తూర్పున బంగాళాఖాతము, దక్షిణమున గోదావరి, పశ్చిమమున తూర్పుకనుమలు, అని చెప్పవచ్చును. కటకము మొదలుకొని బెజవాడవఱకు నొకప్పు డుండెను. నవలకుకళింగరాజ్యము కృష్ణానదివఱ కుండెను. ఈ కళింగరాజ్యనామము యుగములకిందట యేర్పడినదే గాని యీనడుమ వచ్చినది కాదు. ఇందు ప్రకృతము నేను నివసించియున్న భాగము (శృంగవరపుకోటతాలూకా) నకు జంతుర్నాటిసీమ యని పేరు. ఈ సీమల సరిహద్దులు ముందు తెలియగలవు.

మన యిప్పటి విశాఖమండలముసరిహద్దులకును నీ సీమల సరిహద్దులకును నేమాత్రము సంబంధమును లేదు.

అందుచే విశాఖమండలచరిత్రమును వ్రాయవలెనన్న ముందు గాఁ గొంత కళింగరాజ్యచరిత్రమును వ్రాయవలసి యున్నది.

—: కళింగము—బౌద్ధయుగము :—

మనదేశమున నచ్చటచ్చటఁ గానఁగుచున్న బౌద్ధాలయములు, బౌద్ధశాసనములు, బౌద్ధుల కట్టడములను బట్టి చూచిన మనదేశమునఁ గొంతకాలముక్రిందట బౌద్ధమతము వ్యాపించియుండె ననియును, నప్పటి ప్రభువులు బౌద్ధమతస్థులుగాఁ గాని బౌద్ధమతానుకూలులుగాఁ గాని యుండిరనియును గోచరించుచున్నది. బుద్ధుని మరణానంతరము బుద్ధుని నోటిలోని కోఱ నొకదానిని కొందఱు బౌద్ధులు కళింగదేశమునకుఁ దీసికొని వచ్చి దానిపై నొక స్తూపమును కట్టినట్టు కొన్నిగ్రంథములు చెప్పుచున్నవి. అనకాపల్లి సమీపమున శంకర మను గ్రామమునందు గల బొజ్జనకొండపై బయలుపడిన బౌద్ధకట్టడములు మున్నగునవి యీకాలమునాఁటివే యైయుండవలెను. అప్పటి కీదేశము మిక్కిలి నాగరికతగల దేశమని,

క్రీ. పూ. 302 క్రీ. పూ. నాల్గవశతాబ్దమున జీవించియుండిన మెగస్తనీసు తన గ్రంథమున వ్రాసియుండెను.

—: అశోకుని దాడి :—

మౌర్యసామ్రాజ్యాధీశ్వరుండగు అశోకమహాచక్రవర్తి

క్రీ. పూ. 260 క్రీ. పూ. 260 సం॥న కళింగరాజ్యముపై దాడి వెడలెను. ఈయుద్ధమున లక్షజనులు హతులై

రనియును, లక్షజనులు వికలాంగులును, క్షతగాత్రులును నైరనియును, లక్షయేఁబదివేలమంది బందీలుగాఁ గొనిపోఁబడిరనియును గ్రంథములు చెప్పుచున్నవి. ఈయుద్ధమునఁ దాను చేసిన కూ్రరకృత్యమునకు అశోకుఁడు మిగుల పశ్చాత్తాపము నొంది అహింసాస్వరూపమగు బౌద్ధమతమును స్వీకరించి వివిధదేశముల నీబౌద్ధమతప్రచారమునకై కృషి సలిపెను. అశోకున కీకళింగరాజ్యమున జయముమాత్రము సులభసాధ్యము కాలేదు. కళింగదేశ మాతనిని తీవ్రముగా నెదిరించెను.

## —: రాజులు—రాజధానులు :—

ఈరాజ్యమును గొంతకాలము పాండువంశజులు, పిమ్మట ఆంధ్రరాజులును, తరువాత చాళుక్యులును, గంగవంశజులును, గజపతులును పరిపాలించినట్లు చరిత్రములు చెప్పుచున్నవి. వీరికిఁ గొంతకాలము కృష్ణామండలములోని శ్రీకాకుళము, రాజమహేంద్రవరము, కళింగపట్టణము, కటకము మున్నగునవి రాజధానులుగ నుండెను.

## —: చాళుక్యులు :—

బొంబాయిరాష్ట్రములోని బాదామీ (వాతాపి) వాస్తవ్యులగు చాళుక్యులు ఆఱవశతాబ్దముననను, వారి వంశజులగు పూర్వచాళుక్యులు ఏడవశతాబ్దముననను కళింగరాజ్యము

నకు వచ్చిరి. వారిరాజు మొదటి విష్ణువర్ధనుఁడు. ఇతఁడు క్రీ. శ. 615 మొదలు 633 వఱకును రాజ్యముచేసెను. ఇతనికి కుబ్జవిష్ణువర్ధనుఁ డని మఱియొక నామము కలదు. క్రీ. శ. 632 సం॥ జూలై 7 తేదీని విశాఖమండలమున నున్న సర్వసిద్ధి తాలూకాలోని దిమిలిగ్రామమున, విష్ణుశర్మ మాధవశర్మ లనువారికి (చంద్రగ్రహణ సమయమున) దానము చేసినట్లు దానశాసనములు కాననగుచున్నవి. దీనినిబట్టి చూడ వేంగి రాజ్య మొకానొక కాలమున నింతవఱకును వ్యాపించి యున్నట్లు కాననగుచున్నది. వీరు కళింగరాజ్యముమీఁదికిఁ గూడ తఱచుగా దండెత్తుచు వచ్చుచుండిరి. వేంగిరాజ్యాధి పతియు రాజరాజనరేంద్రుని తండ్రియు నగు విమలాదిత్యుఁ డీకళింగరాజ్యములోఁ జాలభాగమును జయించి యేడుసంవ త్సరములు (1015-1022) పరిపాలించెను.

ఈకాలములోనె తంజావూరును బరిపాలించుచుండిన చోళవంశపురాజగు రాజరాజు ఇతని నొకసారి సింహాస భ్రష్టునిగాఁ జేసినట్లు మహేంద్రగిరిపైనున్న యొకశాసనము తెలుపుచున్నది. తంజావూరును పరిపాలించుచుండిన చోళు లకును వేంగిదేశాధీశ్వరులగు పూర్వచాళుక్యులకును కళింగ దేశాధీశ్వరులగు గంగరాజులకును గల సంబంధము నీక్రింద సూచించుచుంటిని.

| గంగవంశము (కళింగరాజ్యము) | పూర్వచాళుక్యులు (వేంగిరాజ్యము) | చోళులు (తంజావూరు రాజరాజదేవ) |
|---|---|---|

అనంతభీమదేవుడు
- కామార్ణవుడు.
  - వజ్రహస్తుడు
    - రాజరాజు = రాజసుందరి,
      - అనంతవర్మచోడగంగు లేక రాజకళింగగంగు
- గుండమయుడు
- మధుకామార్ణవుడు

విమలాదిత్యుడు = కుందవదేవి
- విజయాదిత్యుడు
- రాజరాజనరేంద్రుడు
  - రాజేంద్రచోళుడు = మధురాంతకి లేక కులోత్తుంగచోళదేవచక్రవర్తి
    - రాజరాజు = రాజసుందరి,
    - రాజరాజచోడగంగు
    - రాజరాజు
    - వీరచోడుడు
    - విక్రమచోళుడు

రాజేంద్రచోళదేవ గంగైకొండ
- అమ్మంగిదేవి
- రాజేంద్రచోళుడు
  - రాజేంద్రచోళుడు = మధురాంతకి
- వీరరాజేంద్రదేవుడు
  - అధిరాజేంద్రదేవుడు

చోళదేశపురాజగు మొదటి రాజరాజదేవుని (1004-50) కుమార్తెయగు కుందవదేవిని వేంగిదేశాధీశ్వరుఁడును చాళుక్యవంశజుఁడును నగు విమలాదిత్యుఁడు వివాహము చేసికొనెను. వారిరువురకును రాజరాజనరేంద్రుఁడు జనించెను. పిమ్మట రాజరాజదేవుని కుమారుఁడగు మొదటి రాజేంద్రచోళదేవగంగయ్యకొండ (1050-62) తన కుమార్తెయగు అమ్మంగిదేవిని రాజరాజనరేంద్రున కిచ్చి వివాహము చేసెను. వారిరువురకును మొదటి కుళోత్తుంగచోళదేవుఁడు జనించెను. ఈ కుళోత్తుంగచోళదేవునకు రాజేంద్రచోళదేవగంగయ్యకొండ పెద్దకుమారుఁ డగు రాజేంద్రచోళదేవుని కుమార్తె 'మధురాంతక' నిచ్చి వివాహము చేసిరి. ఈరాజేంద్రచోళదేవుఁడు తనతండ్రి జీవించి యుండఁగనే మరణించుటచేతను అతనికి పుత్రసంతతి లేకపోవుటచేతను సతని తమ్ముఁడగు వీరరాజేంద్రదేవుఁడు చోళరాజ్యమున కధీశ్వరుఁడయ్యెను.

పైసంబంధమునుబట్టి రాజరాజనరేంద్రుని కుమారుఁడగు కుళోత్తుంగచోళదేవుఁడు బాల్యమునుండియుఁ దనకు మాతామహులును నత్తవారును నగు చోళరాజులయొద్దనే నివసించుచుండెను. తనతండ్రియగు రాజరాజనరేంద్రుని మరణానంతరమునఁగూడ తాను వేంగిరాజ్యమునకు రాక తన పక్షమున తన పినతండ్రి యగు విజయాదిత్యుని రాజప్రతినిధి

గా నేర్పఱచెను. ఇట్లుండ తనకు మేనమామయు పినమామ గారును నగు వీరరాజేంద్రదేవుఁ డతని మరణకాలమున (1070) కుళోత్తుంగ చోళదేవునకు తన రాజ్యములోఁ గొంత భాగము నిచ్చెను. నాఁటినుండియు కుళోత్తుంగచోళదేవుఁడు చోళరాజ్యమునుండి తనకు లభించిన భాగమునకు రాజుగను వేంగిరాజ్యమునకు చక్రవర్తిగను ప్రవర్తించుచుండెను.

ఇట్లుండ వీరరాజేంద్రదేవుని తదనంతరమున చోళ రాజ్యమునకు ప్రభువులైన యతని కుమారుఁడగు అధిరాజేంద్రదేవునిపై ప్రజలు తిరుగుబాటుచేసి వానిని 1074 వ సంవత్సరమున సంహారించిరి. అందుచే చోళరాజ్యమున కంతటికిని కుళోత్తుంగచోళదేవుఁడే ప్రభు వయ్యెను.

—: గాంగ వంశము :—

చిరకాలము (ఆఱవశతాబ్దము) నుండియు కళింగరాజ్యమును నామమాత్రావశిష్టముగాఁ బరిపాలించుచుండిన గంగ వంశజులు మరల తొమ్మిదవ శతాబ్దమధ్యమున నుచ్ఛదశకు వచ్చిరి.

అయిదవ కామార్ణవుని కుమారుఁ డగు వజ్రహస్తుఁడు 1038 వ సంవత్సరమున కళింగరాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁ డయ్యెను. ఇతఁడు 1038 మొదలు 1069 వఱకును రాజ్యపరిపాలన మొనరించెను. ఇతని కాలములో రాజరాజనరేంద్రుఁడు వేంగిరాజ్యాధీశ్వరుఁడుగా నుండెను.

వజ్రహస్తుఁడు 1038-69

వజ్రహస్తునికి పిమ్మట నాతనికుమారుఁ డగు రాజ

**రాజరాజు 1069-77** రాజు రాజ్యమునకు వచ్చెను. ఇతఁ డెనిమిది సం వత్సరములు కళింగరాజ్యమును పరిపాలించెను. ఇతని కాలములో చోళదేశమునను వేంగిరాజ్యమునను పోరాటములు మిక్కుటముగా జరుగుచుండెను. ఇతఁడు కొంతకాలము చోళులకును కొంతకాలము వేంగిరాజులకునుగూడ సహాయమొనరించెను. పిమ్మట నితఁడు వేంగిరాజగు విజయాదిత్యుని జయించి వానిరాజ్యమును గైకొనెను.

ఈరాజరాజు కుళోత్తుంగచోడదేవుని కుమార్తెయగు రాజసుందరిని వివాహము చేసికొనెను. ఇతఁ డుత్కళరాజ్యముపైకిఁ గూడ దాడివెడలి దానిని జయించెను. ఇతని కుమారుఁ డనంతవర్మదేవుఁడు.

**అనంతవర్మదేవుఁడు 1077-1147** ఈయనంతవర్మదేవునకు అనంతవర్మచోడగంగనియును, రాజకళింగగంగనియును నామాంతరములు కలవు. ఇతఁడు 1077 వ సంవత్సరమున రాజ్యమునకు వచ్చెనని కొన్ని చరిత్రములును * శాసనములును తెలుపుచున్నవి. ఇతని పరిపాలనములో కళింగరాజ్యము మిక్కిలి యుచ్ఛదశయం దుండెను. ఇతఁడు రాజరాజనరేంద్రుని

* "స్వస్తిశ్రీ మదనంతవర్మ...ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరంబులు ౧3 శకవరుషంబులు ౧౦౧౨.....ద్ధ ౧౦ సోమవారంబునాఁడు శ్రీమతు విశాఖపట్టణమైన కుళోత్తుంగచోడపట్టణమున........"

కుమారుఁ డగు రాజేంద్ర కుళోత్తుంగచోడదేవునకు డాహిత్రుఁడు. ఇతఁడు తనతండ్రియగు రాజరాజుచే నోడింపఁబడిన వేంగిరాజునకును ఉత్కళదేశపు రాజునకునుమరల వారి రాజ్యము లిచ్చివేసెను.

రాజరాజు కాలమునకును, నంతకుఁ గొంతకాలము పూర్వమును ఉత్కళవేంగిరాజ్యములు రెండును నరాజకస్థితిలో నుండెను. ఆయరాజకసమయముననే కళింగరాజులు తమ యధికారమును బలపఱచుకొనినట్లు కానవచ్చుచున్నది. ఈ రాజకళింగగంగు ఉత్తరమున గంగానది మొదలు దక్షిణమున గోదావరివఱకును బరిపాలించెను.

ఇతనికాలములో తంజావూరుచోళు లీరాజ్యముపైకి రెండుసారులు దండెత్తి వచ్చిరి. కొంతకాల మీరాజకళింగగంగు రాజ్యపదభ్రష్టుఁడై యుండెను. రాజకుళోత్తుంగచోడదేవుఁడు కళింగరాజ్యమును జయించినట్లు (1098-99లో) సింహాచలమున నొక శాసనము కలదు. ఈకళింగగంగు గంగా గోదావరీ మధ్యప్రదేశ మంతయును బరిపాలించినను తన రాజ్యమున కుత్తరమున దీసికొనినంతశ్రద్ధ దక్షిణమునఁ దీసికొనినట్లు కనఁబడదు. ఈరాజకళింగగంగు 70 సంవత్సరములు రాజ్యపరిపాలన మొనరించి 1147 వ సం॥న కాలధర్మము నొందెను. ఇతని నామము అనంతవర్మ. ఇతఁడే అనంతవర్మ దేవుఁడనియును, చాళుక్యశాఖలోని భాగమగు గంగవంశపు

రాజులలోనివాఁడు కావున అనంతవర్మచోడగంగసియును, కళింగరాజ్య పరిపాలకుఁడు కావున కళింగగంగనియును, తన రాజధానియగు కళింగపట్టణమునకు శృంఖలద్వీపమని పేరుండుటచే శృంఖలుఁడనియును బిలువఁబడుచుండెను.

కళింగగంగునకు, కామార్ణవుఁడు, 2 రాఘవుఁడు 3 రాజరాజు 4 అనంగభీమదేవుఁడు 5 ఉమావల్లభుఁడు అను

**కామార్ణవుఁడు 1147–57** ఐదుగురు పుత్త్రులుకలరు. వీరిలో కామార్ణవుఁ
**రాఘవుఁడు** డు పదేండ్లును (1147-57) రాఘవుఁడు పదునైదు
**1157–72** సంవత్సరములును (1157-72) రాజరాజు ఇరువ
**రాజరాజు** దేండ్లును (1172-92) పరిపాలించిరి. వీరందఱును
**1172-92** మిక్కిలి బలహీనులగుటచే కళింగరాజ్యమరాజ

కమునఁ బడెను. వీరికాలములో పూర్వ వేంగిరాజులును వెలనాటిరాజులును నీదేశమునకు వచ్చినట్లు కొన్ని శాసనములు తెలుపుచున్నవి.

రాజరాజునకు పిమ్మట నాతనితమ్ముఁడగు రెండవ అనంగభీమదేవుఁడు రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు తన

**రెండవఅనంగ** రాజ్యమును గంగానదిమొదలు గోదావరి వఱకును
**భీమదేవుఁడు.** బంగాళాఖాతము మొదలు సోనపురము వఱకును
**1192-1203** వ్యాపింపఁజేసెను. ఇతఁడు కటకమున కోట

కట్టించెను. ఇప్పటి యీ జగన్నాథాలయమునుగూడ నీతఁడే నిర్మించెను. అనేక సేతువులను సరోవరములనురచించి పెక్కు

గ్రామములను బ్రాహ్మణుల కొసఁగెను. ఇతఁడు క్రొత్తనాణెములను వెలయించెను. 'శ్రీవీరగజపతి గౌడేశ్వర నవకోటి కర్ణాట కోత్కళవర్గేశ్వ'రాదిబిరుదములను దాల్చెను.

అనంగదేవునకు పిమ్మట వాని కుమారుఁడగు రాజ
రాజగాజు రాజు రాజ్యమునకు వచ్చి తొమ్మిదిసంవత్సరములు
1202–11 పరిపాలించెను.

తరువాత నాతని కుమారుఁడగు మూఁడవ అనంగ భీమదేవుఁడు రాజ్యమునకు వచ్చెను. ఇతఁ డిరువదియేడేండ్లు
మూఁడవ అనంగ రాజ్యపరిపాలన మొనరించెను. ఇతఁడు 'త్రిక
భీమదేవుఁడు ళింగాధినాథ' బిరుదమును దాల్చెను.
1211–38

అనంగభీమదేవునకు పిమ్మట వీరనరసింహదేవుఁడు రాజ్యమునకు వచ్చెను. ఇతనికి వేపగింజంత తోఁక కలదఁట.
మొదటి అందుచే నీతనికి "వీరనరసింహలాంగూలగజ
వీరనరసింహదేవుఁడు పతి" యని కూడ పేరు కలదు. ఈయనకు
1238–64
"శ్రీమార్గ మణీమా తాకుర వరప్రసాద కోటిసూర్యప్రకాశ" "ఉత్కళకళింగసామ్రాట్" లోనగు బిరుదము లనేకములు కలవు. ఈయన మిక్కిలి పరాక్రమవంతుఁడు. అనేకరాజ్యములను జయించి తనరాజ్యమును వృద్ధి చేసెను. ఈనరసింహగజపతి సింహాచలములోని యజ్ఞవరాహస్వామికి 1262వ సంవత్సరమున కళ్యాణమండపము కట్టిం

చెను. ఈయన నియోగమున నీయన మరణానంతరము అచ్చాయసేనాపతులు స్వామికి విమానము, పూర్ణకలశ, ముఖమండపము, నాట్యమండపము, తిరుచుట్టుమాళ్య, కట్టించి అడవివరముగ్రామములోఁ గొంతభూమి నొసఁగెను.

వీరనరసింహదేవునకు పిమ్మట నాతనికుమారుఁ డగు వీరభానుదేవుఁడు రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు తన తండ్రి వలెనె మిక్కిలి ప్రఖ్యాతి వహించెను. ఇతఁడు తనతండ్రి కట్టించిన సింహాచలములోని వరాహనరసింహస్వామికి బొబ్బిలిసీమలోని పోరాము అనెడి గ్రామమును సమర్పించెను. ఈగ్రామము శా. శ. ౧౧౮౭ వ సంవత్సరమున నాతని సామంతరాజగు కిమిడి ప్రభువు వల్లభసాహసమహామల్లుఁ డనునతఁడు సింహాచలము వచ్చి శ్రీవీరభానుదేవమహారాజునకు నాయురభివృద్ధిగా నిచ్చిన ట్లీక్రిందిశాసనము చెప్పుచున్నది.

మొదటి వీర భానుదేవుఁడు 1264–78

"స్వస్తి॥ శాకాబ్దే నగనాగభూ శశిమితే రామప్రధానాత్మజః
శ్రీమాన్ వల్లభ నామసాహస మహామల్లో వదాన్యాగ్రణీః
ప్రాదాత్సింహ మహాద్రిహారిమణయే (‿‿।) పోరామితి
గ్రామం భానువసుంధరాధిప మభూచ్ఛ్రీ బొబ్బిలీద్ధాభవన్॥"

ఈ వీరభానుదేవుఁడు కళింగోత్కళరాజ్యములు రెండును పరిపాలించి "శ్రీమాన్ మణీమ ఠాకురు వరప్రసాద కోటిసూర్యప్రకాశ" "ఉత్కళకళింగసామ్రాట్" బిరుదములను

వహించెను. ఈయనభార్య జాకల్లదేవి. ఈయనకాలములో నీక్రింది గోకరాజుశాసన మొకటి శా. శ. ౧౧౯౨ లో (క్రీ. శ. 1270) సింహాచలమున కాననగుచున్నది.

"స్వస్తి॥ రాజానో నాగవంశ్యాః శశివిశదయశోవ్యాప్తదిక్చక్ర
వాళా। జాతం స్తత్ర బభూవ సద్గుణనిధిః శ్రీసంఖన్యామా
నృపః। జాయా తస్యతు జాయమేతి నృహరేర్లక్ష్మీ స్మరివాసీ।
త్తయోర్జ్ఞాత్తో గోకమహీంపతిః పరనృపాహంకారసంహారకః॥"

పైశాసనమున 'నాగవంశ్యాః' అనుటవలన నీతఁడునుగజపతివంశములోనివాఁడే యనియును, దానిక్రిందనే "స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౧౯౨ అగు నేటి కుంభకృష్ణదశమియుశుక్రవారమునాడు శ్రీమన్మహామండలేశ్వరసంఖ్యపుండి సంఖ్యరాజుకొడుకు గోకరాజు..." అనుటచే నీతనిని భానుదేవుఁడు కళింగరాజ్యమున నోకమండలమున కధికారిగా నియమించినట్లును నూహింపవలసియున్నది.

వీరభానుదేవునకు పిమ్మట నాతనికుమారుఁ డగు వీరనరసింహదేవుఁడు రాజ్యమునకు వచ్చెను. ఈయనభార్య

**రెండవవీరనరసింహ దేవ గజపతి 1278-1305**

చోడదేవి. ఒక్కయీయన పరిపాలనములోనె సింహాచలమున 39 శాసనములు కాననగుచున్నవి. అందు 1278 సం॥న పొట్నూరు అర్జునదేవమహారాజును, 1281 వ సంవత్సరమున గంగవంశజుఁడగు పోతాంకుశదేవుండును, ఆసంవత్సరముననే "హారీత"

గోత్రులగు పరియాగ మంచెన్నగారు 'అర్జునక్షోణిపాలమంత్రి శ్రీరంగపెగ్గడంగారు' ను, 1283 వ సం॥న వీరనరసింహదేవ గజపతిభార్య యగు చోడమహాదేవియును, ఆసంవత్సరము ననే "చాలుక్యకులభూషణ- సర్వలోకాశ్రయ- శ్రీవిష్ణువర్ధన ప్రశస్తిప్రశస్తు లయ్యు మల్లపుదేవుమహారాజులభార్య చోడ మహాదేవులున్ను యీయమ్మసుతుండు ఉపేంద్రదేవచక్రవర్తు లున్ను", 1285 వ సం॥న 'సురభివంశోద్భవ గాఙ్గమదగోత్రు లయిన జంతర్నాటిగంగరాజులు'ను, 1286 వ సం॥న మత్స్య వంశోద్భవులును వడ్డాదిజయంతభూపతిసుతులును నగు అర్జున దేవమహారాజులుతమ్ముండు అన్నమరాజును, ఆసంవత్సరము ననే వశిష్ఠగోత్రులగు (తంభినేత) తమ్మినాయకునిభార్య కోళలకమ్మయును, డప్పాభుజంగసోమాయరాయఁడును, 1287 వ సం॥న భారద్వాజసగోత్రులగు వడ్డవాదిమంత్రిపోలప్రె గ్గడకుమారుఁడు తల్లెపెగ్గడ,...1291 సం॥న వీరనరసింహదేవ గజపతి సేనాపతియు భారద్వాజగోత్రులును నగుగోపాల సేనాపతిపుత్రుఁడు నారాయణసేనాపతియు, పద్మనాయకరా యనికుమారుఁడు కళింగదళనాగుమహామండలీకుండును, 1292 వ సం॥న వడ్డవాదిఅర్జునదేవమహారాజులుకొడుకు జయంత రాజును, 1296 వ సం॥న వీరనరసింహదేవగజపతిభండారాధి కారియు ఆత్రేయగోత్రుఁడును, పెద్దిసోమయాజులపుత్రుఁ డును, నారాయణయజ్వయాజులపౌత్రుఁడును నగుపత్రాప

నరసింహుఁడును, 1297 వ సం॥న సోలస్యగోత్రిజుం డైన బబ్బి మహాసేనాపతులకుమారుఁడు ధర్మాయసేనాపతియు, 1298 సం॥న వర్ధనాది మంత్రాదిత్యదేవరాజులుకుమారుఁడు జయంత దేవరాజులును, భారద్వాజగోత్రు లగు మంచె నరసింహనా యకునికుమారుఁడు బిహారినాయకుఁడును, సింహాచలము వచ్చినట్లు శాసనములవలన గోచరించుచున్నది.

ఈ కాలములో బహరాం, మస్ఉద్, నాజరుద్దీన్, గయూజుద్దీన్ బల్బన్, కైకుబాద్, లోనగువారు ఢిల్లీసుల్తా నులుగా నుండిరి. తోగ్రిల్ ఖానుఁడు మున్నగువారు వంగదే శపు నవాబులుగా నుండిరి. ఈతనికాలములోనె ఢిల్లీబానిస రాజులరాజ్య మంతరించి ఖిల్జీవంశము పరిపాలన మారం భించెను.

వీరనరసింహదేవుని తదనంతర మాతనికుమారుఁ డగు రెండవ వీరభానుదేవుఁడు రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు 1305 మొదలు 1327 వఱకు పరిపాలించెను. ఇతనిభార్య లక్ష్మీదేవి. ఇతనికాలములో అల్లా ఉడ్డీన్ ఢిల్లీచక్రవర్తిగా నుండెను. ఈతని పరి పాలనములోనె 1319 సం॥న సింహాచలమున—

**రెండవ వీరభాను దేవ గజపతి 1305-27**

"స్వస్తిశ్రీశకవర్షంబులు ౧౨౪౧ అగు నేటి శ్రీదేవాది దేవ శ్రీజగన్నాథదేవరల విజయరాజ్య సం॥రంబులు ౧౩ శాంహి వృషభ కృష్ణ ఏకాదశియు పండితవారమునాండు శంక

శసుమహాసేనాపతులు అధికారమున జంతర్నాండుప్రతాపగం
గరాజులు మహాదేవిలక్ష్మీదేవింగారు శ్రీనరసింహానాథునికి..."

అని యుండుటచే నిప్పటి జంతుర్నాటిరాజు శ్రీజగన్నా
థదేవర యనియును, ఈయన సేనాపతి శంకరసుమహాసేనా
పతి యనియును, తనకు తల్లియు ప్రతాపగంగరాజులకు
భార్యయు నగులక్ష్మీదేవిగారు సింహాచలము విచ్చేసిరనియు
ను, అప్పటికి జగన్నాథదేవర జంతర్నాటిరాజ్యమునకు వచ్చి
13 సంవత్సరము లైనదనియును, 1285 వ సంవత్సరమున
సింహాచలమున శాసనము వేయించిన ప్రతాపగంగరాజులు
గాని, ఆయనభార్య యగు లక్ష్మీదేవిగారుగాని 'వీరనరసిం
హాదేవ విజయరాజ్య సంవత్సరంబులు వీరభానుదేవ విజయ
రాజ్యసంవత్సరంబులు' అని తమశాసనములలో వ్రాయక
"జగన్నాథదేవర విజయరాజ్య సం॥రంబులు" అని వ్రాయుట
చే నాకాలమునాఁటి జంతుర్నాటిరాజులు స్వతంత్రులుగా
నున్నట్లును గోచరించుచున్నది.

ఈభానుదేవుని కాలములోనే ఢిల్లీలో కిల్జీవంశ మంత
రించి 'టోగ్లాకు' వంశస్థులు పాలకులైరి.

వీరభానుదేవుని యనంతర మాతనికుమారుఁ డగు
మూఁడవనరసింహదేవగజపతి రాజ్యమునకు వచ్చెను. ఈయన

మూడవ వీరవరసింహదేవగజపతి 1327-53.

కాలములో 1329 సం॥న కశత్సగోత్రజుఁడైన సర్వేశ్వరనాయకుని కుమారుఁడు కూరాయనాయకుఁడును 1333 వ సంవత్సరమున మురహరిదాసరుల రాయఁడును సింహాచలము వచ్చినట్లు శాసనములు తెలుపుచున్నవి. వీరు కళింగరాజ్యములోని సేనాపతులై యుండవచ్చును. అంతియకాక కళింగరాజ్యపరీక్షకై యిచ్చటికి కొంతమంది అధికారులనుగూడ పంపుచున్నట్టు 1340 సం॥ శాసనములు తెలుపుచున్నవి. ఈసంవత్సరమున శంకరజియ్యంగారు కళింగపరీక్షకు వచ్చిరి.

ఇతని కాలములో "మహమ్మద్ బిన్ టోగ్లాకు" ఢిల్లీ చక్రవర్తిగా నుండెను. ఇతఁడు పిచ్చివాఁడు. అందుచే అల్లరులు తిరుగుబాటులు హెచ్చయ్యెను. వంగదేశప్రజలు తిరుగుబాటుచేసి యల్లరులు చేసిరి.

నరసింహదేవుని తదనంతర మాతనిపుత్రుఁడగు మూడవ వీరభానుదేవుఁడు రాజ్యమునకు వచ్చెను. ఈయనకు

మూడవవీరభానుదేవగజపతి 1353-78

కామందేవి, గంగాదేవి, కొమ్మిదేవి యను ముగ్గురుతల్లులు కలరు. అందీయన కొమ్మిదేవిపుత్రుఁడు. ఈయనభార్య హీరాదేవి. ఈయనకు సీతాదేవి యను నొకసోదరి కలదు. ఈయన కాలములో ధర్మదాస జియ్యనగారు కళింగదండపరీక్షాధికారిగానున్నట్లనేక శాసనములు చెప్పుచున్నవి.

ఇతనికాలములో ఢిల్లీసుల్తానగు ఫిరోజ్‌తుగ్లక్ 1353 సం॥ ప్రాంతమున నుత్కళదేశముపైకి దండెత్తి వచ్చెను. ఇదిగాక మఱికొన్ని మహమ్మదీయదండయాత్రలుకూడ నీదేశముపై జరిగెను.

1378 వ సంవత్సరము మొదలు 1402 వ సంవత్సరమువఱకును కళింగరాజ్య మరాజకముగా నుండెను. ఈకాల

అరాజకము 1378-1402

ముననే తైమూర్ హిందూదేశముమీఁదికి దండెత్తి దేశమును పీడుఁగుపెంటగాఁ జేసెను. ఇతని దండయాత్రలో చనిపోయిన ప్రజలు లక్షలకొలఁది కలరు. ఈకళింగరాజ్యముపై నొక్కమహమ్మదీయ దండయాత్రలే కాక భానుదేవుని బలహీనతవలన కొండవీటిరెడ్డిరాజులుకూడ కళింగరాజ్యముపైకి దండెత్తివచ్చి చిలుకసముద్రమువఱకును చనిరి. ఇందుకు 1386 వ సంవత్సరమున సింహాచలమున వ్రాయఁబడిన యీక్రింది శాసనములఁ జూడనగు.

"శాకాబ్దే వసుబిందువిశ్వగణితే శ్రీ తేకార్తికే
సప్తమ్యాం రవివాసరే నరహరే రారావనాయన్వహం
భక్త్యా సత్కుసుమస్రజన్నిజ సమస్తాభీష్టసంసిద్ధయే
ప్రాదాత్కోటమరెడ్డి సత్ప్రభుసుత శ్రీవేమరెడ్డీ సుధీః"

"శ్రీయల్లాడధరాతలేంద్రతనయః శ్రీవీరభద్రేశ్వరో
భాస్వత్కోటయవేమభూప మిహిరః పృథ్వీభృతామగ్రణీ

గ్రామం కాంచనభాజనం సువిమలా ముక్తావళిగపట్టికా
హైమీముజ్వలచామరద్వయమదాత్ సింహాద్రినాథాయణాః

మఱియు శ్రీనాథకవి తనకాశీఖండమున నీరెడ్డిరాజుల దండయాత్రనుగూర్చి యిట్లు వ్రాసెను.

శా. ఔరా! యల్లయరెడ్డి దొడ్డవసుధాధ్యక్షుండు ధాటీచమూ
భేరీభాంకృతి ఘోరఘోషమున ని । ర్భేదించె నొడ్డాది శృం
గారంకోటయు లోతుగడ్డయును ను । ద్ఘాటించె నత్యుద్ధతిం
క్షీరాంభోధితటంబున న్నిలిపె ది । క్సీమాజయస్తంభముల్.
(ఆ- ౧. ప- 53)

మ. కొనియెం గంచుకముల్ సముద్భటనట । ద్ఘోటీభటప్రౌఢిఁ గై
కొనియె న్వేసుకఁ జీడికాడ యహిత । క్షోణీశుఁ డల్లాడఁ జే
కొనియె న్నాకవరంబు వీఁక । మదవద్ఘోరారిసంహారి యై
ఘనుఁ డల్లాడమహీశు వేమన నిరా । ఘాటైకధాటీగతిన్.

ఉ. ప్రాకటవిక్రమస్ఫురణ । రాజమహేంద్రము రాజధానిగా
నేకసితాతపత్రమున । నేలును వీరనృపాలుఁ డుత్తమ
శ్లోకుఁడు వేమశౌరియును । జందుసమున్నతవైభవాఢ్యుఁడై
చీఁకటియుంగరంగయును । జిల్కసముద్రముసింహశైలమున్.
(ఆ- ౧. ప- ౬౧)

సీ. సప్తమాడియరాయ । చంద్రబింబాననా
చికురవల్లరులపైఁ । జిన్నిపువ్వు
ఝూడె జంతుర్నాటి । జననాథశుద్ధాంత
కుచకుంభములమీఁది । కుంకుమంబు

బారహాదొంతిభూ । పాల లీలావతీ
గండస్థలంబులఁ । గలికినవ్వ
కలువప ల్వొడ్డాది । కటకాధిపతివధూ
సీమంతవీథులఁ । జేరుచుక్క
గీ. యల్లడాధీశ వేమక్ష్మా । మాధినాథ
భూరినిష్ఠురధాటీవి । హారచటుల
సైన్యనాసీరతుక్ఖార । శఫపుటోత్థ
వింధ్యపార్శ్వవసుంధరా । విపులభూమి.

(అ- ౧. ప- ౩౮)

శ్రీనాథకృత మగు పైపద్యములను బట్టి రెడ్డిరాజులు రాజమహేంద్రవరమునుండి దాడివెడలి కళింగరాజ్యములోని 1 ఒడ్డాది, 2 శృంగారంకోట, 3 లోతుగడ్డ, 4 చీడికాడ, 5 మాకవరము, 6 సప్తమాడియలు (మాడుగులు) 7 చీఁకటికోట, 8 కళింగపట్టణము మొదలగుప్రదేశములం గలకోటలను జయించి చిల్కసముద్రము మొదలు సింహాచలమువఱకుఁ గల ప్రదేశమును స్వాధీనముచేసికొని జయస్తంభములు నాటినట్లు కానవచ్చుచున్నది. పైనుదహరింపఁబడిన కోటలలో నొకటి రెండు తప్ప మిగిలినకోటలన్నియును విశాఖమండలములోనివే.

ఇట్లుత్తరమునుండి వంగదేశపునవాబులును క్రిందినుండి రెడ్డిరాజులును కళింగదేశముపై దాడివెడలి దేశమును సంక్షోభము గావించిరి.

ఈయల్లరులన్నియుఁ దీరినపిమ్మట 1402 వ సంవత్సరమున వీరనరసింహదేవగజపతి రాజ్యమునకు వచ్చెను. ఇతని కాలములో వ్రాయఁదగిన విశేషము లెవ్వియును లేవు. ఈతఁడు 1402 మొదలు 1424 వ సంవత్సరమువఱకు రాజ్యపరిపాలన మొనరించెను.

**నాలుగవ వీరనరసింహదేవగజపతి, 1402–24.**

నరసింహదేవగజపతి కాలధర్మము నొందినపిమ్మట నాతనికుమారుఁడగు నాలుగవ వీరభానుదేవగజపతి 1424 వ సంవత్సరమున రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు పదిసంవత్సరములు రాజ్యమును పరిపాలించెను. ఇతఁడు చాల బలహీనుఁడు. ఐనను నితనిమంత్రి తెలివైనవాఁడగుటచేఁ దనరాజ్యమును శత్రుబాధనుండి కాపాడుచు వచ్చెను.

**నాలుగవ వీరభానుదేవగజపతి 1424–34.**

ఈతనికాలములో జంతుర్నాటిలో నెకయుద్ధము జరిగెను. జంతుర్నాఁడనఁగా నించుమించుగా విశాఖమండలములోని యిప్పటి శృంగవరపుకోటతాలూకా యని చెప్పవచ్చును. దీనికి సరిహద్దులు వ్రాయుటకుఁగూడ ప్రయత్నించెదను.

**జంతుర్నాఁడు**

శ్రీసింహాచల శాసనములలో అడవివరము, నరవ, ఖండిక, జుత్తాడ, పురురాయిచతుసీమావళి, చింతాడ, ఉత్తరాపల్లి, కణాతి, (అలమండ) గ్రామములు జంతుర్నాటిసీమలోని వని వ్రాయఁబడియుండుటచే గో

**సరిహద్దులు**

స్తనీనదికి (గోపాలపల్లి యేరు) దక్షిణభాగ మంతయు జంతుర్నాటిసీమవలె గోచరించుచున్నది. ఏలయన పైనుదహరింపఁబడిన గ్రామములన్నియు గోస్తనీనదికి దక్షిణభాగమున నున్నవి. గోస్తనీనదికి ఉత్తరపుగట్టుననున్న కొత్తాము (వేంకటపతిరాజుపురము) ను గూర్చి శా. శ. ౧౬౩౭ సం॥న శ్రీపూసపాటి వేంకటపతిరాజు మహారాజులుంగారు వ్రాయించి యిచ్చిన దానశాసనమున "........మా మొఖాసా సనతు పొట్నూరుసీమలోను కొత్తా ౧అనే గ్రామం........" అని వ్రాయఁబడియుండుటచే నదికి ఉత్తరపుభాగము పొట్నూరు సీమ యని చెప్పవలసియున్నది. ఇఁక తూర్పున అడవివరము, నరవ గ్రామములు రెండును సింహాచలమునకు పాదతలమున నుండుటచేతను అక్కడకు సముద్రము కానవచ్చుచుండుటచేతను తూర్పున బంగాళాఖాతమువఱకును సరిహద్దు నేర్పాటు చేయవచ్చును. ఇఁక దక్షిణమున కణతియు పశ్చిమమున కొంతభాగము వడ్డాదిదేశమును నని చెప్పవలసివచ్చును. మాడుగులురాజ్యము క్రీ. శ. 1476-1510 సం॥ల నడుమ నందాపురమును పరిపాలించిన విజయచంద్రాఖ్యదేవునిచే నేర్పాటుచేయఁబడినది కావున నంతకుపూర్వ మీరాజ్యము నందాపురరాజ్యముగా పరిగణింపఁబడి జంతుర్నాటిసీమకు పశ్చిమోత్తరసరిహద్దుగా దానిని చెప్పనొప్పు.

ఈసరిహద్దులననుసరించియున్న జంతుర్నాటిసీమను క్రీ. శ. 1421 సంవత్సరమున సురభివంశజుఁడును గార్త్సమదగోత్రుఁడును నగు ప్రతాపగంగరాజులు పరిపాలించుచుండెను. అప్పటికి విశాఖమండలమున నందాపురపు, వడ్డాది, జంతుర్నాఁడు, పాచిపెంటరు సీమలు ముఖ్యములైనవి. అందు నందాపురమును శిలావంశాధీశ్వరుఁ డగు విశ్వనతరాజులును, వడ్డాదిని మత్స్యవంశోద్భవుఁడును కాశ్యపగోత్రుఁడును నగు అర్జునదేవరాయలును, పాచిపెంటరును రాయవంశోద్భవుఁ డగు అర్జున దేవమహారాజకుమారుఁడును నీకాలమున పరిపాలించుచుండిరి.

*క్రీ. శ. 1421 వ సంవత్సరప్రాంతమున వడ్డాది అర్జునదేవరాయలు జంతుర్నాటిపైకి యుద్ధమునకు వెడలి తదధీశ్వరుఁ డగు ప్రతాపగంగరాజులను జయించి శ్రీమండలేశ్వర ప్రతాపార్జున దేవరాయరాహుత్తరాయ లనుబిరుదము వహించెను. ఈకాలమునాఁటి కళింగదేశపురాజుల బలహీనతవలన మండలాధీశ్వరు లెల్లరును స్వాతంత్ర్యమును వహించి వారిలో వారు పోరాడుచుండిరి. పైమండలాధీశ్వరుల వంశవృక్షముల ను పరస్పరసంబంధమును నిటఁ బొందుపఱచుచున్నాను.

---

* సింహాద్రినాథుని కోవెల వెనుకప్రక్క శా. శ. ౧౩౪౩ సం॥న వ్రాయఁబడిన శాసనమునఁ గలదు.

ఇతఁడు నాల్గవభానుదేవుని మంత్రి. ఉత్కళదేశస్థుఁడు. గజపతివంశమునకుఁ జెందినవాఁడు. నాల్గవభానుదేవుఁడు మృతి నొందినపిమ్మట వానిరాజ్యమును క్రీ. శ. 1434 సంవత్సరమున నీతఁ డాక్రమించుకొనెను. ఇతఁడు వీరప్రతాపకపిలేశ్వరుఁ" డనుబిరుదముతో రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు తనరాజ్యమును గంగానది మొదలు కృష్ణానదివఱకును వ్యాపింపఁజేసెను. పూర్వము తమరాజ్యముపైకి దండెత్తివచ్చిన రెడ్డిరాజుల నోడించెను. ఇతఁడును తనపూర్వులవలెనె "శ్రీమాణిక్య మణిమతాకురువరప్రసాద కోటిసూర్యప్రకాశ" అనుబిరుదమును వహించెను.

కపిలేశ్వరగజపతి 1434-69.

వసిష్ఠగౌతమీనదియొడ్డున నీతఁడు తనపేర 'కపిలేశ్వరపుర'మను నొకయగ్రహారము చేసి యచ్చట నొక శివాలయము కట్టించి యాలింగమునకు కపిలేశ్వరుఁ డని పేరిడియెను. ఇతఁడు ఆంధ్రోత్కళకళింగరాజ్యములు మూఁటను నేకచ్ఛత్రాధిపత్యముతో పరిపాలించెను. ఈతనికాలములో విజయనగర బహమనీరాజ్యముల దాడులు మిక్కుటముగా నుండెను.

ఒ క క థ.

ఇతనిపరిపాలనములో నొకసంవత్సరము వర్షము లేక పోయెను. అప్పు డీవీరప్రతాపకపిలేశ్వరగజపతి తనమం

త్రిని పిలిచి వర్షాకాలమున తనరాజ్యములో వర్షము లేకపో వుటకుఁ గారణ మేమని యడిగి వెంటనే పుష్కలావర్తమేఘా ధిపతియగు దేవేంద్రున కొకతాఖీదు వ్రాసి పంపుమనెను. ఆకాలమున చక్రవర్తిమాట కెదురాడినమంత్రికైనను మరణ దండనము తప్పదు. కావున వెంటనే మంత్రి దేవేంద్రున కొక తాఖీదును వ్రాసి దానిపై రాజముద్రిక వేసి దాని నిరువురు భటులచేతి కిచ్చి దేవేంద్రున కాలేఖ నిచ్చిరమ్మని పంపెను. అప్పు డాభటుల కేమియుఁ దోఁపక యెట్లైనను రాజువలన తమకు శిక్ష తప్పదని నిశ్చయించుకొని తుదకు ప్రయాణము నకు త్రోవకర్చులనిమిత్తము చెరి 500 రూపాయిలను కావ లెనని కోరిరి. వారి కోరికప్రకారము చెరి 500 రూపాయ లును మంత్రి వారి కొసఁగెను.

భటు లిరువురును నాధనమును గైకొని రాజుగారి యాజ్ఞాపత్రమును బట్టుకొని తిన్నగా శ్రీజగన్నాథమును జేరిరి. ఒకనాఁటి యర్ధరాత్రమున వా రిరువురును శ్రీజగన్నాథస్వా మివారి యాలయములో రహస్యముగాఁ బ్రవేశించి ప్రతాప కపిలేశ్వరుఁ డిచ్చిన యాజ్ఞాపత్రమును స్వామిపాదమూలమున నుంచి "స్వామీ! మే మీలేఖను దేవేంద్రున కందీయ కుండ కటకపురము చేరిన మాప్రాణములు మాకు దక్కవు. విదేశములకుఁ బాఱిపోవుద మనిన మాదారాసుతాదుల నెట్లు విడిచిపోఁగలము. కావున మా కేదియైన మార్గమును జూపి

మమ్ము రక్షింపుము.” అని వేడుకొనిరి. ఇట్లు తెల్లవాలువలఅ కును వా రుభయులును స్వామియెదుట సాష్టాంగనమస్కార ములతోఁ బ్రార్థించుచుండఁగా నెట్టకేలకు స్వామికి వీరిపై ననుగ్రహము వచ్చి రాజు లేఖకుఁ బ్రత్యుత్తరముగా దేవనాగ రిలిపితో నొకలేఖ వ్రాసి దేవేంద్రునిముద్రికతో దానిని వారి ముందు పడవైచెను. “నేఁటికి మూఁడవనాఁడు వర్షము కురియు” నని అందు వ్రాయఁబడియున్నది. భటు లాప్రత్యుత్తరమును పట్టుకొని పరమానందభరితులై కటకపురము చేరిరి.

శ్రీవీరప్రతాపకపిలేశ్వరగజపతిమహారా జాప్రత్యుత్త రమును గాంచి మిక్కిలి సంతోషించి భటులకు పారితోషిక మొసంగెను. పిమ్మట కుంభీపాతముగా వర్షము కురిసి రాజును ప్రజలను సంతోషభరితుల చేసెను.

కపిలేశ్వరగజపతికి పిమ్మట నాతనిపుత్రుఁ డగు పురు షోత్తమగజపతి రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు క్రీ. శ. 1469 మొదలు 1496 వఱకును పరిపాలించెను. ఇతఁడు కళింగోత్కళరాజ్యములు రెండును నేకచ్ఛత్రాధిపత్యముతోఁ బరిపాలించెను.

**పురుషోత్తమగజపతి 1469-96**

విజయనగరమును విరూపాక్షరాయలు పరిపాలించు చున్నప్పుడు (1465-78) పురుషోత్తమగజపతి విజయనగరము పై దండెత్తి వానిని గెలిచి యచ్చటి రత్నసింహాసనమును దెచ్చి శ్రీజగన్నాథస్వామికి సమర్పించెను. పిమ్మట నీతఁడు

కాంచీపురాధీశు నోడించి యాతనికుమార్తె యగు పద్మావతిని బెండ్లియాడెను. మఱియు నీతఁడు "శ్రీవీరగజపతి గౌడేశ్వర నవకోటి కర్ణాటక బల్గేశ్వ"రాది బిరుదములను బొందెను. ఇతఁడు పురుషోత్తమపుర మను నగరిహారమును కట్టించి యచ్చట శ్రీజగన్నాథస్వామిని ప్రతిష్ఠచేసి యాతనికిఁ దన పేర పురుషోత్తమస్వామి యని పేరిడెను.

ఇతఁడు తనసామంతరాజగు (పూసపాటి) వీరబసవ రాజును ఉదయగిరిపైకిఁ బంపి దానిని జయించెను.

సీ. మాధవవర్మ భూ। మండలేశ్వరవంశ
జలధికి నేరాజు। చందమామ
యేరాజు దయశైల। మొలనిని భేదించెఁ
గపటాహితమదాంధ। కారమడఁగ
గజపతి సురథాని, గడిదుర్గములకెల్ల
నేరాజు వజ్రింపు। బోరుతలుపు
మహిమచే నేరాజు। మఱపించె నలభగీ
రథ పృథు శ్రీరామ। రఘురమణుల
నట్టిగుణశాలి తమ్మరా। యనికుమార
వీరబసవకుమారచక్రి। విభునిచేత
మన్ననలుగాంచి మించిన। మహితుఁ డితఁడు
మనుజమాతుర్నిండె గంగయా। మాత్యవరాళి.
(ప్రబోధచంద్రోదయము)

పురుషోత్తమగజపతి తదనంతర మాతనికుమారుఁ డగు ప్రతాపరుద్రగజపతి రాజ్యమునకు వచ్చెను. ఈయన ప్రతాపరుద్రగజపతి 1496 మొదలు 1539 వఱకును పరిపాలన (1496–1539) మొనరించెను. కళింగోత్కళరాజ్యములే కాక పశ్చిమమున 1. వినుకొండ 2. కొండవీడు 3. బెల్లముకొండ 4. నాగార్జునకొండ 5. అద్దంకి 6. అమ్మనబ్రోలు 7. తంగేడు 8. కేతవరము 9. ఉదయగిరి 10. రాజమహేంద్రవరము మున్నగుదుర్గములన్నియును నీతని స్వాధీనములోనె యుండెను. అందు కేతవరపురాధీశ్వరుఁ డగు పూసపాటి రాచిరాజునకు తనకుమార్తె నిచ్చి పెండ్లిచేసెను. రాజమహేంద్రవరమున 'రాయరామానందుఁడు'ను మిగిలినవానికి ప్రతాపరుద్ర దేవగజపతికుమారుఁ డగు వీరభద్రగజపతి. కుమారహంవీరమహాపాత్రుని కుమారుఁడు వీరభద్రపాత్రుఁడు 3. రాచూరి మల్లఖానుఁడు 4. ఉద్దండఖానుఁడు, 5. శ్రీనాథరాజు లక్ష్మీపతిరాజు 6. జన్యామలక కసవాపాత్రుఁడు 7. పశ్చిమ బాలచంద్రమహాపాత్రుఁడు రాజప్రతినిధులుగా నుండిరి.

౧. ఇతనికాలములో నొకసారి వంగదేశపుమహమ్మదీయులు ఉత్కళదేశముపైకి దండెత్తివచ్చి శ్రీ జగన్నాథమును ముట్టడించి యనేకదేవాలయముల నాశన మొనరించిరి.

విజయనగరసామ్రాజ్యాధీశ్వరుఁ డగు శ్రీకృష్ణదేవరాయలు క్రీ. శ. 1513 సంవత్సరమున పూర్వదిగ్విజయయా

త్రకు బయలువెడలి నెల్లూరుమండలములోని 'ఉదయగిరి'ని ముట్టడించెను. అచ్చటి రాజప్రతినిధి వీరభద్రపాత్రుడు. ఆ దుర్గము శత్రువుల కభేద్యమై పదివేలకాల్బలముతోను నాలుగువందల గుఱ్ఱములతోను సురక్షితమై యుండెను. కృష్ణదేవరాయలు పదునెనిమిదిమాసములవఱకును కోటను ముట్టడించి తుదకు కొండను బ్రద్దలుకొట్టించి విశాలమార్గ మేర్పాటు చేసికొని కోటను స్వాధీనము చేసికొనెను.

౨. పిమ్మట గుంటూరుమండలములోని *కొండవీటిదుర్గమును జయించుటకు కృష్ణదేవరాయలు బయలువెడలెను. ఈ దుర్గము గొప్పపర్వతములమధ్య నుండుటచే శత్రుల కభేద్యమై మహాబలిష్ఠమై యుండెను. ఈదుర్గమును ప్రతాపరుద్రగజపతి కుమారుఁడగు వీరభద్రగజపతి పాలనములో నుండెను. కృష్ణదేవరాయ లుదయగిరి నాక్రమించి కొండవీటిమీఁదికి దండెత్తి వచ్చుచున్న విషయము ప్రతాపరుద్రదేవగజపతి విని 1300 ఏనుఁగులు 20,000 గుఱ్ఱములు 500,000 ల కాల్బలమును వెంటఁదీసికొని కృష్ణానదీతీరమున రాయలసైన్యము నెదిరించెను. కాని కృష్ణదేవరాయలధాటికోర్వలేక విశేషనష్టముతో వెనుకకు మఱలవలసివచ్చెను.

---

* ఈకొండవీటిదుర్గము మొదట రెడ్డిసరదారులది. 1454 లో కపిలేశ్వరగజపతి దీనిని స్వాధీనము చేసికొనెను. అప్పటినుండి 1515 వఱకు నది వారిస్వాధీనములోనె యుండెను.

1515 సం॥ జూన్ 23 (శా. శ. ౧౪౩౭ ఆషాఢ శు ౧౧ శని వారము) తేదీని కృష్ణదేవరాయలు కొండవీటిని స్వాధీనము చేసికొనెను. పిమ్మట కృష్ణదేవరాయలు కొండవీటికి సమీపముననున్న 1 బెల్లముకొండ, 2 నాగార్జునకొండ, 3 అద్దంకి, 4 అమ్మనబ్రోలు, 5 తంగేడు, 6 కేతవరము మున్నగు దుర్గములనుగూడ సాధించెను. అక్కడనుండి రాయలు కొండపల్లిదుర్గమునకుఁ బోయి దానిని రెండునెలలవఱకు ముట్టడించి స్వాధీనపఱచుకొని ప్రతాపరుద్రగజపతిభార్యను, పుత్రిని, నేడ్గురు ముఖ్యసైన్యాధీశులను చెఱపట్టి విజయనగరమునకుఁ బంపెను.

ఆసంవత్సరముననె కృష్ణదేవరాయలు సింహాచలము వచ్చి శ్రీసింహాచలస్వామికిఁ గొన్నికానుకలను సమర్పించెను. పిమ్మట 1518 (శా. శ. ౧౪౪౧) సంవత్సరమున మరల కళింగరాజ్యముపైకి దండెత్తి వచ్చి కటకమువఱకుఁ గలకోటల నన్నిటిని జయించి తుదకు కటకముపైకి యుద్ధమునకు వచ్చెను. అప్పుడు ప్రతాపరుద్రగజపతి కృష్ణదేవరాయలధాటికి భయపడి పాఱిపోయెను. అటుల పాఱిపోయిన గజపతియొద్దకు కృష్ణదేవరాయలు మంత్రియగు తిమ్మరుసు వెళ్లి వానితో సంధిచేసికొని గజపతికుమార్తె యగు తుకాంబను రాయల కిచ్చి వివాహము చేయించి గజపతిరాజ్యమును మరల వాని కిచ్చివేసెను.

కృష్ణరాయలు కటకములో నొకజయస్తంభము వేయించెను. ఈదిగ్విజయములో మనమండలములోని మాడుగుల, వడ్డాది, పొట్నూరు, కొత్తాము, కోటలనుగూడ జయించి 'బాహుబలేంద్రి' బిరుదాంకితులగు మేదినీరావువారికి రాజధాని యగు పొట్నూరులో నొకజయస్తంభము వేయించెను. తనతిరుగుదలలో శ్రీసింహాచలస్వామికి ౧ పెదగాణి, ౨ అగనంపూడి, 3 పిన్నఅగనంపూడిపల్లె, ౪ అమ్మచెల్లెపల్లెలు, ౫ గంగవరంపల్లెగ్రామములు శాశ్వతభోగార్థమై సమర్పించెను.

ఇట్లు ప్రతాపరుద్రగజపతి బలవంతుఁడగు శ్రీకృష్ణదేవరాయలతో సంబంధము చేసికొని శత్రుబాధ లేకుండ కొంతకాలము రాజ్యపరిపాలన మొనరించుకొని 1539 సం॥న కాలధర్మము నొందెను.

ప్రతాపరుద్రగజపతికిఁ బిమ్మట వానికుమారుఁడు వీరభద్రగజపతి రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు స్వల్పకాలము మాత్రమే రాజ్యపరిపాలన మొనరించెను. ఇతని తండ్రికాలములో గోలకొండరాజ్య మేర్పడెను.

వీరభద్రగజపతి 1539-41

గోలకొండ సుబేదారుఁడగు "కూలీకుతుబ్‌శాహి" 1512 సం॥ స్వతంత్రుఁడై యాతనికాలములో తూర్పు తెలుఁగునాఁడంతయు నాక్రమించుకొనెను. వీరభద్రగజపతి బలహీనుఁడగుటచే ఆతనిమంత్రి గోవిందదేవు 1541 సంవత్సరమున రాజును సంహరించి రాజ్యమునకు వచ్చెను.

ఇతని కాలములోఁ ముఖ్యవిశేషము లేవియు లేవు. గోల

గోవిందదేవు
1541-48

కొండరాజ్యమువారు క్రమక్రమముగా నాంధ్రదేశమున వృద్ధిపొందుచుండెను. ఇతఁడు 1548 సంవత్సరమున కాలధర్మము నొందెను.

గోవిందదేవుపుత్రులు
1548-6?

గోవిందదేవునకు ముగ్గురుకుమారులు కలరు. వారొకరి పిమ్మట నొకరు రాజ్యమునకు వచ్చి 12 సంవత్సరములు పరిపాలించిరి. వీరిలోఁ గడపటివానిని ముకుందహరిచందనుఁడను నొకయాంధ్రదేశపు రాజు జయించి రాజ్యమునకు వచ్చెను.

ముకుందహరిచందనుఁడు
1560-68

ఇతఁడు 1560 సం॥న రాజ్యమునకు వచ్చెను. 1568 సంవత్సరమున బంగాళాదేశపు మహమ్మదీయ 'జనరలు' ఉత్కళదేశముపైకి దండెత్తి ముకుందహరిచందనుని చంపి వానిరాజ్య మాక్రమించుకొనెను. ఇదేసమయముగా నెంచి అప్పటి గోలకొండ నవాబగు 'ఇబ్రహీంకుతుబ్‌శాహి' శ్రీకాకుళముపర్యంతము గల ఆంధ్రదేశ మంతయును స్వాధీనము చేసికొనెను.

ఇంతటితో ఉత్కళరాజ్యమును కళింగరాజ్యమును వేరై ఉత్కళదేశము వంగదేశపునవాబులకును, కళింగదేశము గోలకొండనవాబులకును లోఁబడెను.



# రెండవ భాగము.

(పూర్వచరిత్రము)

## —: గోలకొండనవాబుల పరిపాలనము. :—

(పూర్వపీఠిక)

౧. కూలీకుతుబ్ శాహా:—1512-43 సంవత్సరముల నడుమ గోలకొండను స్వతంత్రాధికారిగా పరిపాలించిన
1512-43 కూలీకుతుబ్ శాహా కాలముననె తూర్పు తెలుఁగు నాఁడంతయు నాతనిచే జయింపఁబడెనని యిం వఱకు వ్రాసియుంటిమి.

౨. జంషీద్ కుతుబ్ శాహా అతనితరువాత 1543 సంవత్సరమున రాజ్యమునకు వచ్చెను. ఇతనికాలమునందు 'జగ
1543-50 దేవరావు' అను మహారాష్ట్రసరదారుఁ డొకఁ డుండెను. అతఁడు తెలుఁగుసీమలోని నాయకులసహాయము నొంది ఆంధ్రదేశములోని రమారమి యన్ని దుర్గములను జయించెను. ఈజగదేవరావు స్వతంత్రుఁడును సర్వాధికారియు నగుటచే నాంధ్రదేశ మంతయు నించుమించుగా నీతని చేతులోనె యుండెను.

3. ఇబ్రహీంకుతుబ్ శాహా 1550 సంవత్సరమున రాజ్యమునకు వచ్చెను. ఈజగదేవరావు శివాజీకిని ఇబ్రహీం
1550-80 కుతుబ్ శాహాకును మైత్రి యొనరించి యుభయులవలనను మిక్కిలి మన్ననలను బడసెను. ఈజగదేవ

రావు గోలకొండనవాబునకు ముఖ్యమంత్రిగా నుండెను. ఇతనితరువాత "మురారిరావు" అనునతఁడు ప్రధానమంత్రి పదవి నందెను. ఇతఁడు గోలకొండరాజ్యములోనికి పెక్కండ్రి మహారాష్ట్రసరదారులను చేరఁదీసెను. కొండవీడు, రాజమహేంద్రవరము, కాసింకొండ యితనిరాజ్యములో ముఖ్యమైన ఠాణాలు. ఇతఁడు కళింగరాజ్యములో శ్రీకాకుళపర్యంతమును స్వాధీనము చేసికొనెను.

౪. 'మహమ్మదు కులీకుతుబ్ శాహ' అనునతఁడు 1580 సంవత్సరమున రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు తనతండ్రి

1580-1611 తాతలకాలములో సంపాదింపఁబడిన కళింగరాజ్యమున తనయధికారము బలపఱుచుటకై 1604 సంవత్సరమున అశ్వారాయనింగారికిఁ గొంతసైన్యము నిచ్చి కళింగరాజ్యమునకుఁ బంపెను. అతఁడు శ్రీకూర్మమువఱకును వెళ్లినట్లు సింహాచల శ్రీకూర్మములలోని శాసనములు చెప్పుచున్నవి. 1611 సంవత్సరమున మహమ్మదు కూలీకుతుబ్ శాహ కాలధర్మము నొందెను.

౫. అబ్దుల్లాహుసేన్ కుతుబ్ శాహ:—1611-58.

ఇతఁడు 1611 సంవత్సరమున రాజ్యమునకు వచ్చెను. 1628 వ సంవత్సరమున డచ్చివారికి ఫేక్టరీకట్టుకొనుటకు భీమునిపట్టణము నొసఁగెను. షాజహానుచక్రవర్తి

1611-58 దక్షిణదిగ్విజయయాత్రకు వచ్చినప్పుడు 1630 సం

త్సరమున ఢిల్లీసుల్తానునకు కప్పముకట్టుకొనుట కీతఁ డొప్పు కొనెను.

ఇట్లుండఁగా కళింగరాజ్యములో నిదివఱకు లోఁబడిన భాగములనుండి సొమ్ము సమముగా రాకపోవుటచే 1652 వ సంవత్సరమున షేర్‌మహమ్మద్‌ఖానుని శ్రీకాకుళమునకు ఫౌఁజుదారుగా పంపెను. ఈఫౌఁజుదారు జమీందారుల రాఁబడిలో $\frac{1}{10}$ పదవవంతు వసూలు చేయుచుండును. రాఁబడితో సంబంధించిన లెక్కలన్నియును జమీందారులే భద్రిపఱచుచుందురు. ఈఫౌఁజుదారునకు రెవెన్యూ వసూలుచేయుటతప్ప ప్రజలపై నెట్టియధికారమును లేదు. ఇతనికి ఆత్మసంరక్షణార్థము కొంతపరివార ముండును. ఇచ్చటి ఫౌఁజుదారులలో నీతఁడే మొదటివాఁడు.

(ఫౌఁజుదారుల యేలుఁబడి)

1. షేర్‌మహమ్మద్‌ఖాను:—1652-1682.

ఈకాలమునాఁటి దేశస్థితి.

ఈప్రాంతములోని జమీందారీ లన్నిటిలోను నందాపురముజమీందారీ చాల ప్రాచీనమైనది. ఈకాలము (1637-1669) నందాపురముజమీందారు లగు శ్రీ వీరవిక్రమదేవమహారాజులుంగారు జయపురములో నొక పెద్దకోట కట్టించి తమరాజధానిని నందాపురమునుండి జయపురమునకు

మార్చిరి. అప్పటికి వీరిరాజ్యము ఘాటీలదిగువ చాలభాగము వఱకును వ్యాపించియుండెను. వీరు గోలకొండనబాబునకు సాలునకు 24000 రూపాయిలు కట్టుచుండిరి.

అప్పటికి పూసపాటి అన్నమ (పెదజగన్నాథ) రాజుగారి జేష్టపుత్రులగు కృష్ణమరాజుగారు పొట్నూరును, (రెండవ కుమారుఁడగు) రామరాజుగారి పుత్రులు కృష్ణమరాజుగారు రేఁగను పరిపాలించుచుండిరి. వీరు పూసపాటి పెదజగన్నాథరాజుగారి కుటుంబములోనివారు.

పూసపాటి పెదకృష్ణమరాజుగారు (౧)



ఇట్లుండఁగా షేర్ మహమ్మద్ ఖానుతో పూసపాటి చినజగన్నాథరాజుగారి కుటుంబస్థులును కొండ్రాజుగారి పుత్రులును నగు రఘునాథరాజుగారును, చెలికాని వేంకటరావుగారి కుమారులగు పెదరాయఁడప్పగారును సరదారులుగా నీప్రాంతమునకు వచ్చిరి.

రఘునాథరాజుగారి వృత్తాంతము.

ఈ రఘునాథరాజుగారు మొదట గోలకొండనవాబుల కొలువులో సరదారుగా నుండెను. పిమ్మట షేర్ మహ
1652 మ్మద్ ఖానునివలన సిఫారసు పొంది 1652 వ సంవత్సరమున కొండపల్లెసర్కారులో సరదారుగాఁ బ్రవేశించెను. అదిమొదలు ఉద్యోగస్థుల (హాకీముల) యొద్ద పూసపాటి మాధవవర్మ యనుపేరుతో సరదారీలో ప్రవర్తించుచుండెను. 1655 వ (మన్మథ) సంవత్సరమున షేర్ మహమ్మద్ ఖాను రఘునాథరాజుగారికి భోగాపురము మున్నగుపరిదేశములు యిజారాకు నిచ్చిరి. ఈ గ్రామములతోఁబాటు నూరుగురు సిబ్బందినికూడ వీరి కిచ్చిరి.

పిమ్మట రఘునాథరాజుగారు భోగాపురములో నొక యిల్లు కట్టుకొని పూసపాడునుండి తమకుటుంబమును తెచ్చుకొనిరి. వీరు తమసిబ్బందికర్చు పోఁగా సర్కారునకు 2702-12-3 సంవత్సరమునకు కట్టుచుండిరి.

ఇట్లు రఘునాథరాజుగారు షేర్ మహమ్మద్ ఖాను కొలువులో సరదారుగా నుండి పనిచేయుచుండఁగా నీతని కుమారుఁ డగు సీతారామచంద్రుఁడును సోదరుఁ డగు కృష్ణ భూపాలుఁడును జయపురమువారి కొలువులో సరదార్లుగా ప్రవేశించిరి. ఇందులో సీతారామచంద్రుఁడు జయపురము వారి కన్యను వివాహముచేసికొనినట్లును పెండ్లికుమార్తెకు పసపుకుంకుమక్రింద కుమెల, గంధేద్రు, దేవుపల్లి పరగణాలు మూడును వీరి కిచ్చినట్లు కొన్నిగ్రంథములు చెప్పుచున్నవి. జయపురమువారి కన్యను సీతారామచంద్రుఁడు వివాహము చేసికొనుటయొక్క సత్యాసత్యము లెట్లున్నను, 1669 మొదలు 1672 సం॥ వఱకు జయపురమును పరిపాలించిన శ్రీ వీరకృష్ణదేవమహారాజులుంగారివలన కుమెల, గంధేద్రు, దేవుపల్లి పరగణాలు వీరి కీయఁబడినట్లు *చరిత్రలు చెప్పుచున్నవి.

ఇంతియకాక యీ వీరకృష్ణదేవమహారాజులుంగారు తమకాలములో బొబ్బిలి, రేకపల్లి, నరవ, కొట్టక్కి, సాలూరు జమీందారీలు కూడ నేర్పాటుచేసి, రఘునాథరాజుగారి సోదరులగు కృష్ణభూపాలరాజుగారికి రేఁగులవలసమొఖాసా నొసఁగిరి.

---

* The Aristocracy of S. India page 70 bv Vadivelu.

శ్రీ వీరకృష్ణదేవమహారాజులుంగారు 1672 వ సంవత్సరమున స్వర్గస్థులైనపిమ్మట ఆయనకుమారులగు శ్రీ విశ్వంభరదేవమహారాజులుంగారు రాజ్యమునకు వచ్చిరి. వారి కాలములో (1672-76) 1 పెదపదము, 2 రామభద్రపురము, 3 మక్కువ, 4 సివిడి, 5 కురుపాం, 6 మేరంగి, 7 పాలెముతా, 8 పాలకొండ, 9 పాచిపెంట, 10 పోరాం, 11 రంగవలస, 12 బిరికోటు, 13 ఆండ్ర, 14 కోడూరు, 15 సంబాము, 16 కాలహాండి, 17 బొండపల్లి, 18 బింద్ర, 19 నోవోగడ, 20 ఖరియార్ మున్నగు జమీనుల నేర్పఱచిరి.

సీతారామ చంద్రుఁడు.

పై జమీందారులందఱిలో పూసపాటి సీతారామచంద్రుఁడు జయపురముమహారాజులుంగారికి బంధువును మిత్రుఁడును నైయుండుటచేత నీతఁడీదేశములో మిక్కిలి పలుకుఁబడిని సంపాదించెను. ఇతనికున్న పలుకుఁబడి యితనితండ్రిగారగు రఘునాథరాజుగారికి లేదు.

ఈయనతండ్రిగారును నీయనయు పూసపాడునుండి యీప్రాంతమునకు వచ్చుటకు షేక్ మహమ్మద్ ఖానుఁడే కారణమైనను నీతఁడు ఖాను నెన్నఁడును లక్ష్యముచేసినట్లు కనఁబడదు. రేఁగులవలస, రేఁగ, పొట్నూరు పూసపాటికుటుంబములవారితోడను మిగిలిన జమీందారులతోడను నీతఁడు సఖ్య మొనరించుకొని వారినందఱను తన పలుకుఁబడిలోనికిఁ దెచ్చికొనెను.

అప్పుడు మహమ్మదీయదొరతనము చాల బలహీనము గానుండుటచే తఱచుగా నీ జమీాందారులు మహమ్మదీయ ప్రభుత్వముపై తిరుగుఁబాటు చేయుచుండిరి. అట్టివారికి జయపురముమహారాజులుంగారును, సీతారామచంద్రుఁడును ప్రధాననాయకులుగా నుండిరి.

ఒక్క రాజాంజమీాందారుఁ డగు పెద్దరాయఁడును నాతని కుమారుఁడగు లింగప్పయు మాత్రము మహమ్మదీయ ప్రభుత్వముపై తమ రాజభక్తిని జూపుచుండిరి. మిగిలిన జమీాందారు లందఱును క్షత్రియులగుటచేతను, వారి జమీాందారీలన్నియును జయపురము మహారాజావారిచే నొసఁగఁబడిన వగుటచేతను కాఁబోలు సాధారణముగా వారందఱును కలసి యొక్కటగుటయు రాజాంజమీాందారుమాత్రము వారితోఁ గలియకపోవుటకును కారణమై యుండును.

ఇట్టిపరిస్థితులలో గోలకొండనవాబగు తానీషా 1682 వ సంవత్సరమున షేర్ మహమ్మదుఖానునకు బదులుగా ముస్తాఫాఖులీఖానుని నీప్రాంతమునకు ఫౌఁజుదారునిగాఁ బంపెను.

ఈ ముస్తాఫాఖులీఖానుని యధికారముక్రింద నొక్క శ్రీకాకుళముసర్కారేకాక కొండవీడు, కొండపల్లి, మచిలీపట్టణము, ఏలూరు, రాజమహేంద్రవరము సర్కారులుగూడ నుండెను.

ముస్తాఫాఖులీఖాను 1682–1697

1682 వ సంవత్సరములో తూర్పిండియాసంఘమువారీ ప్రాంతమునకు వర్తకమునకు వచ్చి మొదట విశాఖపట్టణము
1682 లో తమ వర్తకస్థాన మేర్పాటు చేసికొనిరి.

1685 సంవత్సరమున పూసపాటి రఘునాథరాజుగారు కాలముచేయ నాయనకుమారుఁ డగు సీతారామచంద్రుఁ
1685 డు తండ్రిగారి సరదారీలో తాను ప్రవేశించి సరదారీకి తనపేరు మొఖరరు చేయించుకొనెను.

ఇచ్చటిపరిస్థితు లిట్లుండ ఢిల్లీసుల్తానగు ఔరంగజీబు 1687 వ సంవత్సరమున గోలకొండపై దండెత్తినచ్చి గోల
1687 కొండరాజ్యమును నశింపఁజేసి గోలకొండనవాబగు తానీషాను దౌలతాబాదుదుర్గముమీఁద చెఱఁబెట్టి గోలకొండలో మొగలాయీరాజప్రతినిధి నొకని నేర్పాటు చేసెను. నేఁటినుండియు దక్షిణహిందూస్థానమున "కుతుబ్ శాహా" వంశ మంతరించి మొగలాయిపరిపాలన మారంభించెను.

ఔరంగజేబు గోలకొండరాజ్యమును జయించిన సంవత్సరముననే వారి సరదారులలో ముఖ్యులును బలవంతులును
మొగలాయిపరిపాలనము నగు పూసపాటి సీతారామచంద్రునకు
1687 "జుల్ ఫికార్" అను రెండంచుల కత్తిని బహుమానముగాఁ బంపెను. (ఇప్పటికిని దానిచిహ్నమే వారి పతాకముపై చిత్రింపఁబడియున్నది.)

ఈపూసపాటి సీతారామచంద్రుఁడు 1690 సంవత్సరమున పర్లాకిమిడి గజపతిదేవమహారాజుతో స్నేహ మొనరించి మఱింత వృద్ధిచేసికొనెను. ముస్తాఫాఖులీఖానుఁడు జమీాందారులయెడ సగౌరవముగా మెలఁగకపోవుటచే 1694 వ సంవత్సరమున నీ సీతారామచంద్రుఁడును నితరజమీాందారులును కలసి ముస్తాఫాఖులీఖాను నోడించి ఫౌఁజుదారుని నామమాత్రావశిష్టముగా నొనరించెను. ఇంతలో 1696 వ సంవత్సరమున సీతారామచంద్రుఁడు స్వర్గస్థుఁ డయ్యెను. ఆయనకు సంతానము లేకపోవుటచే పొట్నూరులోని పూసపాటి కృష్ణమరాజుగారి కనిష్ఠపుత్రుఁడగు ఆనందరాజును పెంచుకొనెను.

ఆనందరాజు బాలుఁడగుటచే సరదారీకి ఆయన జనకసోదరుఁడగు అన్నమరాజు మొఖరరయ్యెను. ఈ అన్నమరాజుగారు ఆరుమాసములుమాత్రమే సరదారీ చేసి రాజమహేంద్రవరముదగ్గర నున్న ఓరిగెడ్డయుద్ధములో నీయన చనిపోయిరి. ఈయనతరువాత పూసపాటి తమ్మిరాజుగారు సరదారీకి మొఖరరైరి.

సీతారామచంద్రుఁడు చనిపోవుటయు నాతనితరువాత సరదారీచేసిన అన్నమరాజు 6 మాసములలో చనిపోవుటయు కనిపట్టి ముస్తాఫాఖులీఖానుఁడు మరల జమీాందారులపైఁ బగ సాధించుకొనుటకుఁ బ్రయత్నించెను. కాని తమ్మిరాజుగారును మిగిలిన జమీాందారులును కలసి వెంటనే ఫౌఁజుదారుని

పైకి యుద్ధమునకు వెళ్ళి ఆయుద్ధములో (1697 వ సంవత్సరమున అక్టోబరు) ఫౌజుదారుని వాని సైనికులలోఁ బెక్కండ్రినుకూడఁ జంపిరి.

1697 వ సంవత్సరమున చనిపోయిన ఫౌజుదారు స్థానమున రుస్తుందిలేఖానుఁడు ఫౌజుదారుగా వచ్చెను. ఇతఁడు చాల బలవంతుఁడును నేర్పరియునై యుండెను. ఇతఁడు జమీందారులతో నెట్టికలహము లను పెట్టుకొనక వెనుకటి ఫౌజుదారుని మిత్రుల నందఱను శిక్షింపసాగెను. ఇతఁడు సుమారు 7 మాసములుమాత్రము ఫౌజుదారుగా నుండెను.

రుస్తుందిలేఖాను 1697–98

రుస్తుందిలేఖానుని స్థానమున 1698 సం॥ మే నెలలో 'ఫకీరల్లీఖానుఁడు' ఫౌజుదారుగా వచ్చెను. ఇతఁడు చాల గర్వి. ముస్తాఫాఖులీఖానునివలె నితఁడును జమీందారులతో మరల కలహమును తెచ్చిపెట్టుకొనెను. ముస్తాఫాఖులీఖానుని చంపించిన తిమ్మరాజుపై నీతఁడు పగ సాధించుకొననెంచి యొకనాఁడు తిమ్మరాజును తన దర్బారునకుఁ బిలువనంపి మోసముచే నాతనిని *జంపించెను. ఈవిషయము ఆనందరాజునకు తెలిసి ఫౌజుదారుని

ఫకీరల్లీఖాను క్రీ॥ 1698–1700

* On Dec. 10, 1700 the chief at Vizagapatam advises the President and Council at Fort St. George that the Nawab of Chicacole having treacherously murdered one Timmaraj (1696–1700) by inviting him to the Darbar............

పైని పగ సాధించుకొనుటకై యనేకసైన్యములను పోగుచేసి ఫౌజుదారునిపై దండెత్తెను. ఫౌజుదారు తనబలమునంతయు వినియోగపఱచి ఆనందరాజు నెదిరించెను. కాని ప్రయోజనము లేక పలుతావుల పూసపాటివారి సైన్యములచే నోడి, పంబడి తుదకు శ్రీకాకుళము పాఱిపోయి తలుపులు మూసికొని కోటలో దాగియుండవలసివచ్చెను. పిమ్మట ఆనందరాజు కశింకోట లోనగుస్థలముల వశపఱచుకొని దేశమునంతటిని భీభత్సము చేసెను. ఈవేడికి తాళజాలక ప్రజ లడవులు పట్టిరి. ఇతని తోడియల్లుడును అనకాపల్లి జమీందారుడును నగు (కాకర్లపూడి) పాయకరావు సర్వవిధముల నీతనికి బాసటగా నుండెను.

తిమ్మరాజు కాలముచేసినపిమ్మట ఆనందరాజుగారి యన్నగారగు వేంకటపతిరాజుగారు సరదారీకి ముఖరైరి. ఆనందరాజుగారు దివానుగా రాజ్యవ్యవహారము లన్నియును జూచుచుండిరి. వేంకటపతిరాజుగారు కేవల సాత్వికస్వభావ సంపన్ను లగుటచే జపతపములు, దానధర్మములు, పండితగోష్ఠి, కవులను గౌరవించుట, దైవభక్తి లోనగుసత్కార్యముల యందే యాయన ప్రవర్తించుచు రాజ్యభారమంతయు తమ్మునిపైని విడిచిపెట్టెను. ఈయన గొప్పకవి. ఉషాభ్యుదయమను మహాప్రబంధమును రచించి దానిని రామతీర్థము శ్రీరాముల కంకిత మిచ్చెను. ఈయనకు 'మహామండలేశ్వర,

మహీమండలరాయ, మన్యసుల్తాన్' బిరుదము లున్నట్లు లాగ్రంథములోని యీక్రిందిగద్యము చెప్పుచున్నది.

గద్య:—ఇది శ్రీరామతీర్థ సీతారామవరప్రసాద లబ్ధ కవితాపవిత్ర కృష్ణరాయమహీపాలగర్భాంభోనిధి పూర్ణరోహిణీకళత్ర సరససంగీత సాహిత్య విద్యాచమత్కార మాధవవర్మవంశాలంకార శ్రీమన్ మహామండలేశ్వర మహీమండలరాయ మన్యసుల్తాన్ సమాశ్రితబంధుజననిధాన సతతదాన రంజితవిద్వత్కవిజాల పూసపాటి వెంకటపతిభూపాల ప్రణీతం బైన యుషాభ్యుదయం బను మహాప్రబంధంబునందు ప్రథమాశ్వాసము, ౧౧."

ఈయన కొత్తాము, సంగివలస, ఋషికొండ, రేవడి మధుర వేంకటరాజపురము మొదలగు అగ్రహారము లనేకములు బ్రాహ్మణుల కొసంగెను. ఆశాసనములలోఁ గూడ "శ్రీమన్ మహామండలేశ్వర మహీమండలరాయ మన్య సుల్తాన్" బిరుదములు కొనవచ్చుచున్నవి. ఈయన చేసిన కొత్తాముఅగ్రహారమునకుఁగూడ వేంకటపతిరాజపుర మను నామ మున్నట్లు ఆశాసనము చెప్పుచున్నది. ఆశాసనమున:—

"శాకేశ్మిన్ ఋషిరామశాస్త్రశశభృత్ సంఖ్యాయుతే మన్మథే" యనుటవలన శాలివాహనశకము ౧౬౩౭ సంవత్సరమునకు సరియైన మన్మథనామసంవత్సరమున (వైశాఖశుద్ధపౌర్ణమి స్థిరవాసరమున సోమోపరాగపుణ్యకాలము)

నీగ్రామము అగ్రహారము చేసినట్లు స్పష్టపడుచున్నది. అనఁగా క్రీ. శ. 1715 వ సంవత్సరమువఱకును నీతఁడు జీవించియుండెనని చెప్పుట కెట్టియభ్యంతరమును లేదు. పిమ్మట యెంత వఱకు జీవించెనో తెలియదు.

ఈయన పేరునకు రాజైనను సమస్తరాజ్యవ్యవహారములును ఆనందరాజే చూచుకొనుచుండెనని యిదివఱకే వ్రాసియుంటిమి.

ఫకీరల్లీఖానుఁ డానందరాజుధాటి కీప్రాంతమున నిలువలేక పాఱిపోయినపిమ్మట నాతనిస్థానము మోహదిన్‌ఖానుఁడు ఫౌఁజుదారునిగా వచ్చెను. ఇతఁ డొక్క సంవత్సరముమాత్రమే యీపదవియం దుండెను. ఇతఁడు తనకాలములో జమీందారులతో నెట్టియల్లరులను దెచ్చిపెట్టుకొనక చాల భద్రముగా మెలఁగెను.

మోహదిన్‌ఖాను 1700–1701

మోహదిన్‌ఖానునకు పిమ్మట ముస్తబందఖానుఁడు ఫౌఁజుదారుగా వచ్చెను. ఇతఁడు చాల బలహీనుఁడు. భయస్థుఁడు. ఇతఁడు జమీందారుల అడుగులకు మడుగు లొత్తుచు కాలక్షేపము చేయుచుండెను. అయినను నేకారణముచేతనో 1702 వ సంవత్సరమున జమీందారులు మరల తిరుగుఁబా టొనరించిరి. అప్పు డీతిరుగుఁబాటును శాంతపఱచుకొనుటకు జమీందారులకు లక్షరూపాయిలు లంచ మిచ్చుకొనెను.

ముస్తబందఖాను 1701–1702?

వెనుక నొకసారి యీసర్కారులో 7 మాసములు ఫౌజుదారీ చేసిన రుస్తుందిలేఖానుఁడు మరల 1702 వ సంవత్సరమున ఫౌఁజుదారుగా నుండిన రమారమి రెండు సంవత్సరములును జమీందారులతో సఖ్యమొనరించుకొని ఆనందరాజును, జయపురము రఘునాథకృష్ణదేవుని మంచిచేసికొనెను. అందుచే నితనికాలములో మఱియేమియు తొందరలు లేకపోయెను.

రుసుందిలేఖాను 1702-1704

రుస్తుందిలేఖానుఁడు వెళ్లిపోయినపిమ్మట మరల ఫకీరల్లీఖానుఁడు ఫౌఁజుదారుగా వచ్చెను. ఈపర్యాయ మీతఁడానందరాజుదగ్గర చాల భయభక్తులతో మెలఁగనారంభించెను. అవసరపడినప్పుడెల్ల ఆనందరాజునకును నితరజమీందారులకును నీతఁడు కొంతసొమ్ము నిచ్చుచు తనసఖ్యమునకు భంగము లేకుండ చూచుకొనుచుండెను.

ఫకీరల్లీఖాను 1704-1710

క్రీ. శ. 1710 వ సంవత్సరమున ఫకీరల్లీఖానునకు బదులు హాబీబ్‌ఖానుఁడు ఫౌఁజుదారుగా వచ్చెను. ఇతఁడు ఫకీరల్లీఖానునకు పరమశత్రువు. అందుచే ఫకీరల్లీఖానుఁ డిదివఱకు జమీందారులతో చేసికొనిన సఖ్యమును నీతఁడు మరల భంగపఱచెను. దానిపై హాబీబ్‌ఖానునకును జమీందారులకును గొన్నిసంవత్సరము లెడతెగక పోరాటము జరుగుచువచ్చెను. 1712 వ సంవత్సర

హాబీబ్‌ఖాను 1710-1717

మున ఆనందగజపతి 10000 సైన్యముతో శ్రీకాకుళము చని మహమ్మదీయసైన్యముల నోడించి నిరాఘాటముగా శత్రుపట్టణములను పల్లెలను నాశనముచేసి దోఁచుకొననారంభించెను. ఇట్లు స్వదేశసంస్థానాధీశ్వరుల స్వాంతంత్ర్యము నడఁగఁద్రొక్కుటకు మహమ్మదీయప్రభుత్వమును మహమ్మదీయపరిపాలనమును నాశనముచేయుటకు స్వదేశసంస్థానాధీశ్వరులును పెక్కేండ్లు పోరాడిరి.

ఈపోరాటముమధ్యముననే ఆనందరాజు 1713 వ సంవత్సరమున (విజయ) విజయనగరమనుపట్టణమును నచ్చట మిక్కిలి బలమగు నొకరాతికోటను కట్టించెను. ఈకోట పూర్తియగుటకు పూర్వమే యీమొదటి యానందగజపతి 1717 సంవత్సరమున కాలధర్మము నొందెను. ఈయన యవసానకాలమున వేంకటపతిరాజుగారి కుమారుఁడగు (అన్న కుమారుఁడు) సీతారామరాజునకు పట్టముకట్టి తనకుమారుఁడును బాలుఁడును నగు విజయరామగజపతిని నాయన కప్పఁజెప్పెను. ఈయన తనకాలములో మహమ్మదీయప్రభుత్వమునకు నెన్నఁడును కప్పము కట్టకపోవుటయేకాక పైగా ఫౌఁజుదారులనుండియే లక్షలకొలఁది ధనమును లంచములక్రింద స్వీకరించుచుండెను. మహమ్మదీయప్రభుత్వము నామమాత్రమేకాని యెంత కెక్కువ లేదు.

1717 వ సంవత్సరమున అరబీఖానుఁడు ఫౌఁజుదారు గా వచ్చెను. ఇతఁడు జమీందారు లెవ్వరితోడను కలహములు పెట్టుకొనలేదు. సీతారామరాజు జమీందారు లెల్లరిలో నగ్రస్థానము వహించి కళింగరాజ్యమునవ్యవహరించుచుండెను. ఈయన పినతండ్రికుమారుఁడగు విజయరామగజపతి యీయనకు బాసటయై సర్వవిధములనీతనికి తోడుపడుచుండెను. అరబీఖానుఁడు మూడేండ్లుమాత్రమే ఫౌఁజుదారుగా నుండి 1720 సంవత్సరమున వెళ్ళిపోయెను.

అరబీఖాను 1717-1720

అరబీఖానునకు పిమ్మట షూలాఖానుఁడు ఫౌఁజుదారుగా వచ్చెను. ఇతఁడు మూఁడుసంవత్సరములుమాత్రమే యుండి 1724 సంవత్సరమున వెళ్ళిపోయెను. ఈ మూఁడు సంవత్సరములలోను నెట్టియల్లరులును లేవు. నానాఁటికి ఫ్రాసపాటివారి బల మీప్రాంతమున హెచ్చుగుచుండెను. మహమ్మదీయులపరిపాలనము తగ్గుచుండెను.

షూలాఖాను 1720-24

దక్కనుసుబేదారుని స్వాతంత్ర్యము.

1707 వ సంవత్సరమున ఢిల్లీసుల్తానగు ఔరంగజీబు కాలధర్మము నొందినపిమ్మట దక్షిణహిందూస్థాన మరాజకమయ్యెను. స్వతంత్రసంస్థానాధిపతులు వారిలోవారు రాజ్యములకై పోరాడ నారంభించిరి. ఔరంగజీబుసింహాసనమునకై యాతనికుమారులు తమలోఁదాము కలహించిరి. విదేశవర్తకులగు ఇంగ్లీషు, ఫ్రెంచి, డచ్చి, కంపెనీలవారు వారివారి స్వదేశములలాభములకై పెనఁగులాడసాగిరి. ఒకప్రక్క

నుండి మహారాష్ట్రులు విజృంభించిరి. ఇట్లు దాదాపుగా నలువదిసంవత్సరములకాలము దేశ మరాజకస్థితియం దుండి యంతటితో మొగలాయిసామ్రాజ్య మంత మొందెను.

దేశ మిట్టియరాజకస్థితిలో నున్నప్పటి దక్కనుసుబేదారుఁడు "మీర్ కామ్రుడ్డీన్" ఇతనికి ఢిల్లీసుల్తానగు ఫెరుక్సయ్యర్ "నైజాముల్ముల్కు" అను బిరుదము నొసఁగి దక్కనుసుబేదారునిగాఁ జేసెను. ఇతఁడు దక్షిణహిందూస్థాన మంతయుఁ దనస్వాధీనములోనికిఁ దెచ్చికొనెను. *1724 వ సంవత్సరమున ఢిల్లీచక్రవర్తి (మహమ్మద్ షా) యనుజ్ఞలేకుండఁగనే రాజ్యములోఁ దనయిచ్ఛవచ్చినట్లు తన స్వంత యుద్యోగస్థుల నేర్పాటుచేసికొనెను. అప్పటివఱకును సీఘాఁజుదారులు సర్కారులలోనికి వచ్చుచుఁ బోవుచుండుటయే జరుగుచున్నది కాని యేజమీందారును గోలకొండప్రభుత్వమునకుఁ గాని ఢిల్లీప్రభుత్వమునకుఁ గాని యొప్పుకొని వారికి లోఁబడినవా రెవరును లేరు. అంతవఱకును స్వదేశసంస్థానాధీశ్వరులే రాజ్యపరిపాలనమును జేసికొనుచుండిరి.

---

* Aurungazeeb annexed Golcondah in 1688 and Calinga (......) thus became part of the Mogul Empire, but the occupation was little more than a Military one, and the Hindu Chiefs were left much to themselves till 1724, when Yoosaf Jah the great Nizam-ool-Moolk took actual possession of the country.

(Madras Manual of Administration Vol. I P (133) foot note)

1724 వ సంవత్సరమున నైజాముల్ముల్కు సర్కారులుకూడ వశపఱచుకొననెంచి యిదివఱకు ఫౌజుదారుగా నున్న అరబీఖానుని శ్రీకాకుళమునుండి తప్పించి తనకు నమ్మకమగు ఫౌజుదారు లభించువఱకును విజయరామరాజును సర్కారులు చూడవలెనని కోరెను. విజయరామరాజు నైజాముపక్షమున సర్కారులలో ప్రతినిధి (Governor) గా నుండుట కొప్పుకొనిన సర్కారులు తనస్వాధీన మయ్యెననియే నైజాముల్ముల్కు అభిప్రాయము. *

విజయరామగజపతి శ్రీకాకుళముసర్కారునకు ఫౌజుదారుగా నుండుట కొప్పుకొనెను. ఈవిధముగా శ్రీకాకుళముసర్కారు నైజామునకు 1724 వ సంవత్సరమున స్వాధీన మయ్యెను.

విజయరామగజపతి 1724

శ్రీకాకుళముసర్కారు పేరునకుమాత్రము నైజాముల్ముల్కునకు స్వాధీనమైనను నాతఁడు జీవించియున్నంతకాలమును (1737 వఱకు) నెన్నఁడును నీసర్కారుపై తన యధికారమును చలాయించ లేదు. ఇక్కడకువచ్చు ఫౌజుదారులందఱును విజయరామరాజున కనుకూలురుగనె ప్రవర్తించుచు పోవుచుండిరి. ఈయన కనుకూలముగా నేఫౌజుదారుఁడైన ప్రవ

---

* ...... The actual possession means nothing else than that Rajah Vijiaramaraj had accepted that self-same year, the Governorship of the Circar of Chicacole."

(Vizianagram Treaty Page 26) by Ananda Gajapathi III).

ర్తింపకుండినవెంటనే నైజామునకు వ్రాసి యితని నిచ్చటనుండి తొలఁగించి వానిస్థానమున క్రొత్తఫౌజుదారుని తెప్పించుచుండెను.

విజయరామరాజు *ఒకసంవత్సరము ఫౌజుదారుగా నున్నపిమ్మట నింతలో నైజాముల్ ముల్కు 'అన్వరుడ్డీన్ ఖాను'ని ఫౌజుదారుగా పంపెను.

అన్వరుడ్డీన్ ఖాన్ 1725-1740

ఈ అన్వరుద్దీన్ ఖాను కర్ణాటకనవాబులకు మూలపురుషుఁడు. ఇతఁ డిదివఱకు కోరాజహానాబాద్ ప్రాంతమున సుబేదారునిగా నుండెను. పిమ్మట నైజాముల్ ముల్కు తండ్రియగు గాజీఉద్దీన్ ఖాను ఇతనికి సూరతులో గొప్పయుద్యోగ మిచ్చెను. ఇప్పుడు నైజాముల్ ముల్కు ఇతనిని కర్ణాటకప్రభువుగాఁ జేసి 1725 వ సంవత్సరమున శ్రీకాకుళమునకు ఫౌజుదారుగాఁ బంపెను.

ఇతనికాలములో 1731 వ సంవత్సరమున విజయరామరాజుగారికిని వారి సోదరులగు (వేంకటపతిరాజుగారి కుమారుఁడు) సీతారామరాజుగారికిని మనస్పర్ధలు కలుగుటచే అన్వరుద్దీన్ ఖాను వీరి వివాదములను విచారించి రాజ్యమును కోటలును వీరికి చెఱిసగముగా పంచియిచ్చెను. నాఁటినుండియు విజయరామరాజుగారు విజయనగరమునను, సీతారామరాజుగారు దేవుపల్లిలోను నివసించుచుండిరి. ఇట్లు మూడుసంవత్స

* Rajah Vijaya Ramaraj held it for one year,.....
1724. (Sewell's list s of Antiquities Vol. I P. 8).

రము లుభయులును నెవరిరాజ్యములు వారు పరిపాలించు
కొనిరి.

పిమ్మట 1734 వ సంవత్సరమున నొకపర్యాయము అన్వరుద్దీన్ ఖాను ఇచ్ఛాపురముసర్కారులోని ప్రతాపగిరికోట పైకి యుద్ధమునకు వెళ్లినప్పుడు విజయరామరాజు సీతారామరాజుగారు లిరువురును నాతనితో వెళ్ళిరి. అప్పుడు విజయరామరాజుగారు సీతారామరాజుగారికి విషప్రయోగము చేయించుటచే నాయన చనిపోయినట్లు ప్రవాదము కలదు.

సీతారామరాజుగారు చనిపోయినపిమ్మట నాయనరాజ్యమును కుటుంబమునుగూడ విజయరామరాజుగారు స్వాధీనము చేసికొనెను. అప్పటికి సీతారామరాజుగారికి 'ఆనందగజపతి' యను రెండువత్సరముల కుమారుఁడు కలఁడు.

తిమ్మరాజుగారి మరణము:—ఈ విజయరామరాజు
గారిభార్య చంద్రయ్యమ్మగారు. ఈమెకు పెద్దాపురసంస్థానాధీ
పెద్దాపురము శ్వరుఁడగు మూఁడవతిమ్మరాజుగారి భార్య మేనకో
1734 డలు. 1734 వ సంవత్సరమున నీతిమ్మరాజుగారిని
రాజమహేంద్రవరములో ఫౌజుదారుగానున్న రుస్తుంఖానుఁడు తనదర్బారునకు సగౌరవముగా రప్పించి మోసముచేసి యతనిని చంపించెను. ఈయనకు 'జగపతి' యను నేఁడాదిబాలకుఁడు కలఁడు. ఈబాలకుని తిమ్మరాజుగారిభార్యయుఁ దల్లియు విజయనగర మంపి తా మగ్నిప్రవేశ మైరి. కాని మార్గమ

ధ్యమునఁ జేఁబ్రోలువద్ద రుస్తుంఖానుఁ డాబాలకుని బట్టి కారాగారమున నుంపించెను.

రుస్తుంఖానుని దారుణరాక్షసకృత్యములకు నెల్లరును భయావహులై యల్లాడుచుండ వానికుమారుఁడైన నూరుద్దీన్ హుస్సేన్ సేనానాయకుఁడుగా నుండి తండ్రిని పట్టించి వానిమెడ ఫూజుకఱ్ఱలమధ్యఁ బెట్టి నొక్కి చంపించెను. ఇట్లు నూరుద్దీన్ తనతండ్రియగు రుస్తుంఖానుని జంపించి దేశమునకు మహోపకార మొనరించెను.

'ఈరుస్తుంఖాను'ని మరణమును నూరుద్దీన్ తనపైయధికారికిఁ దెలియఁజేయనందుల కాతఁడు సంతసించి, దాడివెడలి జయించినచో కళింగరాజ్యమునకుఁగూడ నధికార మిచ్చితిమని యాతఁడు ఫర్మానా నిచ్చెను. కళింగరాజ్య మనఁగా పూసపాటివారి దేశమని యర్థము. ఫర్మానా నందుకొని నూరుద్దీన్ హుస్సేన్ కళింగదేశముపైకి యుద్ధమునకు బయలువెడలెను.

ఇంతలో తిమ్మరాజుగారిని రుస్తుంఖానుఁడు చంపి యాతనికుమారుని బంధించినవార్త కళింగాధిపతియగు విజయరామగజపతికిఁ దెలిసి నలువదివేల సైన్యముతోఁ దనభార్యకు మేనకోడలుకుమారుఁడైన జగపతిరాజను బాలకుని విడిపించుటకై బయలువెడలెను.

చేఁబ్రోలుయుద్ధము, 1734:-ఉభయసైన్యములును మార్గమధ్యమునఁ జేఁబ్రోలునొద్ద నెదుర్కొనెను. అప్పు డుభయ

పక్షములవారికిని ఘోరసంగ్రామము జరిగెను. అట్లు మహోగ్రముగ యుద్ధము జరుగుచుండ విజయరామరాజుగారి తురుపు *అనకాపల్లి బోయలనెడు ఫౌజు రెండువేలమంది సూరుద్దీన్ హుస్సేన్ ఖానుఁ డెక్కిన యేనుఁగును బొదివిపట్టి దాని పైనున్న యంబారీని చుట్టుకొని మహమ్మదీయు లొకమూల నీటెలును బల్లెములును పుచ్చుకొని పొడుచుచున్నను గొబ్బరి పుచ్చెలట్లు తలల నూడఁగొట్టుచున్నను వెనుకకుఁ దిరుగక తమప్రయత్నములనుండి మఱలక, యతిసాహసముతో నంబారీతాళ్లను త్రెంచివైచి సూరుద్దీన్ ఖానుని బట్టుకొని శిర
1734 స్సును ఖండించిరి. ఇట్లు సూరుద్దీను నంతమొందించి తిమ్మరాజుగారి కుమారుని విడిపించి విజయనగరము తీసికొని వచ్చెను. తనయన్నగారి కుమారుఁడగు ఆనందగజపతియు నీ బాలుఁడును సమానవయస్సు కలవారగుటచే చంద్రయ్యమ్మ గా రుభయులను పుత్రప్రేమతోఁ బెంచుచుండెను.

1740 సంవత్సరమున అన్వరుద్దీన్ ఖానునకు బదులుగా జాఫరల్లీఖానుఁడు శ్రీకాకుళముసర్కారునకు ఫౌఁజుదా
జాఫరల్లీఖాన్ రుగా వచ్చెను. ఇతఁడు 6 సంవత్సరములుమాత్ర
1740–1746 మిచ్చట నుండెను. ఈకాలములోనె విజయరామ

---

*అనకాపల్లిజమీందారులలోని యొకఁ డగు కాకర్లపూడి గోపాలరాజుగారు స్వయముగా సూరుద్దీన్ ఖానుని జంపినట్లు కాకర్లపూడివారి వంశావళి చెప్పుచున్నది.

రాజునకు నైజాము "మిర్జారాజా మన్యసుల్తాన్" అను బిరుదము నొసఁగెను.

1746 వ సంవత్సరమున జాఫరల్లీఖానునకు బదులుగా బహారుల్లాఖానుఁడు ఫౌఁజుదారుగా వచ్చెను. ఇతఁడు (దురుసు) తొందరస్వభావము కలవాఁడు. అందుచే విజయరామరాజునకును ఇతనికిని పడక అనేకసారులు ఖానుని విజయరామగజపతి యోడించెను. ఈసందర్భముననె అడిదముసూరకవి విజయరామరాజు జయమునుగూర్చి యిట్లు వర్ణించెను.

బహారుల్లాఖాను 1746-50

శా. ఢిల్లీలోపల గోలకొండపురి నిం డెన్ నీప్రశంసల్ గుజాల్
బల్లాలంబోడిపించి హుమ్మనియర బ్బానెక్కి పైకొంచుబా
దుల్లాఖానునిఁ బాఱఁదోలితివి నీదోశ్శక్తి సూబాలకున్
మళ్లింపన్ దరమౌనె! శ్రీవిజయరామా! మండలాధీశ్వరా!

ఇట్లుండఁగా 1748 సం॥ జూన్ 19 తేదీని నైజాముల్ ముల్కు కాలము చేసెను. అతని రెండవకుమారుఁ డగు నాజరుజంగు సైన్యాధిపతి యగుటచే నాతఁడు దక్కనురాజ్యము నాక్రమించుకొని సుబేదారుఁ డయ్యెను.

## విజయరామగజపతి పెద్దాపురముసంస్థానమును పునరుద్ధరించుట.

విజయనగరముకోటలోఁ బెరుఁగుచుండిన పెద్దాపురము తిమ్మజగపతి(మహారాజులుంగారి) కుమారుఁడగు జగపతి 1749 రాజునకును ఆనందగజపతికిని నాటలలోను మాటలలోను పడకపోవుటచే నావిషయమును కనిపెట్టి విజయరామ గజపతి యెట్లైన పెద్దాపురముసంస్థానమునకు మరల నీబాలు నభిషిక్తుఁజేసి యాతని నచ్చటకుఁ బంపనెంచెను. కాని దాదాపుగా పదునైదుసంవత్సరములనుండియు మహమ్మదీయపరిపాలనములో నుండిన పెద్దాపురము సంస్థానమును మరల నీబాలున కిప్పించుటయనిన మాటలతో పనికాదు. విజయరామగజపతి తన ప్రధానామాత్యుఁడగు బుద్ధాబుచ్చన్నగారితో స్థలమంతాంగములు చేసి యప్పుడమిర్‌దారుగా నుండిన "నీమత్ ఆలీ"ని మంచిచేసికొని యతనికి 90 వేల రూపాయిలు లంచ మిచ్చి తనకార్యమును నెఱవేర్చుకొనెను. ఇట్లు విజయరామగజపతి సఫలీకృతమనోరథుఁడై పదునారేండ్ల వయస్సుగల యావత్సవాయజగపతిరాజును 1749 సంవత్సరమునఁ దిరిగి యాతని పితృపితామహార్జిత మైన యాపెద్దాపురముసంస్థానమున కభిషిక్తునిజేసి పోయినరాజ్యమును నిలువఁబెట్టెను. విజయనగరమున

నుండఁగనె యీబాలునకు చంద్రియ్యమ్మగారు దంతులూరి రామరాజుగారి కుమార్తెయగు సీతయ్యమ్మగారి నిచ్చి వివాహ మొనరించెను.

ఇంతలో నాజరుజంగునకు ఓడి పాఱిపోయిన ముజఫరు జంగు ఫ్రెంచివారి యనుగ్రహమును బడసి 1750 సంవత్సరమున దక్కనురాజ్యమునకు సుబేదారుఁ డయ్యెన్. ఆసంవత్సరముననే విజయరామగజపతి యాగ్రహమునకు గుఱియై బహరుల్లాఖానుఁడు శ్రీకాకుళమునుండి తొలఁగింపఁబడెను.

1750 సంవత్సరమున బహరుల్లాఖానుస్థానమున జాఫరల్లీఖానుఁడు మరల ఫౌజుదారుగా వచ్చెను. ఈదినములలో

**జాఫరల్లీఖాను 1750-53**

ఫ్రెంచివారి ప్రభ నైజామురాజ్యమునందును కర్ణాటకరాజ్యమునందును తదితరప్రదేశములయందును పూర్తిగా వ్యాపించెను గాని యింకను విజయరామరాజు పరిపాలించుచుండిన కళింగరాజ్యమునకుమాత్రము వ్యాపించలేదు. అందుచేతనే విజయరామరాజుగారి దయను సంపాదించుకొనుటకై ఫ్రెంచివారును ఇంగ్లీషువారును కూడ అనేకమైన తాపత్రయములు పడుచు వచ్చిరి. 1751 సం॥ నవంబరు 7 తేదీని విజయరామరాజుగారు అంతర్వేది వచ్చినప్పుడు బెండమూరులంకయును మఱికొన్ని గ్రామములును తమకు కౌలున కిప్పించవలసినదని యుభయులును

విజయరామరాజుగారి కనేక కానుకలు సమర్పించుకొని విన్న వించుకొనిరి. *

శ్రీకాకుళము ఫౌజుదారులకును కళింగదేశాధీశు లకును నీదినములలోనె నెక్కువగా యుద్ధములు జరుగుచుం డెను. నారాయణదేవులోనగు నితరజమీందారులు కూడ విజయరామరాజుగారితో కలిసి మహమ్మదీయప్రభుత్వమును నాశముచేయుటకుఁ బ్రయత్నించుచుండిరి. Letter from Mr. Wescott at Vizagapatam to Governor dated 26-4-1753 refers to the "troubles which seem to be

* "The French sent presents to him and so did the English, each wishing to obtain from him a cowle for Bendamoor Lanka and a few other towns. But Viziaramaraj, true to his friendship with the English, assured them that if he got Firmanas from Salabat Jung or even from the Great Moghul himself to that effect he would not place the French in possession of these places"—

"In the course of the negotiations for Bendamoor Lanka and other places, John Andrews, Resident at Madapalam, on behalf of the English reminded Viziaramaraj of the long friendship that had subsisted between him and the English and represented that the business of the English would be entirely stopped if the French got possession of the places and Viziaramaraj decided to help the English"

(Letter from the President of Vizagapatam dated 10-11-1751).

beginning by a disagreement between the Nabob and the Rajah who are both augmenting their forces." Another letter from the same officer dated 9-11-1753 acquaints the Governor "that Viziaramaraj after being joined by Narayanadas made an attack on the Nabobs camp and carried it. The Nabob narrowly escaped with his women and horses."

ఉత్తరసర్కారులు
ఫ్రెంచివారి కొసఁగఁబడుట. 1753.

1750 సంవత్సరము డిశంబరు 5 తేదీ మొదలు 1751 సంవత్సరము జనవరి 30 తేదీవఱకును గల 55 దినములును

మచిలీపట్టణము 1750

హైదరాబాదునకు నవాబుగానుండిన నముజ్ఫరుజంగు ఫ్రెంచివారికి (డూప్లేకి) మచిలీపట్టణము నొసఁగెను. 1751 సంవత్సరమున 'బుస్సీ' 'సలాబత్ జంగు'ను దక్కను సుబేదారుగాఁ జేసెను. సలాబత్ జంగు పేరునకుమాత్రము దక్కనుసుబేదారుగా నుండినను రాజ్యమంతయు బుస్సీయే పరిపాలించుచుండెను. 1753 వ సంవత్సరమున బుస్సీకిని సలాబత్ జంగునకును నొక యొడంబడిక జరిగెను. ఆయొడంబడికలో దక్కనురాజ్యమును ఫ్రెంచివారు శత్రుబాధనుండి రక్షించుటకును, ఫ్రెంచిసైన్యముల కగు కర్చులక్రింద సలాబత్ జంగు *ఉత్తరసర్కారులను ఫ్రెంచివారి కిచ్చుటకును నిర్ణయించుకొనిరి.

---

* కొండపల్లె, ఏలూరు, రాజమహేంద్రవరము, శ్రీకాకుళము సర్కారులు.

కాని ఉత్తరసర్కారులు కోరుకొనుటలో 'బుస్సీ'కి దూరదృష్టి లేకపోయెను. ఏలయన మచిలీపట్టణమును దాని పరిసరప్రదేశములును నిదివఱకే ఫ్రెంచివారిస్వాధీనములో నుండెను. కళింగరాజ్యము (శ్రీకాకుళ రాజమహేంద్రవరము సర్కారులు) బలవంతుఁడగు విజయరామగజపతి స్వాధీనమునం దుండుటచే నారాజ్యమున కాలుపెట్టుటకు బుస్సీకే కాదు, బుస్సీకి సర్కారుల నొసఁగిన నైజామునకును వీలులేదు. అప్పటికి విజయరామగజపతికి *ఒకలక్షకాల్బలమును, రెండువేలగుఱ్ఱపుదళమును, పర్వతములనుబోలు 100 ఏనుఁగులును కావలసినన్ని శతఘ్నులును కలవు. అందుచే నైజాముల్ ముల్కుకూడ నాతనిని గౌరవముగనే చూచుచుండెను కాని వేఱొకవిధముగా నెన్నఁడును జూడలేదు. ఇట్టిసర్కారులు నైజామునుండి తప్పిపోవుట నైజామున కొకభారముతగ్గినట్లే యుండునుగాని చింత యుండదు.

ఇప్పుడు బుస్సీ క్రొత్తగా సంపాదించిన యుత్తరసర్కారులను స్వాధీనముచేసికొనుటకై మచిలీపట్టణము ఫ్రెంచి

---

* "Viziaramaraj always maintained 100,000 foot Soldiers, 2,000 Cavalry, artillery which emitted rain of fire, and a hundred chain of Elephants resembling mountains"

(Persian History of Mr. Allum)

సర్కారులను ప్రెంచివారు స్వాధీనముచేసికొనట 1753

గవర్నరుగా నున్న "మారిసన్" అను నతనిని బుస్సీ పంపెను. కాని యప్పటికి శ్రీకాకుళములో ఫౌఁజుదారుగా నున్న జాఫరల్లీఖానునకు సర్కారులు ప్రెంచివారికి స్వాధీనమగుట యిష్టములేదు. అందుచే నాతఁడు విజయరామగజపతితో స్నేహముచేసికొని మోరిసను నెదిరించుటకై యాతఁడు నిశ్చయించుకొనెను. ఈవిషయము మోరిసన్ కనిపెట్టి బలవంతుఁడగు విజయరామగజపతి జాఫరల్లీతోఁ జేరినవారిని జయించుట దుర్లభమని తలంచి విజయరామగజపతి జాఫరల్లీకి తోడ్పడకుండిన శ్రీకాకుళము రాజమహేంద్రవరముసర్కారులు రెండును విజయరామగజపతికి మిక్కిలి తక్కువశిస్తున కిచ్చెదనని మోరిసను విజయరామగజపతికిఁ దెలియఁజేసెను. అందుకు విజయరామగజపతి యంగీకరించి, ఫ్రెంచివా రిటుపై నెన్నఁడును రాజమహేంద్రవర శ్రీకాకుళముసర్కారులపై నెట్టియధికారమును కలిగియుండకుండుటకును నైజాముద్వారా మొగలాయిప్రభుత్వమునకుఁ దా నివ్వవలసిన 12 లక్షల రూపాయిలును రెండువాయిదాలలోఁ దాను చెల్లించుటకును నిర్ణయించెను. ఇంతకుమించి వేఱుమార్గము కనఁబడకపోవుటచే దక్కను కర్ణాటక రాజ్యములను రెంటిని నేకచ్ఛత్రాధిపత్యముగా పరిపాలించుచుండిన బుస్సీయంతటివాఁడొప్పుకొనవలసి వచ్చెను. కాని యావాయిదాలుకూడ విజయరామగజపతి

యెన్నఁడును చెల్లించిన ట్లగపడదు.

విజయరామగజపతి ప్రెంచివారితో నొడంబడిక చేసి కొనినవార్త తెలియఁగనే జాఫరల్లీఖానుఁడు శ్రీకాకుళము విడిచి పాఱిపోయెను. రాజమహేంద్రవరము శ్రీకాకుళము సర్కారులు రెండింటికిని విజయరామరాజే ప్రభువయ్యెను.

ఇట్లు దేశమునుండి తఱుమఁబడిన జాఫరల్లీఖాను తన తలదాచుకొనుటకు తావు లేక, యప్పటికి ప్రెంచివారితో

మహారాష్ట్రులదాడి 1753

యుద్ధముచేయుచున్న నాగపురాధీశ్వరుఁడైన 'రగోజీభాంస్లే' యనుమహారాష్ట్రనాయకునియొద్దకు పయనమై పశ్చిమమార్గమునఁ బోవుచుండఁగా మార్గమధ్యమున సేనాసమేతుఁడై పోవుచుండిన రగోజీ కుమారుఁడు కనఁబడెను. అప్పుడు జాఫరల్లీ వానిని బతిమాలి తనసైన్యముతో నొకసారి శ్రీకాకుళముసర్కారునకుఁ గొండలమీఁదుగా రమ్మని వానిని కోరెను. కొండలమీఁదుగా గుఱ్ఱపుదడముతో వచ్చుటకు మార్గము చూపుటకై పాచిపెంటజమీందారగు పీరప్పదొర వానికిఁ దోడ్పడెను.

అప్పటికి విజయరామగజపతి పరాకుగానుండుటచే మహారాష్ట్రమహమ్మదీయసైన్యములు రెండును కలసి విజయనగరసైన్యములను సులభముగా నోడించి దేశమును దోఁచుకొనియు గ్రామములను తగులఁబెట్టియు దేవళములు పడఁగొట్టియు నానాభీభత్సము గావించిరి. ఒకవంక మహారాష్ట్రులు

దేశమును దోఁచుకొనుచుండ వేఱొకవంక మహమ్మదీయులు పురముల కగ్ని రగుల్కొలిపి దేవాలయముల సమూలముగ నాశనము చేయనారంభించిరి.

ఈరౌద్రరసభీభత్సభయానక నాటకమును గన్నులారఁ గాంచిన గోగులపాటి కూర్మకవి "వైరిహరరంహ సింహాద్రి నారసింహ" శతకమున నిట్లు వర్ణించెను.

సీ. చుట్టఁబెట్టిరి మహారట్టజంబులతోడ
నిఖిలరాజ్యము పఠాణీలఫౌఁజు
మట్టిమల్లాడిరి । మదసామజంబుల
పురజనపదములు । తురకబలము
కొట్టికొల్లలువట్టె । గురువిప్రమానినీ
ఘనగోగణంబుల । ఖానసమితి
పట్టిపల్లార్చిరి । బహుదుర్గవర్గముల్
సరభసోద్ధత్యపాశ్చాత్యచయము
గీ. మించి భూస్థలి నిటు లాక్రమించిరాఁగ
నలుక రాదేమి ? నగరివారలను దోఁచ
పొంచియుంటివి యవనుల । దుంచు మికను
వైరిహరరంహ సింహాద్రి । నారసింహ.
సీ. పుడమిపై నడుగిడి । నడువనేరనివారిఁ
దీవ్రతఁ బరువు లెత్తించినావు

పైమీఁదిదుప్పటి । బరు వనువారిచే
మించైనమూట మోయించినావు
గణపదాఁటని కుల। కాంతామణుల పృథ్వి
నెల్లెడఁ గలయఁది।ప్పించినావు
షడ్రసోపేతాన్న।సుభో క్తజనపరం
పర బలుసాకుపా । ల్పఱచినావు
గీ. భళిర ! యఘటనఘటనాప్ర।భావమెల్ల
దీనజనులందె చూపితి । తెలియవచ్చె
నయ్యె సామెల్ల యింటనే । యన్నమాట
వైరిహరరంహ సింహాద్రి।నారసింహ.
సీ. మా మొఖాసాకు గ్రా।మంబు లిమ్మన లేదు
కొంపలుగాల్పింపఁ । గూడదంటి
కరిహయాదుల మేము । కాంక్షింపఁగా లేదు
గోవధ మాన్పించి । ప్రోవుమంటి
మాకు మిమ్ములను సా।మ్రాజ్య మిమ్మన లేదు
జనులను దోపింపఁ । జనదటంటి
స్వామి మాకొఱకేమి । కామింపఁగా లేదు
క్షితిలోనఁ బ్రజల ర।క్షింపుమంటిఁ
గీ. జెలఁగి నీపదసేవలు । చేయు మాకు
వేఱకోరిక లేటికి? । వెన్నగలుగ

నహహా ! నేతికి నేటికి ( నంగలార్ప
వైరిహారరంహా సింహాద్రి*నారసింహా.

ఇట్లు కొన్నిపద్యములు కవి రచించువఱకు శ్రీసింహాద్రినాథుని గర్భాలయమునుండి కొన్నికంచుతుమ్మెదలు బయలువెడలి తుఱకబలమును సింహాచలమునుండి విశాఖపట్టణముసమీపమున నున్న తుమ్మెదలమెట్టవఱకు వెంటఁదఱిమె నని యొకవాడుక కలదు. ఆమెట్టకుఁ దుమ్మెదలమెట్ట యని పేరువచ్చుట కదియే కారణమని జనులు చెప్పెదరు.

సర్కారుల నీవిధమున మహారాష్ట్రమహమ్మదీయబలములు పాడుచేయుచుండ నింతలో విజయరామగజపతి తనబలమును సమకూర్చుకొని మహారాష్ట్రబలమును అనకాపల్లిదరి
తుమ్మపాలయుద్ధము. 1753 నున్న తుమ్మపాలయొద్ద నెదిరించెను. ఉభయబలములకు గొప్పయుద్ధము జరిగెను. తుదకు మహారాష్ట్రులు చెల్లాచెదరై యొకరుపోయినవంక నొకరు పోక చిన్నచిన్నగుంపులుగాఁ జీలిపోయి తాము దోఁచుకొనినధనముతో రహస్యముగా గోదావరి దాఁటి యే

---

* ఈసింహాద్రినాథుఁడు యజ్ఞవరాహస్వామి యైనప్పటికిని దేవాలయము నరసింహగజపతి కట్టించుటచే నతనిపేర నీస్వామి యజ్ఞవరాహనరసింహస్వామియను నామము కలిగెను. పదము క్లిష్టముగా పలుకుటకు మూలనామమైన 'యజ్ఞవరాహ' శబ్దమును లోపింపఁజేసి కట్టించిన రాజుపేరగు 'నరసింహ' నామముమాత్రి మిప్పుడు వాడుచున్నారు.

లూరుసర్కారులో నుండి నాగపురమునకుఁ బాఱిపోయిరి.

ఇఁక జాఫరల్లీ ఖానునకు గత్యంతరము లేక యుత్తరసర్కారులను తత్‌క్షణము విడిచిపెట్టి ఔరంగాబాదునకుఁ బాఱిపోయెను.

ఈయల్లరు లన్నియు బుస్సీకి తెలిసి 1754 సంవత్సరము జూలైమాసములో తాను స్వయముగా మచిలీపట్టణము రాజమహేంద్రవరము చని యచ్చటి వ్యవహారములన్నియును జక్కఁబెట్టుకొని శ్రీకాకుళములో 'ఇబ్రహింఖానుని' ఫౌఁజుదారుగా నేర్పాటుచేసెను.

ఇబ్రహింఖాను.
July 1754-1756 Dec.

మఱికొంతకాలమునకు బుస్సీకిని దక్కనుసుబేదారుఁడగు సలాబత్‌జంగునకును కలతలు కలిగెను. క్రమముగా నాకలతలు ముదిరి 1756 సం॥ ఆగష్టు 1 తేదీని హైదరాబాదుసమీపమున నున్న చార్ (మహాల్) మైనర్ తోటయొద్ద యుద్ధము జరిగెను. ఆసమయమున చెన్నపురి యాంగ్లేయవర్తక సంఘమువారు కలకత్తాను స్వాధీనము చేసికొనుటకు తమ సైనికుల నెల్లరిని వంగదేశమునకుఁ బంపవలసివచ్చుటచే నీ చార్‌మహాల్ యుద్ధములో సలాబత్‌జంగునకు సహాయము చేయలేకపోయిరి.

చార్(మహాల్) మైనర్ యుద్ధము.
1st Aug. 1756

ఈపోరాటముసందర్భములో నుత్తరసర్కారులలో

"బుస్సీ" చే నేర్పఱుపఁబడిన యుద్యోగులును, ఇబ్రహీంఖానుఁడును పేరించిదోరతనమువారికిఁ జెల్లింపవలసిన పైకమును జెల్లించుట మానివేసిరి. ఈదెబ్బతో మరల బుస్సీ సర్కారులలో కాలుపెట్టలేఁడనియే వీరి యభిప్రాయము. విజయరామగజపతిమాత్రము దూరదృష్టికలవాఁ డగుటచే తిరుగుఁబాటు చేసినవారితోఁ డా నేకీభవించలేదు. అంతియకాక బుస్సీ చార్‌మహాల్‌యుద్ధమున ధనమునకు మిక్కిలి తొట్రుపడుచున్నప్పుడు విజయరామగజపతి యతని కమితమైన ధనసహాయ మొనరించెను. ఇంతలో మచిలీపట్టణము నుండి బుస్సీకి సహాయార్థము కొన్నిసైన్యములుకూడ వచ్చియుండుటచే సలాబత్‌జంగ్ భయపడి బుస్సీతో నొడంబడిక చేసికొనెను.

ఇట్లు చార్మహాల్‌యుద్ధము ముగిసినపిమ్మట ఉత్తర సర్కారులలోఁ దనపై తిరుగుఁబాటొనరించినవారిని శిక్షించి వారీయవలసిన పైకమును వసూలుచేయుటకు బుస్సీ 1756 సం॥ నవంబరు 16 తేదీని 500 మంది యూరపియనులతోడను 4000 సిపాయిలతోడను హైదరాబాదునుండి బయలుదేరి డిశంబరు 19 తేదీకి రాజమహేంద్రవరము చేరెను. పిమ్మట సర్కారులలోని జమీందారుల కందఱకును వర్తమానము లంపించెను. ఒక్క బొబ్బిలిజమీందారగు గోపాలకృష్ణరంగరావు తప్ప మిగిలినజమీందారు లెల్లరును వచ్చిరి. విజయ

రామగజపతి *40,000 సైన్యముతో వచ్చి బుస్సీని కలసి కొనెను. ఈతనిరాకను గూర్చి †దిట్టకవి నారాయణకవి తన రంగరాయచరిత్రమున నిట్లు వర్ణించెను.

సీ. పొలుపొందఁ గాకర్ల। పూడి జగన్నాథ
రాజుగా రొకకొంత । ఫౌఁజుతోడ
సత్యవరపుపుర। స్వామి యా నలరామ
భద్రరా జొకకొంత । బలముతోడ
ఘనయశోనిధిముఖ। కాశీపతికుమా
ధవమాళి యొకకొంత । దళముతోడ
నలఘువిక్రముఁడు చిం। తలపాటి నీలాద్రి
రాజుగా రొకకొంత । ఫౌఁజుతోడ

గీ. విజయరామరాజకుమా। విభునిమోల
నేత్రపర్వం బొనర్చిరి । నిజభుజాభు
జంగరసనాయమానప్ర। చండనిశిత
మండలాగ్రప్రభావళుల్ । మెండుకొనఁగ.

శా. శ్రీరంజిల్లుకడానిపైడిజలతా। రీమాహురీకెంపుటం
బారీయేనుఁగు నెక్కి పెక్కులుమదే। భంబుల్దనుంగొల్చిరాఁ

* 11,000 సైన్యమని కొన్నిచరిత్రములు చెప్పుచున్నవి.

† ఇతఁడు 1790 సం॥ నాఁటివాఁడు. బొబ్బిలివారిపక్షమున నీతఁడు వ్రాసెను.

గారూఢి న్గజతురంగసైన్యములతో । గర్జిల్లుచు న్వత్సవా
యీరాయప్రభుమౌళివచ్చెఁగడురా।జిల్లించిహర్షింపగన్.

మ. జగమెుక్కుమ్మడిఁ గ్రమ్మఁజాలెడు మహా।సత్వంబు చేనొప్ప
గా । ప్పగుఢాల్ రాతులు గైతలొట్టియలు శో । భా
స్ఫూర్తిఁదన్గొల్వమా । దుగులింగావనిభర్త రాజమణి సం।
తోషిల్లఁగా వచ్చె నా । క్షగజోత్తంసము నెక్కు చొక్కమగు
ను।త్కంఠాతిరేఖమ్మునన్.

శా. ధన్యాటోపులు *మంటపాటికులర।త్నంబుల్ మహారాజ
మూ । ర్ధన్యుల్ శ్రీరఘునాథరాజబలభ । ద్రిక్ష్మావరు
ల్మున్న పా। జన్యక్రీడలఁ బాఱుడెంచి శిబికా।చంచద్గతు
ల్మీఱ, రా । జన్యగ్రామణి కిచ్చి రుత్సవముఁ ద।త్స్వాం
తంబు కాంతంబుగన్.

ఉ. పాయని వేడ్క విద్విషద।పాయకరాయతబాహుశౌర్యకా
పాయకరాయఁడు న్గిమిడి । పట్టణపుంబృథివీశ్వరుండు నా
రాయణదేవుఁడున్న రస।రాజు మఱింగొలుగొండమన్నె పుర్
రాయఁడునాదిగాఁగల ధ।రావరులందఱు వచ్చి రత్తఱిన్.

చ. నలువదివేలకాల్బలము । నాలుగువేల తురంగమంబులున్
నలువదియేఁబదేనుఁగు ల।నంతములైన శతఘ్నికాచయం

* వీరు పాన్న మండజమీందారులు (Local Records A. B. C. VI.)

బులునొకవేయులొట్టియ ల!పూర్వవిభావిభవంబుదెల్పుచు
న్గొలువపరాసుతేని గను!గోజనుదెంచెను రాజతిత్వర౯.

"బుస్సీ" గోదావరి దాటి కళింగరాజ్యమున కాలిడుట
విజయరామగజపతి కిష్టము లేదు. ఎట్లైనను బుస్సీని గోదావరి
నుండి వెనుకకు పంపివేయవలెననియే యాయన సంకల్పము.
ఒకప్పుడు బుస్సీ తనమాట వినక బలవంతముగా గోదావరి
దాటివచ్చుటగాని లేక తనకు విరోధముగా మఱియెట్టివిష
యములుగాని సంభవించిన యప్పటి కనుకూలమగు మార్గ
మెట్లుండినన ట్లు చేయవచ్చునని రెంటికాపుతో విజయరామ
రాజు నిజసామంత బంధు మిత్రపరివారముతోడను చతురం
గబలంబులతోడను దండనాథులతోడను ఫిరంగులతోడను
గూడ బయలువెడలెను.

ఇట్లు మహాబలసంపదతోఁ దన్ను చూచుటకు వచ్చిన
విజయరామరాజును బుస్సీ అత్యంతగౌరవపూర్వకముగా
సత్కరించెను.

విజయరామరాజు బుస్సీమంత్రియగు హైదరుజంగు
తో మాట్లాడి తాను కట్టవలసిన పండ్రెండులక్షలరూపాయిల
బొబ్బిలి యుద్ధ లో నారులక్షలరూపాయిలు వెంటనే చెల్లిం
ప్రసంగము చెదననియును మిగిలిన 6 లక్షల రూపాయిలును
రెండవవాయిదాలో చెల్లించెదననియును చెప్పి వెనుకకు మ
రలి పొమ్మనెను. అందుకు హైదరుజంగు తామెట్లైనను శ్రీ

కాకుళము వెళ్ళకగాని వెనుకకు మఱల వీలులేదని ప్రత్యుత్తర మిచ్చెను. అట్లైనచో తనకు మార్గమధ్యమున చిన్నకార్యమున్నదనియును ఆదినుండియుఁ దమకు గర్భశత్రువులుగానున్న బొబ్బిలివారిని నచ్చటినుండి తొలఁగించి తన కాదేశ మిచ్చినచో నాతనికి *3 లక్షలరూపాయిలు లంచమిచ్చెదననియును చెప్పెను.

అందులకు హైదరుజంగు సమ్మతించెను. ఈవిషయ మంతయు చారులవలన రంగారాయఁడు తెలిసికొని పంతెన బుచ్చెన యనుమంత్రిని బుస్సీయొద్దకు రాయబారిగాఁ బంపెను. కాని సన్నిధానమందు పనిచేయుచున్న బలవంతుఁడగు విజయరామగజపతిమూలమున ఎచ్చటనో నివసించియున్న బొబ్బిలిరంగరాయనిరాయబార మెందులకుఁ బనికివచ్చును. ఇచ్చటిరాయబారము విఫలముకాఁగనే పంతెనబుచ్చెన మచిలీపట్టణములో సర్కారుకొలువులో నున్న మద్దాల రెడ్డినాయని యొద్దకు వెళ్ళి యతనివలన మచిలీపట్టణపరిపాలకుఁడగు "గోరందొర"ను సందర్శించి యాతనియొద్ద, యిచ్చటజరుగుచున్న వృత్తాంతమంతయు బుచ్చెన్న నివేదించెను. అప్పుడు 'గోరందొర' బొబ్బిలిపైకి దాడివెడలుట కూడనిపనియని వ్రాయుచు నొకవార్తాహరుని బుస్సీయొద్దకుఁ బంపెను.

---

* See Local records Vol VI.

ఇంతలో బుస్సీ రాజమహేంద్రవరమునుండి బయలు దేరి పెద్దాపురమున ససైన్యముగా బసచేసి పిమ్మట కసింకోట చేరిరి. కసింకోటలోనె 'గోరుందారు' జాబు బుస్సీకి చేరెను. ఆజాబు చూచినపిమ్మట బుస్సీకి బొబ్బిలిపైఁ జను నుద్దేశము లేక తిన్నగా శ్రీకాకుళమునకు ప్రయాణము సాగనిమ్మని హైదరుజంగుతో చెప్పెను. హైదరుజం గప్పటి కామాటలను మన్నించినను మరల "బుస్సీ"కి బోధపఱచి బొబ్బిలిపైకి పోవున ట్లొప్పించెను.

పిమ్మట సైన్యములన్నియును నొడ్డాదిమీఁదుగా దేవుపల్లి చేరెను. దేవుపల్లికి మఱియొకరాయబారిని బొబ్బిలివారంపిరి. కాని లాభము లేకపోయెను. అచ్చటనుండి బయలువెడలి క్రమముగా నడవులత్రోవనుబట్టి రహస్యమార్గముల బొబ్బిలిపైకి సైన్యములు నడువనారంభించె. ఎప్పటివృత్తాంత మప్పుడు రంగరాయనికిఁ దెలియుచునే యుండెను.

## —: బొబ్బిలియుద్ధము. :—

1757 సం॥ జనవరి 24 తేదీ యుదయము 5 గంటలకు బొబ్బిలికోటను పరాసుసైన్యములు ముట్టడించెను. పరాసు సైన్యమునకును విజయనగరము సైన్యమునకుఁ గూడ విజయరామరాజే ప్రధాననాయకుఁడుగా నుండెను. హైదరుజంగు ధనలోలుఁడై విజయరామ

బొబ్బిలిముట్టడి 24th jan. 1757

గజపతి చేతిలోని కీలుబొమ్మవలె నుండెను. ఈయుద్ధము బుస్సీ కెంతమాత్రి మిష్టము లేదు.

విజయరామరాజు సైన్యమును నాలుగుభాగములుగా విభాగించి నాలుగుబురుజులకును లగ్గలు పట్టించెను. లాడుఖాను, మహమ్మద్ హుస్సేను, జానూఖాను, మీర్జాఇద్రీబిలాల్ ఖాను, హాసక్ అల్లీఖాను, షుకురుల్లాఖాను, మున్నగువారు వేలువేలు సైన్యములకు నాయకులుగా నుండిరి. వెంటనే నాలుగువైపులనుండియు ఫ్రెంచిసైన్యములు ఫిరంగులు పేల్చుట కారంభించెను. బురుజులమీఁది తాటియాకులశాలలకు నగ్నిప్రమాదము కలుగకుండ కోటలోనివారు తాటియాకులను విప్పి తీసివేసిరి. తొమ్మిదిగంట లగువఱకు కోటగోడపై నిలువఁబడి యుద్ధముచేయుట కనుకూలమగు ప్రదేశములలోఁ జాలభాగములు ఫిరంగిగుండ్లదెబ్బలవలనఁ గూలిపోయినవి. విజయరామగజపతిసైన్యములు నిచ్చెనలతోఁ గోటగోడ లెగఁబ్రాకఁ బ్రయత్నించెను. కాని లాభము లేకపోయెను. మరల మరలఁ బ్రయత్నించిరి. కాని మధ్యాహ్నము రెండుగంటలవఱకును శత్రుసైన్యములు లోనఁ బ్రవేశింపకుండ బొబ్బిలివీరులు తమ నిర్వక్రపరాక్రమముచే నాపిరి. కోటలోని యోధులు 250 మంది. ముట్టడించినయోధు లనేకసహస్రములు. ఇన్నివేలమంది యోధాధియోధులను రెండువందల యేఁబదిమంది బొబ్బిలియోధు లుదయము 5 గంటలు మొ

దలు మధ్యాహ్నము రెండుగంటలవఱకును దమ నిర్వక్రప రాక్రమముచే నొక్కశత్రువైన లోనికిఁ జొరకుండఁ గాపా డిరి. హిందూస్థానమందు జరిగిన యుద్ధములలో నిట్టి పరాక్రమమును జూపినవా రెచ్చటను లేరని పరాసుసైనికు లాశ్చర్య పడిరి.

రెండుగంటలకు బొబ్బిలిపురాధీశ్వరుఁ డగు రంగరా యాగ్రణి కోటగోడపైనుండి చూచి యిఁక శత్రువులనుండి కోటను గాపాడుట కష్టమని యెంచి పరాసుసైన్యములవలన తమస్త్రీలకును బాలురకును నగౌరవము సంభవింపకుండ స్త్రీలను బాలురను నగ్ని కాహుతియొనరింపవలసినదని కొందఱు యోధుల కాజ్ఞాపించెను. వారలును రాజాజ్ఞను శిరసావహించి కోటమధ్యప్రదేశమున మహాగ్నిని ప్రజ్వరిల్లఁజేసి స్త్రీలను బాలురను నగ్ని కాహుతి యొనరించిరి.

ఇంతలో శత్రుసైన్యములు మరల బురుజుల కెగఁబ్రాకఁ బ్రయత్నించెను. రంగరాయఁడు బురుజులను గాపాడుటకై పరుగెత్తుచుండ నింతలో నొకగుండు తగిలి యాతఁడు నేలఁ గూలెను. ఆతఁడు కూలుటతో మిగిలినసైన్యము లన్నియును రాజు పడినవైపునకు బరుగెత్తుకొని వచ్చెను. బురుజులను గాపాడువారు లేకపోవుటచే శత్రుసైన్యములు కోటలో నిరభ్యంతరముగాఁ బ్రవేశించెను. కత్తిపట్టఁగల ప్రతియోధుఁడును దుదివఱకును యుద్ధముచేసి రణరంగమున వీరస్వర్గమును జూరఁగొనెను.

విజయరామరాజు సైన్యములు బొబ్బిలికోటలో నిరభ్యంతరముగాఁ బ్రవేశించెను. లోన నొక్కమనుష్యుఁడైనను లేఁడు. ఒక్కస్త్రీయైనను లేదు. ఒక్క శిశువైనను లేదు. నిర్మానుష్యము. నిశ్శబ్దము. పరాసుసేనానాయకుఁ డగు 'లా' యనునతఁడు ఇదియంతయును జూచి యత్యాశ్చర్యనిమగ్నమానసుఁ డయ్యెను. కోటమధ్యమున మహాగ్నిహోత్రగుండము. అందు వందలకొలఁది స్త్రీ బాలుర నిర్దగ్ధశరీరములు. ఈఘోరసందర్శనము సేనానాయకుని మనస్సును నీరుగా నొనరించెను.

ఇంతలో చిన్నరంగరావను బాలకుని నెత్తుకొని యొక వృద్ధుఁడు శత్రువులనుండి తప్పించుకొని పోవుచుండఁగాఁ గొందఱుసైనికులు వానిని బట్టుకొని 'లా' యెదుటఁ బెట్టిరి. ఆ ఫ్రెంచిసేనానియు నారాజకుమారుని బుస్సీయొద్దకుఁ బంపెను. బుస్సీయును నాబాలుని జేరఁదీసి పితృపితామహార్జితమైన బొబ్బిలిసంస్థానమును మరల వానికే యీయ నిశ్చయించెను. ఇట్టికోటను నాశనము చేయించినందులకును ఇంతమంది స్త్రీబాలుర హత్యకు కారణమైనందుకును బుస్సీకి విజయరామరాజుపైఁ జాల యాగ్రహము కలిగెను. కాని బుస్సీ చేయునదిలేక బలవంతునితోఁ గలహము తెచ్చిపెట్టుకొనుట కిష్టములేక యప్పటి కూరకుండెను.

బుస్సీమాత్రము బొబ్బిలికోటలోఁ బ్రవేశింపక తన డేరా కోటవెలుపలిభాగముననె వేయించుకొనెను. ఇట్లు మూఁడుదినములు శత్రుసైన్యములు బొబ్బిలిలో నివసించిన పిమ్మట మూఁడవనాఁటిరాత్రి విజయరామరాజు తన పటకుటీరమున నిద్రించుచుండ తాండ్రపాపారాయఁడను నొక బొబ్బిలిసరదారుఁడు దేవుపల్లి పెద్దన్న బుద్ధరాజు వెంకన్న యను నిరువురతోడ్పాటుతో నర్ధరాత్రివేళ ప్రాకుచు నా పటకుటీరము వెనుకవైపునుండి లోనఁ బ్రవేశించి

సీ. "మణికుండలద్వయీ । ఘృణిమండలంబుల
దుమికెడు చెక్కుటద్దములవాని
నల వసంత జయంత । నలకూబరాదుల
నట్టిట్టు పఱచు సోయగమువాని
భాగ్యలక్ష్మీసభా । భవనాయితము లైన
తామరసాభ నేత్రములవాని
హంససంసత్తూలి । కాభ్యంచితం బైన
హొంబట్టుపఱుపుపై । నొప్పువాని
గీ. హస్తకముల కృతోప బర్హంబువానిఁ
గించిమున్మీలితాక్షుఁడై । మించు విజయ
రామరాజ వసుధారమణుఁ గాంచి
తాండ్రపాపయ్య కోపంబు దీండ్రిలంగ."

(రంగరాయ చరిత్రము.)

ముగ్గురును కలసి తమచేతియాయుధములతో ముప్ప దిరెండుపోటులు పొడిచి చంపిరి. తోడనే రాజసేవకులు మేల్కాంచి పాఱిపోవుచుండిన పాపారాయని వాని యను చరులను బట్టుకొని చిత్రవధ గావించిరి.

బొబ్బిలియుద్ధము బుస్సీకి నిష్టము లేకపోవుటచేతను బొబ్బిలికోటలో జరిగిన స్త్రీహత్య మఱియు బుస్సీకి హృదయ తాపము కలిగించుటచేతను, తాము చేసిన క్రూరకృత్యము నకై యుద్ధానంతరమున విజయరామగజపతిని హైదరుజంగు ను నిందించి వారితోఁగూడఁ దాను బొబ్బిలికోటలోఁ బ్రవే శింపకపోవుటచేతను విజయరామరాజుయొక్క హత్యలో బుస్సీకిఁగూడఁ గొంత పాలున్నదనియే కొంద ఱభిప్రాయ పడిరి. * విజయరామరాజు చనిపోయినవార్త తెలియఁగనే

* విశాఖపట్టణము నుండి 8-3-1758 తేదీని ఫోర్టుసెంటుజార్జి ప్రెసిడెంటునకు వ్రాసిన యీక్రిందిజాబులోని భాగమును గమనింపుఁడు.

"Some people imagine the assassination of Vizia Ramaraj at Bobbili was perpetrated by Rangarow's relations out of revenge. Others think the French at the bottom of it........."

గీ. "రావువారి సంబంధి యుగ్రముగ వచ్చి
నృపునిఁ జంపుట నుభయసైనికులు వినిరి
రాజుచావున నంత ఫ్రాంసుబలము
సంతసం బందె హైదరుజంగు తక్క."

(రంగరాయ)

యాంతనిశిబిరమును పరాసులు దోఁచుకొన నట్టిపద్యము తెలుపుచున్నది.

తే. "ఆఫిరంగుల రవళికి । నాన్నృపాలు
శిబిరమెల్ల చికాకయి । చెదరఁదొణఁగ
నప్పు డరాజకమైన త । దావసథముఁ
గొల్లపఱచిరి కొల్లరు । గ్గొల్లకాండ్రు."

(౧౦౪ గాయ.)

ఏదియెట్లైనను విజయరామగజపతి రాజనీతియందు మిక్కిలి నిపుణుఁడు. ఇతనితో సమానుఁడు వేఱొకఁడు లేఁడని చెప్పవచ్చును. ఒకవంక ఫ్రెంచివారిని వీడక వారికి తగుసహాయ మొనరించి వారివలన తనకు కావలసిన కార్యములన్నియును చేయించుకొనుచుండెను. వేఱొకవంక యింగ్లీషువారితో నుత్తరప్రత్యుత్తరములను నడపుచు నింగ్లీషు వారిపట్ల సంపూర్ణాభిమానమును జూపుచునే యుండెను. తన శత్రువులనెల్లరి ఫ్రెంచివారి సైన్యసహాయముతో నుక్కడగించుచుండెను. ఫ్రెంచివారితోఁ గాని ఇంగ్లీషువారితోఁ గాని నీతఁ డెన్నఁడును గలహింపక ఉభయులను జేరఁదీసి యుభయులకును జేయఁదగిన యుపకారములను జేయుచు నుభయులను నదుపులో నుంచుచుండెను. ఒకవంక ఢిల్లీసుల్తానులు సింహాసనమునకై కలహించుచు మొగలసామ్రాజ్య మస్తమించుచుండ, నాదరుషావంటి విదేశరాజులు ఢిల్లీపై

దండెత్తి రాజ్యమునంతటిని దోఁచుకొని ప్రజలను చిత్రవధ గావించుచుండ, వేఱొకవంక దక్కనుసుబేదారులు దక్షిణ హిందూస్థానమందలి యుద్ధములలోఁ దేలియాడుచుండ మఱియొకవంక మహారాష్ట్రులు విజృంభించుచుండ నొకవైపు ఫ్రెంచివారును యింగ్లీషువారును తమతమ వర్తకస్థానములు బలపఱచుకొనుటకై పెనఁగులాడుచుండ, ఫౌఁజుదారు లొక చాయ స్వాతంత్ర్యము నొందుటకు విశ్వప్రయత్నము చేయుచుండ నాకాలములో కళింగాధిపుఁడగు విజయరామగజపతి, సుల్తానులయొక్కయు, సుబేదారులయొక్కయు, ఫౌఁజుదారుల యొక్కయు, ఐరోపియనులయొక్కయు మన్ననల నందుచు, నవసరపడినప్పుడు వారిని లక్ష్యపెట్టక స్వతంత్రాధికారివలె మెలంగి వారికి భయమును గలుగఁజేయుచు బలవంతులని తోఁచినవారితో తాత్కాలికస్నేహ మొనరించుచు తనపైకి తలయెత్తు ఫౌఁజుదారుల చించి చెండాడుచు నిట్లు క్రమక్రమముగా తనరాజ్యమును గోదావరిమొదలు కటకమువఱకును వృద్ధిచేసెను.

సీ. "లీలమై జాభర । ల్లీయు బాదుర్లాది
సర్లస్కరుల గిట్టి । జయముఁ గాంచి
యసురలాఖానుని । యంతలేసి సుబాల
నొగి జిలేబునను గొ । ల్వొంచి మించి

కిమిడి చీకటిరాజ్య । రములుచూఱలుగొని
తద్దుర్గములమీఁద । దాడివెట్టి
యాగతమీకట । కాంత రాళక్షమా
తలము నేకాతపత్త్రముగ నేలి

గీ. గరిమ జగదేకవీర।విఖ్యాతి నొంది
విక్రమము గన్న రా।జన్యచక్రవర్తి
యకట నేఁ డిట్లు తాం।డ్రపాపయ్య యనెడి
వెలమబెబ్బులిపాలైతి। వే నరేంద్ర."

(రంగరాయ చరిత్రము)

ఉ. పంతము సీకుఁజెల్లు నొకపాటి।యమీరుఁడు సీకులక్ష్యమా
కుంతము కేలఁబూని నిను।గొల్వనివాఁడు ధరిత్రిలోన భూ
కాంతుఁ డొకండు లేఁడుకట।కంబుమొదల్గొని గోలకొండప
ర్యంతముసీవెకా! విజయ।రామనరేంద్ర! సురేంద్రవైభవా.

పైపద్యములనుబట్టిచూడ శ్రీవిజయరామగజపతి గౌతమిమొదలు కటకమువఱకుఁ గల కళింగరాజ్యమంతయును నేకచ్ఛత్రాధిపత్యముగ నేలుటయే కాక గోలకొండ పర్యంతము సీతనికీర్తి నిండినట్లు ఋజువగుచున్నది.

ఇట్టి విజయరామగజపతి మరణవార్త విజయనగరము చేరినది. తన పినతండ్రిగారి మరణమునకు బుస్సీయే కారకుఁడని ఆనందగజపతి బుస్సీపై యాగ్రహము కలిగెను.

సమయము దొరికినప్పుడు బుస్సీపైని పగ సాధించు కొనుటకు ఆనందగజపతి యెదురు చూచుచుండెను. ఇంతలో

అనేదల్లీఖాను 1757-58

బుస్సీ బొబ్బిలినుండి తిన్నగా గంజాముమండలము ప్రవేశించి శ్రీకాకుళమున 'అనేదల్లీఖాను'ని ఫౌజుదారుగా నేర్పఱచెను.

తాను మఱలివచ్చుచున్నప్పుడు విజయనగరము వచ్చి ఆనందగజపతితో మాట్లాడుచున్నప్పుడు విజయరామగజపతి తాను బొబ్బిలిలో నొనరించిన పాపకృత్యములవలన నచ్చటనే బొబ్బిలిసరదారునివలన చనిపోయెననియును నతఁడట్టి మరణమున కర్హుఁడనియును విజయరామగజపతిని గూర్చి తూలప్రసంగము చేయ నందుల కానందగజపతికి కోపము వచ్చి "భయములేక యిటువంటి క్షుద్రపుమాటలు మాతో అగుపరుచుదువా? మాతండ్రిగారిని మీయొక్క భరువసా మీద పంపించినాము. ఆయననుమాత్రము చంపి నీవు బ్రతికి రావడమునకు ఏమినిమిత్తము? ఇంతతప్పున్నా నీమీద వుంచుకొని మాతో క్షుద్రపుమాట లాడవచ్చినావా?" అని చెప్పి బుస్సీని వానిసైన్యమును వెంటఁదఱిమెను.

విజయరామగజపతికిని ఆనందగజపతికిని ఇంగ్లీషు వారిపై నున్న యభిమానమును స్నేహభావమును బుస్సీ కని

బుస్సీ విశాఖపట్టణమును ముట్టడించుట une 1758

పెట్టి యెట్లైనను ఇంగ్లీషువారి నుత్తర సర్కారుల నుండి తగిలివేయవలెనని

నిశ్చయించుకొని బందరునుండి మఱికొంత సైన్యమును తీసికొని యేకముహూర్తమున, ఇంజరాము, మదపోలము, బెండమూరులంక లోనగు నాంగ్లేయస్థానముల ముట్టడించి వానిని స్వాధీనముచేసికొనిన పిమ్మట తిన్నగా విశాఖపట్టణము వచ్చి జూన్ 24 తేదీ రాత్రి యచ్చటి ఇంగ్లీషుఫేక్టరీని ముట్టడించెను. పురవాసులను సిపాయిలను విడిచిపెట్టి ఒక్క ఇంగ్లీషువారిని మాత్రమే యాతఁడు ఖైదీలుగాఁ దీసికొని హైదరాబాదు వెళ్ళిపోయెను.

ఉత్తరసర్కారులలో నింగ్లీషువారికిఁ గల ఫేక్టరీలలో విశాఖపట్టణము ఫేక్టరీయే చాల ముఖ్యమైనది. అందుచే విశాఖపట్టణము ఫ్రెంచివారు తీసికొనుటతో నుత్తరసర్కారులలో నింగ్లీషువారికిఁగల వర్తకమంతయు పడిపోయెను.

1758 సంవత్సరము జూలై మాసములో పుదుచ్చేరిలో నున్న ఫ్రెంచిగవర్నరగు 'కౌంటడీలాలీ' వెంటనే తన యావత్తుసైన్యముతోడను బయలుదేరి వచ్చి కర్ణాటకయుద్ధమునందును చెన్నపురి ముట్టడియందును దనకుఁ దోడ్పడవలెనని 'బుస్సీ'కి ఉత్తరువుచేసెను. ఆయుత్తరుప్రకారము బుస్సీ ఆగష్టు 3 తేదీని తనకు బదులుగా వచ్చిన "మార్క్వెస్-డి-కాన్ ఫ్లాన్సు" అను వానికిఁ దనయధికారమంతయు నప్పఁజెప్పి తాను కర్ణాటకమునకు వెడలిపోయెను.

పరాసుల పతనము 1758

బుస్సీపైని పగదీర్చుకొనుటకు వేచియుండిన ఆనందగజపతికి మంచిసమయము దొరికినది. ఫ్రెంచివారిని ఉత్తర సర్కారులనుండి పాఱఁదోలుటకై యానందగజపతి చెన్నపురి వర్తకసంఘమువారి సహాయమును కోరెను. చెన్నపురివర్తకసంఘమువా రప్పుడు దక్షిణహిందూస్థానము యుద్ధములలో మునిఁగియుండుటచే వెంటనే సహాయమును జేయలేకపోయిరి. అందుచే ఆనందగజపతి వంగరాష్ట్రములో నున్న "క్లైవు" పేర సహాయార్థమై యొక ఉత్తరమును వ్రాసెను.

ఆనందగజపతి ఇంగ్లీషుకంపెనీ వారి సహాయమునుగోరుట 1758

*వంగదేశమునుండి ప్రత్యుత్తరము రాకముందె ఆనందగజపతి తనసైన్యముతో విశాఖపట్టణము వెళ్ళి సెప్టెంబరు

* "Before the departure of Bussy had even been contemplated, Anandaraz had made overtures to the English in Madras and when he became convinced that the pancity of their troops would not allow him to hope for any assistance from that quarter, he had transmitted similar proposals to Bengal. Before he could receive a reply, the discomfiture of the French Army before Tanjur, following on the departure of Bussy, induced him to strike a blow on his own account ......... he suddenly (2nd September, 1758) marched upon and took possession of Vishakpatnam, hauled down the French and planted the English flag, made prisoner

1758 సం॥ సెప్టెంబరు 2 తేదీని ఆనందగజపతి విశాఖపట్టణముకోటను స్వాధీనముచేసికొనుట

2 తేదీని ఫేక్టరీని ముట్టడించి ఫ్రెంచివారిని వారినాయకుని ఖైదీలుగా పట్టుకొని ఫేక్టరీ దోఁచుకొని యచ్చట ఇంగ్లీషు పతాకమును స్థాపించెను. పిమ్మట యీ వర్తమానమును తెలియఁజేయుచు ఆనందగజపతి కలకత్తాకు మఱియొక ఉత్తరమును వ్రాసెను. ఆసమయమున సైన్యములను బంపుటకు వీలులేదని కలకత్తా కౌన్సిలుసభ్యు లడ్డు పెట్టినను "లార్డుక్లైవు" వారిమాటలను పాటింపక ఆనంద

ఆనందగజపతి ఆంగ్లేయుల రక్షణమును వారిని పునరుద్ధరించుట
12th Sep. 1758

గజపతితో వ్యవహారము లేర్పాటుచేసికొనుటకై ముందుగా జాన్‌స్టన్ అను నాతనిని విశాఖపట్టణము పంపెను. ఆనందగజపతి 'జాన్‌స్టన్'తో మాట్లాడి సెప్టెంబరు 12 తేదీని విశాఖపట్టణము ఫేక్టరీని నాతని కప్పఁజెప్పెను.

పిమ్మట కర్నల్ ఫోర్టు సేనానాయకత్వముక్రింద 500 మంది యూరపియనులను 1600 సిపాయిలను కొన్నిఫిరంగులను మందుగుండు సామానునిచ్చి అక్టోబరు 20 తేదీకి విశాఖపట్టణము చేరునట్లు 'లార్డుక్లైవు' పంపెను. ఆసైన్యము

3rd Nov. నవంబరు 1 తేదీని విశాఖపట్టణమునఁ

---

the French chief, and plundered the French factory. Having done this, he despatched a second messenger to Calcutta, charged to inform the chief of the Bengal Presidency of all he had accomplished..........''
(Col. Malleson's "Decisive battles of India" page 77).

బయలుదేరి 3 తేదీని కశింకోటలో ఆనందగజపతిసైన్యమును కలసికొనెను. ఆనందగజపతి తనసేనతోఁగూడ కంపెనీసేనను జేర్చి యుభయసేనలతోఁ గూడ యుత్తరసర్కారులలోని ఫ్రెంచిస్థానముల నాక్రమించుకొనుచు మెల్లమెల్లగ దండ యాత్ర సాగించుచుండెను.

చెన్నపురిదొరతనమువారిచే విశాఖపట్టణము ఫేక్టరీకి ఛీఫ్‌గా పంపఁబడిన "ఆండ్రూస్" నవంబరు 15 తేదీని కసింకోటకు 30 మైళ్ల దూరమున కర్నల్ ఫోర్డుద్వారా ఆనందగజపతి దర్శనము చేసికొనెను.

15th Nov.

ఆనందగజపతికిని కంపెనీకిని జరిగిన ఒడంబడిక.

15th November 1758

1758 సంవత్సరము నవంబరు 15 తేదీని ఆనందగజపతికిని కంపెనీవారికిని నీక్రింది యొడంబడిక జరిగెను.

౧. విజయనగరము సైన్యములును కంపెనీసైన్యములును కలసి పనిచేయుచున్న దినములలో కంపెనీసైన్యముల కగు అధికవ్యయముక్రింద (నెలకు) 50,000 రూపాయిలును, ఉద్యోగుల ప్రత్యేకవ్యయముక్రింద (Double batta) నెలకు 6000 రూపాయిలును ఆనందగజపతి కంపెనీవారికి (రాజమహేంద్రవరము జయించు సందర్భమున) నిచ్చుటకును

౨. ముందు జయింపఁబడఁగల దేశమంతయు ఆనందగజపతికి రెవెన్యూ వసూలుచేసికొనుటకును పరిపాలనమునకు విడిచిపెట్టుటకును, విశాఖపట్టణము మొదలు బందరువరకును గల * రేవుపట్టణములును నదీముఖద్వారమందుండు పట్టణములను కంపెనీవారికి విడిచిపెట్టుటకును

3. ఆనందగజపతియొక్క-గాని కంపెనీవారియొక్క-గాని స్వాధీనమందున్న దేశముల నొకరికొకరు ఇచ్చుటగాని యిచ్చి వేయుటగాని యుభయుల అంగీకారముమీఁదనే జరుగుచుండుటకును,

నేర్పాటు కావింపఁబడెను.

ఈయొడంబడిక జరిగినపిమ్మట ఆనందగజపతియు కర్నల్ ఫోర్డును కలసి తమదండయాత్రను వడివడిగ సాగించుచు 1758 సం॥ డిశంబరు 6 తేదీని చేఁబ్రోలుగ్రామము నాక్రమించుకొనిరి.

ఇంతకుముందే జుల్ఫకీర్ జంగు రాజమహేంద్రవరము శ్రీకాకుళము సర్కారులను చూచుటకై బయలుదేరెను.
7th Dec. 1758. ఉభయసైన్యములును కుందూరువద్ద తారసిల్లెను. అప్పుడు ఆనందగజపతి 100,000 మంది

* బందరు, పువ్వాడ, కోరంగి, నేలపల్లి, కొనురగిరి, బెండమూరు లంక, అంతర్వేది, రామేశ్వరం, నరసాపురం మొదలైనవి.

సిపాయిలతోడను, 1000 గుఱ్ఱపుదళముతోడను, ఇంగ్లీషు సైన్యముతోడను జుల్ ఫకీర్ జంగు నెదిరించెను. ఉభయసైన్యములకును ఘోరసంగ్రామము జరిగెను. అందు జుల్ ఫకీర్ జంగు ఓడి రాజమహేంద్రవరము పాఱిపోయెను. శత్రువుల సైన్యములను, ఆనందగజపతి ఖైదీలుగాఁ బట్టుకొని వారిధనమును, ఆయుధములను, గుఱ్ఱములను, ఏనుఁగులను స్వాధీనము చేసికొనెను. *

**ఆనందగజపతి పెద్దాపురము స్వాధీనముచేసికొనుట.**

కుందూరువద్ద జయమునొందిన ఆనందగజపతియు, నింగ్లీషువారును కలసి చామర్లకోటపైకి యుద్ధమునకు వచ్చుచున్న వార్త పిఠాపురప్రభువగు పెదమహీంపతిరాయనింగారు తెలిసికొని పెద్దాపురం సంస్థానాధిపతులగు జగపతిరాజు గారిని కాకినాడలోనున్న డచ్చివాఁని సహాయముకోరి వారిసహాయ

* "M. Bussy had deputed Zulfakarkhan to oppose Anant Raj who had 100,000 foot men and 1,000 horse, and who, supported by the English, acted independently. A fierce battle ensued at forty miles distance from the road to Rajahmahendri, at the plain below the fort of Bathpur, which ended in the flight of Zulfakar, and all his office stores and jewels and commissariat stores and Elephants and artillery were captured. and with a few men he escaped to Rajahmahendri."

(History of the Nizams of Dakan Book III·Chap. III Page 59).

ముతో మూడు నెలలవఱకును కోటను సంరక్షించిరి. కాని తుద కానందగజపతి ధాటి కోర్వలేక చామర్లకోట శత్రువులవశము కావలసివచ్చినది. అటుపిమ్మట ఆనందగజపతి పెద్దాపురమార్గమున రాజమహేంద్రవరము పోవుచు పెద్దాపురముకోటను ముట్టడించి దానిని స్వాధీనముచేసికొని అచ్చట ఠాణా నేర్పఱచెను.

పిమ్మట రాజమహేంద్రవరమును ముట్టడించి దానిని స్వాధీనముచేసికొనెను. ఇచ్చటనే ఆనందగజపతికిని కర్నలు ఫోర్డునకు భేదములు జనించెను. ఆనందగజపతి తాను కర్నల్ ఫోర్డున కిచ్చుధనము అప్పుగా నిచ్చుటయని తలంచెను. కర్నల్‌ఫోర్డు తనసైన్యమున కగుకర్చులనిమిత్తమై యుచితముగా నిచ్చునని తలంచెను. ఈభేదమునుబట్టి యానందగజపతి తాను కర్నల్‌ఫోర్డున కీయనెంచిన ధనము నిచ్చుట మానివేసెను.

ఈ యిరువురకును గలిగిన భేదమును (నైజాముల్ ముల్కు) సలాబత్‌జంగు కనిపెట్టి * ఇంగ్లీషువారిని విడిచిపెట్టి తనకును ఫ్రెంచివారికిని తోడ్పడవలెనని ఆనందగజ

* "In the mean time, Sala but Jung was gradually approaching, and had sent letters to Anandaraj and the Zamindar of Narseepore, ordering them immediately to leave the English and join his standard." (Broome's History of the Rise and progress of the Bengal Army, Vol. I P. 231)

పతికి వ్రాసెను. కాని యానందగజపతి యందుల కెంతమాత్రమును అంగీకరించలేదు. ఈవిషయములో ఆనందగజపతికిఁ గల ధైర్యసాహసములును, రాజభక్తియును, సత్యవాక్పరిపాలనమును, బలపరాక్రమములును నెంతయుఁ గొనియాడవలసియున్నది. హైదరాబాదునవాబంతటివాఁడు తనసహాయమును కోరినను తాను కలకత్తానుండి రప్పించిన ఇంగ్లీషు వారిపక్షముననే తానుండి తాను వారికి చేసెదనని యుపకారమునందే తనదృష్టి నుంచెను గాని బలవంతుఁడనియు తనపై యధికారియనియును నెంతమాత్రమును సలాబత్ జంగునకు భయపడలేదు. అంతియకాక నిజముగా ఇంగ్లీషువారి తోడ్పాటు తనకున్నను లేకున్నను కూడ దక్కను సుబేదారుఁడగు సలాబత్ జంగును నాతనిసేనాపతులగు ఫ్రెంచివారిని నోడించగలిగిన బలపరాక్రమములును సామర్థ్యమును తనకుండినగాని నట్టిసాహసకార్యమున కాతఁడు దిగఁడు. ఇంగ్లీషువారు గొప్పక్లిష్టపరిస్థితులలో నున్నప్పుడీయానందగజపతి వారి కిట్టి మహోపకార మొనరించెను.†

† This was a most perplexing dilemma, as the intelligence that the French were bescieging Madras with a powerful force, had ruined the English credit in that part of the country, which the Rajah's name and support could only restore." (Broome's history of the Rise and progress of the Bengal Army Vol. I P. 223). (Vide orme Vol. III Book XI P. 473 also).

కాని కంపెనీవా రిట్టిమహోపకారమును కొలదికాల మైనను జ్ఞాపకముంచుకొనక ఆనందగజపతి శరీరమును విడిచి పెట్టిన వెంటనే విజయనగరముయొక్క బలమును నడగఁ ద్రొక్కుటకు వీరుచేసిన పనులు విమర్శనీయము లని చెప్పక తప్పదు.

ఆనందగజపతి తా నీయనిర్ణయించుకొనిన సొమ్మును ఫోర్డున కీయకపోగా నాతఁడు మిక్కిలి విసుగుదలతో ఆనంద గజపతి సైన్యమును విడిచిపెట్టి తాను తన సైన్యముతో 23 తేదీని గోదావరి దాటి ముందుకు ముందుకు నడచెను. కాని ధన ము లేకపోవుటచే వెంటనే 26 తేదీన మరల గోదావరిదాఁటి యీవలకు రావలసివచ్చెను.

ఫోర్డు గోదావరిదాటి మరలివచ్చుట.
23rd 26th

ఈ విషమపరిస్థితులు విశాఖపట్టణములోనున్న ఆం డూ్రిస్‌కు తెలిసినవెంటనే ఆనందగజపతియొద్దకు వచ్చి యీ తఁడిచ్చు ధనమంతయు అప్పుక్రిందనే యొప్పుకొనుచు 1758 నవంబరు 15 తేదీని జరిగిన ఒడంబడికలోని మొదటినిబంధన నిట్లు సవరించెను.

* "ఆనందగజపతి యిచ్చు ధనమంతయు నప్పుగా తీసికొనుటకును ఫ్రెంచిస్థానములు తప్ప గోదావరికి నైరుతి

* Broome's History R and P of B A Vol. I P. 223 and also Orme Vol. III P. 473.

(S. W.) మూలగానున్న మండలములలోని రాఁబడియంత యు ఆనందగజపతియు కంపెనీవారును చెఱిసగముగా పంచు కొనుటకును " నిర్ణయించుకొనఁబడెను.

పైసవరణ జరిగినపిమ్మట ఆనందగజపతి కర్నలుఫోర్డు నకు † 6000 రూపాయలు తక్షణమే నగదు పూర్వకముగను మఱి పదిదినములు పోయినపిమ్మట 60,000 రూపాయిలు 'బిల్లులు' (Bills) మూలముగను ఇచ్చెను.

ఈసొమ్ము చేరినవెంటనే ముందుగా కర్నలుఫోర్డు తన సైన్యముతో గోదావరిని దాటి మచిలీపట్టణమును ముట్టడిం చెను. ఇంతలో ఫ్రెంచిసైన్యము కొన్ని విజయ

6-8-1759. నగరమును ముట్టడించుటకు వెళ్లుచున్నట్టు ఆనంద గజపతికి అసత్యపువార్త తెలియుటచే ఆనందగజపతి తన కుటుంబమును పెద్దాపురములో దిగవిడిచి తాను కొంచెము వెనుకకు వెళ్ళెను.

ఇంతలో శ్రీకాకుళఫౌఁజుదారుఁడగు అన్వరల్లీఖానుఁ డు తిరుగుఁబాటు చేయుచున్నవార్త ఆనందగజపతికి తెలిసి

11th April 1759. ఏప్రిల్ 11 తేదీని తనసైన్యములోఁ గొంత భాగమును శ్రీకాకుళము పంపించి ఫౌఁజు దారు నోడించి శ్రీకాకుళమున నింగ్లీషుపతాకమును స్థాపించె ను. శ్రీకాకుళముసర్కారునకు ఫౌజుఁదారులుగా వచ్చినవారి

† Broom (223).

లో నీ అన్వరల్లీఖానుఁడె తుదియాతఁడు. ఇతనితో ఫౌఁజుదారులపదవి యంతమొంది సర్వమును ఆనందగజపతిచేతిలోనికే వచ్చెను. రాజమహేంద్రివరమున "బ్రిస్టల్" అనునతని తనపక్షమున గవర్నరుగా నియమించెను.*

మిగిలిన తనసైన్యములను కర్నలుఫోర్డునకు సహాయముగా మచిలీపట్టణము పంపెను. ముట్టడి ఒకమాసము జరిగెను. ఆనందగజపతికిని కర్ణలుఫోర్డునకును కలుగుచున్న జయపరంపరలను సలాబత్ జంగు చూచి కర్ణలుఫోర్డుతో నొడంబడిక చేసకొనుటకై సలాబత్ జంగు తలంచెను. ఈవిషయము చెన్నపురిగవర్నరునకు తెలిసి మార్చి 30 తేదీని ఆనందగజపతిపేర నొకఉత్తరమును వ్రాసెను. అందు "సలాబత్ జంగు వ్యవహారములను పరిష్కరించుకొనుటకై యీప్రాంతమునకు వచ్చుచున్నాఁడనియును అందుచే మీరును కర్నలుఫోర్డును కలసి యొకరాయబారిని నైజామువద్దకు మిక్కిలి వినయవిధేయతలతో నంపి మీరు నైజామును నిదివఱకువలె మిక్కిలి వినయవిధేయతలతో మీకు ప్రభువుగా నొప్పుకొని వానికి లోఁబడియుండుటకును, ఇదివఱకు మీకుటుంబమునకు జరుగుచుండిన సకలమర్యా

చెన్నపురిగవర్నరు 30-1-1759 తేదీని ఆనందగజపతికి వ్రాసిన ఉత్తరములోని సారాంశము

* "The Rajah appointed Captain Bristol, a European in his service, Governor of this (Rajahmundry) fortress" (Cambridge's War in India P. 277).

దలతోడను మీా రనుభవించుచుండిన సమస్తహక్కులతోడ ను మీాయనుభవములో నున్న దేశమంతయు నెప్పటివలెనె మీా రనుభవించుటకును, కంపెనీకి వర్తకమునకు కావలసిన సకలయవకాశములతోడను నిరభ్యంతరముగా కంపెనీవారు వర్తకముచేసికొనుచు వారి యాత్మసంరక్షణార్థమై కావలసిన బలమును వారు నిలవచేసికొనుటకును ననుకూలమగునట్లు గా నైజాముతో వ్యవహారము పరిష్కరించుకొనిన బాగుం డునని యభిప్రాయపడుచున్నాను" అని కలదు.

కాని యీయొడంబడిక ఆనందగజపతి కిష్టములేదు. మొదట సలాబత్‌జంగు ఇంగ్లీషువారిని విడిచిపెట్టి తనకు సహాయముగా రమ్మని కోరినప్పుడు తాను వెళ్ళక యిప్పుడు నైజామువద్దకు తానే ఒడంబడికకై రాయబారి నంపుట తన యాత్మగౌరవమునకు తక్కువగా తలంచెను. తాను నైజాము నకు లోబడి యాతనితో నొడంబడిక చేసికొనవలసినంత అవసరము తనకేమియు కలుగలేదు. తమస్వలాభమునకై కంపెనీవా రెవరితోడనైనను నెట్టి యొడంబడికలైనను కాలా నుసారముగాఁ జేసికొందురుగాక! కంపెనీవారి స్వలాభమున కై ఆనందగజపతి తన గౌరవమును స్వాతంత్ర్యమును చెడఁ గొట్టుకొనుట ధర్మము కాదుగదా! అందుచే ఆనందగజపతి నైజామువద్దకు రాయబారి నెవరిని పంపలేదు.

## రెండవ భాగము.

అందుచే కర్నలుఫోర్డు తాను స్వంతముగా మె తేదీని సలాబత్ జంగుతో నొక యొడంబడిక చేసికొనెను.

ఒడంబడిక 14th may 1759

అందు:— ఇంగ్లీషువారికి కావలసిన యేర్పాటు లన్నియును చేసికొనుటయే కాక ఆనందగజపతి ఇదివఱకు ఫ్రెంచివారికి చెందియున్న యుత్తర సర్కారులనుండి వసూలుచేసిన సొమ్మునుగాని ఆనందగజపతి యీయనలసిన కిస్తీనిగాని నైజాము ఆనందగజపతి నడుగ కుండుటకును, ఫ్రెంచివారి కుత్తరసర్కారులు రాకపూర్వము నుండియును విజయరామగజపతి మొదలగురాజు లేవిధమున నిదివఱకు వారిదేశమును అనుభవించుచుండిరో యదేవిధమున నిప్పుడును ఆనందగజపతి తనదేశమును సమస్తహక్కులతోడ ను ననుభవించుటకును, పూర్వము విజయనగరముసంస్థాన మునుండి నైజామున కెట్లు పన్ను చెల్లుచుండెనో యిప్పుడును నట్లే నైజామునకు పన్ను చెల్లుచుండుటకును, ఇందుకు ఆనంద గజపతి సమ్మతింపనియెడల నైజాము తన యిచ్చవచ్చినట్లు చేయుటకును కూడ కొన్ని *షరతు లుదహరింపఁబడెను.

ఆనందగజపతికి మిక్కిలి అనుకూలముగా నగపడు పద్ధతులపైనె యీయొడంబడికను కర్నలుఫోర్డు చేసినను, ఆనంద గజపతిమాత్రి మాయొడంబడిక కొప్పుకొనిన ట్లగపడదు. అంతియకాక తా నా యొడంబడికను లెక్కలోనికే తీసికొన

---

* అనుబంధములోని పూర్తియైన యొడంబడికను జూడుడు.

యథావిధిగాఁ దనకార్యములను దాను నెరవేర్చుకొను చుండెను. నైజాము నెంతమాత్రము లక్ష్యపెట్టలేదు.

పెద్దాపురముకోటను ఆనందగజపతి వశముచేసికొనిన పిమ్మట పెద్దాపురమును విడిచి పాఱిపోయిన వత్సవాయిరాయ జగపతిరాజు మరల కొంతమంది గ్రోగుచివారి తోడను డచ్చివారితోడను రావు నీలాద్రి రాయనింగారితోడను కూడి ఆనందగజపతితో యుద్ధమునకుఁ దలపడెను. ఉభయసైన్యములును ఉండూరువద్ద తలపడెను. జగపతిరాజునకు సహాయముచేయుటకు వచ్చినవారెల్లరును నాతని యుద్ధములో నొంటరిగా విడిచి పాఱిపోవుటచేత జగపతి రాజునకు సహాయములేక యుద్ధములో గుండుదెబ్బ తగిలి స్వర్గస్థుఁ డయ్యెను.

ఉండూరుయుద్ధము Dec. 1759

ఇట్లు ఆనందగజపతి తన కెందును నెదురులేక కళింగ రాజ్య మంతయును నేకచ్ఛత్రాధిపత్యముతోఁ బరిపాలించు చుండెను.

ఈతఁడు * హైదరాబాదుపై దండెత్తి వెళ్లుటకై ప్రయత్నించి యుద్ధములో తనకు జయముకలుగుటకై తమ కులదేవత యగు కనకదుర్గను బెజవాడయొద్ద సేవించుచుండ శరీరముపై పొక్కులు కనఁబడినట్లును వెంటనే ఆనందగజపతి

* పూసపాటివారి కైఫీదు 6, 8 పుటలు చూడుడు.

రాజమహేంద్రవరము వచ్చి చేరినట్లును కొన్ని కైఫీదులు చెప్పుచున్నవి.

ఆనందగజపతికి స్ఫోటకము వచ్చి 1760 సంవత్సరము ఫిబ్రవరి 25 తేదీని ఆకస్మికముగా రాజమహేంద్రవరమున తన యిరువదియవయేట మరణించెను. ఈయనశరీరమును లక్షాపదివేలరాణువతో తీసికొనివెళ్లి దహనపఱచినట్లు పూసపాటివారి కైఫీదు చెప్పుచున్నది.

ఇంతటితో విజయనగరరాజ్యముయొక్క సంపూర్ణ స్వాతంత్ర్యమేక మంతరించినది.

## *The Seal of Salbatzing.*

" The whole of the Circar of Masulipatam, with eight districts as well as the Circar of Nizampatam, and the districts of Codaver and Wacalmannar, shall be given to the English Company, as an Enam, (or free gift) and the Saneds granted to them in the same manner as was done to the French." " Salabatzing will oblige the French Troops which are in this country, to pass

"Treaty with Salabatzing Souba, or Viceroy of the Deckan"

the river Ganges within fifteen days, or send them to Pondicherry, or to any other place out of Deckan country, on the other side of the river Kristna. In future he will not suffer them to have a settlement in this country on any account whatsoever, nor keep them in his service, nor assist them, nor call them to his assistance. "

" The Souba will not demand or call * Ganzapettyranze to an account for what he has collected out of the Circars belonging to the French, nor for the computation of the revenues of his own country, in the present year, but let him remain peaceably in it in future, and according to the computation of revenues of his country before the time of the French, agreeable to the custom of his grand-father, and father and as was then paid to the Circar, so he will now act and pay accordingly to the Circar, and if he (the Raja) does not agree to it, then the Souba may do what he pleases. In all cases the Souba will not assist the enemies of the English, nor give them protection. "

" The English on their part will not assist the Souba's enemies, or give them protection. "

" In the Souba's own hand "

---

* The name of the Raja of Visanapore (Vizianagram)

"I swear by God and his prophet, and upon the Holy Alcoran, that I with pleasure agree to the requests specified in this paper, and shall not deviate from it even an hair's breadth."

"Dated Moon Ramadan 16th, Hegira 1172, which is the 14th of May, 1759."

(Cambridge's "War in India" pages 284 and 285, Vide, "Aitchison's Treaties," Third Editiou Vol. VIII page 278, also).

ఆనందగజపతియొక్క సంపూర్ణస్వాతంత్ర్యమును తెలియఁజేయుటకు Meadaows Taylor వ్రాసిన "Students Manual of the History of India" Chapter XIII Book V Pages 450-55 లో "Of the Political condition of India, 1761" అను శీర్షికక్రింద 32 రాజ్యములఁగూర్చి వ్రాయుచు నందు విజయనగరరాజ్యమును 22 వ సంఖ్యక్రింద నిట్లు వ్రాసెను.

".........North of the latter, (Godavary) as for as the frontuer of Orissa, the Rajah of Vizaga-
22. Rajah of patam or Vizianagram, had re-establish-
Vizianagram. ed on an independent principality under the protection of the English but it was of limited extent, and of inconsiderable political importance."

## ఉత్తరచరిత్రము.

- (పొట్నూరు) కృష్ణమరాజు
  - జగన్నాథరాజు
    - కృష్ణమరాజు
      - సీతారామరాజు
        - రామభద్రరాజు
          - సీతారామరాజు
          - వేంకటపతిరాజు ఉరపు 9 విజయరామరాజు II
  - అన్నమరాజు
    - కృష్ణమరాజు
      - 3 అన్నమరాజు
      - 4 వేంకటపతిరాజు
        - 6 సీతారామరాజు
          - 8 ఆనందగజపతి II
      - 5 ఆనందరాజు I
        - 7 విజయరామరాజు I (భార్య చంద్రయ్యమ్మ)
          - (పెంపకము) 9 విజయరామరాజు II
    - గోపాలకృష్ణంరాజు
- (భోగాపురం) రఘునాథరాజు ఉరపు 1 మాధవవర్మ
  - 2 సీతారామచంద్రుడు
    - (పెంపకం) 5 ఆనందరాజు I

1759 సం॥ ఏప్రిల్ మాసములో శ్రీకాకుళముసర్కారులో ఫౌజుదారు లంతరించిరి. 1760 సం॥ ఫిబ్రవరి 25 తేదీని

అరాజకము

శ్రీకాకుళరాజమహేంద్రవరముసర్కారులకు (కళింగదేశమునకు) ప్రభు వగు ఆనందగజపతి స్వర్గస్థుడయ్యెను. ఈయనకు సంతానము లేదు. అందుచే (కళింగ

దేశమును * (విజయనగరమును) పరిపాలించుటకు సరియైన ప్రభువు లేకపోవుటచేత దేశ మరాజక మయ్యెను.) అందుచే పెదవిజయరామగజపతిమహారాజులుంగారి పట్టపుదేవియు ఆనందగజపతిమహారాజులుంగారి పినతల్లియు నగు చంద్రయ్యమ్మగారు తాళ్లపాలెములో నివసించియుండిన వారి జ్ఞాతులగు పూసపాటి రామభద్రరాజుగారి రెండవకుమారుఁడగు వేంకటపతిరాజును పండ్రెండేండ్లు యీడుగల బాలకుని పెంచుకొని యాతనికి విజయరామగజపతి యని నామకరణము చేసిరి. ఈతఁడే రెండవవిజయరామగజపతి.

II
విజయరామగజపతి దత్తత

(పెదవిజయరామగజపతిమహారాజులుగారు బొబ్బిలిపైకి యుద్ధమునకు వెళ్ళుచున్నప్పుడే చంద్రయ్యమ్మగారిని

దత్తతాధికారము.

బుల్లాబుచ్చన్నగారిని పిలిచి "†ఆనందరాజు బ్రతుకు నిశ్చయంలేదు. మేమున్ను బొబ్బిలిమీదికి లడాయికి వెళుతాము. తిరుగా యీసారి రావడంలేదు. మాకున్ను అరవైసంవత్సరములు అయినది. గండదినములున్ను దగ్గరకు వచ్చినది........మూడుసంవత్సరముల పర్యంతము సంస్థానాన్కి అధిపతి ఆనందరాజు. తదనంతరం అతనికి గండం

* కళింగదేశ మనినను, శ్రీకాకుళరాజమహేంద్రవరముసర్కారులనినను, విజయనగరరాజ్య మనినను ఒక్కటే.

† పూసపాటివారికైఫీదు ౧౧ పుట.

ఎలుతుంది. ఆగండంలో యితను బ్రతగకపోతాడా? ఆ తా తాళ్లపాలెంలో రామభద్రరాజు కొడుకు చిన్నవాడు వున్నాడు. అతణ్ని పెంచుకొమ్మనుము." అని చెప్పినట్లు పూసపాటి వారి కైఫీదువలన తెలియుచున్నది.)

మొదటి (పెద) విజయరామగజపతి చెప్పినట్లే ఆనందగజపతి మూడేండ్లు రాజ్యపరిపాలన మొనరించి కాలము చేయుటచే చంద్రయ్యమ్మగారు రామభద్రరాజుగారి ద్వితీయ పుత్రులగు వేంకటపతిరాజుగారిని పెంచుకొనిరి.

ఆనందగజపతి హైదరాబాదుపై దాడివెడలు వార్త నైజాముల్ముల్కు విని మార్గమధ్యముననే ఆనందగజపతి నెదిరించుటకై తనసైన్యముతో గోదావరివఱకు వచ్చి యచ్చట ఆనందగజపతి మరణవార్త విని యచ్చటనే పదిదినము లుండిపోయెను. నైజాముల్ముల్కు గోదావరీ తీరమునయుండఁగనే చంద్రయ్యమ్మగారు తనతమ్ముఁడగు చింతలపాటి నీలాద్రిరాజుగారిని, దివాన్ గుండాల అప్పాజీగారిని, బుస్సీ బుచ్చన్నగారిని వెంటఁబెట్టుకొని తన దత్తపుత్రుఁడగు విజయరామగజపతిని తీసికొని నైజామును సందర్శించి యాతనివలన నీబాలకునకుఁ బట్టాభిషేకమున కనుజ్ఞఁగొనివచ్చెను.

ఇతఁడు బాలుఁడగుటచే నీతని సవతియన్న యగు సీతారామరాజు రాజ్యమును జూచుచుండెను. ఇతఁ డత్యాశాపరుఁడు, స్వలాభపరాయణుఁడు, క్రూరుఁడు, స్వామిద్రో

హి. విజయనగరసంస్థానముయొక్క స్వాతంత్ర్యము చెడుటకు ను సంస్థానమును పాడగుటకును నీతని దుష్టచర్యలే కారణములు.

ఈ సీతారామరాజు తన సాపత్నిసోదరుఁడగు విజయరామగజపతిని చంద్రయ్యమ్మగారు పెంచుకొనినపిమ్మట తానేమో జ్యేష్ఠుఁడననియును, నందుచే రాజ్యము తనకు వచ్చుననియును ఆనందగజపతి తనకు రాజ్యము నిచ్చుటకే వాగ్దత్తముచేసెననియును నామెను బెదరించుచు కొంతకాలము మన్యములవెంటఁ దిరిగి యచ్చటి జమీందారులను బెదరించుచు వారివలనఁ దనకు కావలసిన ధనమును కర్చువెచ్చములకుఁ బుచ్చుకొనుచు కాలము గడపుచుండెను. ఇట్లుండ నీవార్త చంద్రయ్యమ్మగారికిఁ దెలిసి సీతారామరాజును పట్టించుట కామె ప్రయత్నించెను. కాని యాతఁడు దొరకలేదు. ఇట్టియల్లరులు మాని వేసిన సీతారామరాజునకొక గ్రామము మొఖాసాగా నిచ్చెదమనికూడ చంద్రయ్యమ్మగారు కబురంపిరి. అందులకు సీతారామరాజు సమ్మతింప లేదు.

జమీందారు బాలుఁడగుటచేతను స్త్రీ పరిపాలకురాలుగా నుండుటచేతను సీతారామరాజు దుర్మార్గుఁడగు రాజబంధువగుటచేతను సీతారామరాజు తన యిచ్చవచ్చినట్టు

లాటలాడనారంభించెను. ఈతఁ డొకనాఁడు బకిషీకిల్లేదారుఁ డైన సాగి నారాయణరాజును లోపుచేసికొని యాకస్మికము గా తనసిబ్బందితో కోటలోఁ బ్రవేశించి చంద్రయ్యమ్మగారిని తనతమ్ముని నిర్బంధించి కొన్నిదినములు తనపేరనే సంస్థాన ములో నాజ్ఞాపత్రములు పంపుచు జమీాందారులపై దండెత్తు చుండెను. కాని యీతనియాజ్ఞాపత్రముల నెవ్వరును మన్నిం పకపోవుటయే కాక యితఁ డెక్కడికి వెళ్లినను నపజయమే కలుగుచుండెను. అందుచే సీతారామరాజు తాను రాజునను టవలన లాభములేదని గ్రహించి తనతమ్ముని మహారాజుగా నంగీకరించి తాను దివానను పేరుతో వ్యవహరింప నారం భించెను.

ఇట్లు కొంతకాలము తనకు బలము చేకూరినపిమ్మట చంద్రయ్యమ్మగా రున్నంతకాలమును తనపరిపాలనమున కడ్డ మువచ్చునని భావించి యొకనాఁ డామె దేవ్రపల్లెకోటలో నుం డఁగా పొడిపించి చంపించెను.

ఇట్లు సీతారామరాజు సర్వమును తాను స్వీకరింపవలె నని ప్రయత్నించుచుండఁగా ఆనందగజపతినాఁటి సరదారు లగు ముగ్గురుమహమ్మదీయులు తమకు జీతములు సమముగా ముట్టలేదను నెపమున క్షత్రియసోదరుల నిరువురను జంపి రాజ్య మాక్రమించుకొననెంచిరి. కాని యీసమాచారము సీతారామరాజునకు తెలిసి వారివేతనములు వారి కిప్పించెద

మని వారిని కళింకోటకు రప్పించి వారిని ముష్కరను చం
పించెను.

1752 వ సంవత్సరమునుండియు జయపురముసింహా
సనమునకై లాలా కృష్ణదేవును నాతని సోదరుఁడగు విక్రమ
దేవును కలహించుచుండిరి. విక్రమదేవుఁడు విజయనగరము
సంస్థానాధిపతులను దనకు సహాయముగా కోరెను. విజయ
నగరపాలకులు విక్రమదేవునకుఁ దోడ్పడి లాలాకృష్ణదేవుని
సింహాసనభ్రష్టునిఁ జేసి కళ్యాణపురమునకుఁ దగిలివేసి విక్రి
మదేవునకుఁ బట్టముకట్టిరి. విక్రమదేవునకు సహాయమొనరిం
చినందులకుఁ బ్రతిఫలముగా విజయనగరసంస్థానాధిపతులు
జయపురమురాజ్యమునుండి, 1 మాడుగుల, 2 కాశిపురము,
3 ఆండ్ర, 4 సాలూరు, 5 పాచిపెంట, 6 చెముడు, 7 బెల
గాము, 8 సంగమవలస, 9 కురుపాము, 10 మేరంగి జమీ
లను బుచ్చుకొనిరి. నాఁటినుండియు నీజమీలు విజయనగర
మువారి యనుభవములోనికి వచ్చినవి.

మహారాష్ట్రులు సర్కారులపైని దాడివెడలినప్పుడు
రఘోజీభాంస్లే కుమారునకు దారిచూపి సహాయపడిన పాచి
పెంటజమీందారగు వీరప్పదొరను మొదటి విజయరామ
రాజే యోడించి వాని నామరణాంతముఁ కారాగారవాసుని
గా నొనరించి వానిరాజ్యమునుఁ గైకొనెను.

గంజాముమండలమునఁ గల పర్లాకిమిడిజమీందారీ 1761 లోఁ జాలభాగము సీతారామరాజు బలవంతముగా నాక్రమించుకొనెను.

మొదటి విజయరామగజపతి బొబ్బిలిని జయించినపిమ్మట చెలికాని గోపాలకృష్ణరంగారాయని తమ్ముఁడగు వేంగళరాయఁడు చినరంగారాయని దీసికొని భద్రాచలము చనియెను. ఆనందగజపతి రాజమహేంద్రవరములోఁ గాలధర్మమునొందినపిమ్మట చినవేంకటరంగారాయని దీసికొని వేంగళరాయఁ డీప్రాంతమునకు మరల వచ్చెను. ఇట్లువచ్చిన వేంగళరాయని చినవేంకటరంగారాయని విజయనగరప్రభువులు సన్మానించి, కవిటి, రాజాంహవుంజాలు రెండును సాలునకు 20,000 రూపాయిలకు కౌలునకిచ్చిరి. వేంగళరాయఁడు విజయనగరముపై కుట్రలు పన్నుటకుఁ బ్రయత్నించుచుండుట సీతారామరాజు తెలిసికొని వెంటనే సైన్యముతో నాప్రాంతమునకుఁ బోయి యెట్టియల్లరులును లేకుండఁజేసెను. ఇట్లు వేంగళరాయఁడు మూఁడేండ్లు జీవించి కాలధర్మము నొందినపిమ్మట చినరంగారాయఁడు రాజ్యమునకు వచ్చెను. ఇతఁడుకూడ, పోయిన రాజ్యమునంతటిని మరల సంపాదించుటకుఁ జిల్లర జమీందారులతో కలసి కుట్రలు పన్నుచుండినవార్త సీతారామరాజునకు తెలిసి 1766 వ సంవత్సరమున చినరంగారావుని బంధించి విజయనగరముకోటలో నుంచెను.

ఇట్లు విజయనగరముసంస్థానము చీకాకులయుం డున్నదినములలో 1765 సం॥ ఆగస్టు 12 తేదీని రాబర్టుక్లైవు

ఉత్తరసర్కారులు ఆంగ్లేయులకు చేందుట 1765

మొగలాయీచక్రవర్తియగు రెండవ అలంఘీరుషా అలంఘాదుషానుండి యుత్తరసర్కారులను ఇనాముగా నిచ్చివేసిన శ్లోకఫర్మానాను పుచ్చుకొనెను. ఈ రెండవ అలంఘీరు చక్రవర్తియే మొగలాయీచక్రవర్తులలో తుదిచక్రవర్తి. ఈ 1765 వ సంవత్సరమే యతని పరిపాలనములో తుదిసంవత్సరము. అప్పటికి దక్కనుదేశము ఢిల్లీచక్రవర్తుల చేతుల నుండి జాఱిపోయినది. *దక్కనుసుబేదారులే స్వతంత్రాధికారులైరి. ఇట్టిపరిస్థితులలో నుత్తరసర్కారులే కాదు దక్కను రాజ్యమంతయు ధారపోసినను అలంఘీరునకు నష్టములేదు.

అలంఘీరు ఫర్మానా నములుచేయుటకై ఇంగ్లీషుకంపెనీవా రుత్తరసర్కారులలోఁ బ్రయత్నించిరి. కాని సర్వాధికారమును కోలుపోయి కంపెనీవారి పోషణములో జీవించుచుండిన అలంఘీరుఫర్మానాను మన్నించువారెవరు? దక్కనుసుబేదారుఁడగు సలాబత్ జంగు ఈఫర్మానా నంగీకరింపలేదు.

---

* **The treaty was signed by Shah Alum, August 12, 1765, in Clive's own tent, the imperial throne being represented by a chair supported upon a couple tables.**

**("The makers of British India" by Davinport Adams, P. 79 foot note).**

అందుచే కంపెనీవారు 1766 సం॥ నవంబరు 12 తేదీని దక్కనుసుబేదారునితో నొక *మొడంబడిక చేసికొని యామొడంబడికప్రకారము సుబేదారునకు సంవత్సరమునకు 5 లక్షల రూపాయిలు చెల్లించుకొనుచు రాజమహేంద్రవరము ఏలూరు ముస్తాఫానగరము (ఉరఫు కొండపల్లె)సర్కారు లనుభవించుటకును; శ్రీకాకుళము, మూర్తిజనగరముసర్కారులు వారి స్వాధీనములోనికి వచ్చినపిమ్మట యారెండుసర్కారులకును 4 లక్షల రూపాయిలు చొప్పున మొత్తము 9 లక్షల రూపాయిలు చెల్లించుటకును నిర్ణయించుకొనఁబడెను.

శ్రీకాకుళము, మూర్తిజనగరముసర్కారులు రెండును తనస్వాధీనమునందు లేక ఒకటి పూసపాటిస్వాధీనమునందును ఒకటి తనసోదరుఁడగు బజాలత్ జంగు స్వాధీనము

---

* Treaty with Nizam, 1766. Article 3 :—

"The Honourable English East India Company do further engage and promise, that in whatever year the assistance of their troops shall not be required, they will pay to His Highness, as a consideration for the free gift of the above mentioned five Circars, for ever and ever, the following sums, by kists, as specified in the 8th Article of this Treaty, viz., for the three Circars of Rajahmundry, Ellore and Mustafurnugger, five lakhs of Rupees ; and for those of Siccacole and Moortizanugger, as soon as they are in their hands, and the settling the same is well effected, two lakhs each ; in all nine lakhs of Rupees per annum."

లోను నుండుటచే నారెంటిని ఒడంబడికనుండి కేటించి అవి కంపెనీవారి స్వాధీనములోనికి వచ్చినదగ్గరనుండియు వానికి కప్పముకట్టుట కేర్పఱచెను. అంతియకాక యీసర్కారులఁ గూర్చియు ఒడంబడికయొక్క *నాలుగవ నిబంధనలో తనసెలవగువఱకుగాని లేక బజాలత్ జంగు చనిపోవువఱకుగాని యతఁ డనుభవించుచున్న జాగీరు మూర్తిజనగరమును ముట్టుకొనకుండుటకునుకూడ వ్రాసి దైవానుగ్రహమువలన శ్రీకాకుళముసర్కారు సాధ్యమైనంతత్వరలో కంపెనీవారి స్వాధీనము కాఁగలదనికూడ వ్రాసెను.

పై యొడంబడికవలన శ్రీకాకుళముసర్కారుపై నైజాముల్ముల్కు (సలాబత్ జంగు)న కెట్టిస్వాతంత్ర్యమును లే

---

* Article 4 :—" The reduction of the Siccacole Circar, by the blessing of God, the Company will effect as soon as possible; but that of Moortizanugger, in consideration of His Highness having by former agreements, given it to his brother Bazalut Jung as a jaghire, the Honourable English East India Company do promise and engage not to take possession of until it be His Highness's pleasure, or until the demise of his said brother ;........."

" Dated........ the 12th of November 1766. "

(Aitchison's Treaties (3rd Edition) Vol. VIII P. P. 280-281).

1767 సం॥ న కంపెనీపరిపాలనము సర్కారులో స్థిరపడుట.

నట్లులు స్పష్టపడుచున్నది. ఇఁక నీ శ్రీకాకుళముసర్కారును కంపెనీవారే వశము చేసికొనవలెను. అందుచే నవాబ్ అస్సాక్ అలీఖానుని, ఖాండే్రగుల జోగిపంతులును పూసపాటివారితో నొడంబడిక చేసికొనుటకై కంపెనీవారు పంపిరి. ఆయొడంబడికలో పర్లాకిమిడిరాజ్యమునఁ దాము జయించి యాక్రమించిన భాగమునందుఁ దమకుఁగలహక్కును పూసపాటివారు వదలుకొని సంవత్సరమునకు మూడులక్షలరూపాయిలు కట్టుకొనుటకును నేర్పాటులు జరిగెను. ఈ యొడంబడికప్రకారము 1767 వ* సంవత్సరమునుండియు పూసపాటివారిపైని కంపెనీవారి కధికారము కలిగినది. ఈయధికార మిప్పటికి నామమాత్రమే గాని యంతకెక్కు‌వ లేదు. ఇదియైనను సీతారామరాజుయొక్క దురుద్దేశములవలనను విజయరామగజపతియొక్క బాల్యావస్థవలనను కలిగినదేగాని మఱియొకవిధముగా వచ్చినది కాదు.

---

* The Firmaun with the subsequent treaties o 1766 and 1768 completed the transfer of the Circars t the British who established their authority over th Poosapauties from the year 1767. They then paid thei first tribute of three lakhs to the Chief of Musilipatam which had remained in our hands since its capture b Ford in 1759.

(Manual of the Administration of the Madra Presidency Vol. I P. 54, foot-note 2).

శ్రీకాకుళముసర్కారు తమకు లోఁబడినపిమ్మట కంపెనీవారు 1769 సం॥ జూలై 7 తేదీని తమ ప్రధానస్థానమును మచిలీపట్టణమునుండి విశాఖపట్టణమునకు మార్చి జాన్ ఆండ్రూస్ అను నతనిని ఛీఫ్ ఇన్ కౌన్సిలు (Chief in Council) గా నేర్పాటుచేసిరి.

ఇప్పుడు కళింగరాజ్యమున ద్వంద్వపరిపాలనము సంభవించెను. ఒకవంక కంపెనీపరిపాలనము వేఱొకవంక జమీందారుల పరిపాలనము. ఈయుగసంధిలో చిల్లరజమీందారులందఱు నేకమై విజయనగరసంస్థానాభివృద్ధియు వారి జయపరంపరలును సీతారామరాజు దౌర్జన్యమును సహింపలేక విజయనగరముసంస్థానమును నిర్మూలింపవలెనని ప్రయత్నించిరి. ఈకుట్రలన్నియును కిమిడిప్రాంతమున జరుగుచుండెను. వీరికి జయపురముజమీందారగు మొదటివిక్రమదేవు నాయకుఁడుగా నుండెను.

1775 జయపురము తిరుగుబాటు

సీతారామరాజీసమాచారమంతయుఁ గనిపట్టి "రిచర్డుమేచ్యూ" (Captain Richard Mathews) యను కంపెనీ సేనానాయకుని తోడ్పాటుతో జయపురముపై దండువెడలెను. విక్రమదేవు తనసైన్యము నంతటిని రాయగడయొద్ద సమావేశపఱచి యుంచెను. ఇంతలో సీతారామరాజు జయపురముకోటను ముట్టడించి పట్టణమును ధ్వంసముచేసి కోటగోడలను భూమట్ట మొనరించి

18 th march 1775

1775 సం॥ మార్చి 11 తేదీని జయపురముసంస్థానమును స్వాధీనము చేసికొనెను.

ఈసాలూరుజమీందారీ 1672_76 సంవత్సరముల నడుమ జయపురమును పాలించిన విశ్వంభరదేవుమహారాజు

**2 సాలూరు తిరుగుబాటు** లుంగారిచే ప్రసాదింపఁబడినది. ఈ జమీందారులకు 'బొలియాగొసింహా' యనుబిరుదము నొక దానిని జయపురముమహారాజులుంగారు వంశపారంపర్యముగా వీరి కిచ్చిరి.

ఈసాలూరుజమీందా రగు సన్యాసిరాజుకూడఁ దన పూర్వప్రభువులగు జయపురమువారితోఁ గలసి విజయనగరముపైఁ గుట్రలు సలుపుటచే సీతారామరాజు సాలూరుపై దాడివెడలి సాలూరుజమీందారీ తీసికొని సన్యాసిరాజుగారిని యాతని ముగ్గురుకుమారులను గజపతినగరమునకు సమీపముగానున్న దేవుపల్లికోటలో నిర్బంధించిరి.

ఈసంగమవలసజమీందారీకూడ జయపురమువారి వలన పుట్టఁబడిన జమీందారియే. ఈజమీందారునకు

**3. సంగమవలస తిరుగుబాటు** "నిశ్శంక" బిరుదము కలదు. ఈసంగమవలస జమీందారగు వేంకన్ననిశ్శంకు జయపురము వారిపక్ష మవలంబించి విజయనగరముపైఁ దిరుగుఁబాటు చేయుటచే నిదియును సీతారామరాజుగారి కోపాగ్నికి భస్మమై విజయనగరములో కలసిపోయెను.

కురుపాంజమీందారీకూడ జయపురమహారాజులుంగా రగు విశ్వంభరదేవుగారివలన పుట్టఁబడినదే. అందుచే

4. కురుపాం తిరుగుబాటు

విజయనగరముసైన్యములు జయపురమును ముట్టడించుటకు వెళ్లుచుండినప్పు డీకురుపాం జమీందారుఁ డగు శివరామరాజు వీరిని మార్గమధ్యమునఁ జిక్కులుపెట్టి యాహారసామాగ్రి సైన్యముల కందకుండఁ జేసెను. అందుచే నీజమీందారీకూడ సీతారామరాజు తీసికొని శివరామరాజును నాతనికుటుంబమును దేవుపల్లికోటలో నిర్బంధించెను.

ఈకాశీపురము జమీందారీయును జయపురమువారిచే నొసంగఁబడిన జమీందారీయే యగుటచేత నీకాశీపురము

5 కాశీపురము తిరుగుబాటు

(శృంగవరపుకోట) జమీందారగు ముఖీకాశీపతిరాజును జయపురమువారితో నేకీభవించెను. అందుచే నీసీతారామరాజు కాశీపురముమీఁదికిఁగూడ దాడివెడలెను. ఈకాశీపురము మన్యప్రదేశ మగుటచే కాశీపతిరాజు వెంటనే సీతారామరాజునకు లొంగక కొంతకాలము సీతారామరాజుసైన్యములతోఁ బోరుచు నక్కడక్కడ పితూరీలు చేయుచుండెను. ఇంతలో నాతని పెద్దకుమారుఁడగు వీరభద్రరాజు కాలముచేయుటచే బలహీనుఁడై పుత్రవియోగదుఃఖమున మరణించెను. తరువాత ఇతని రెండవకుమారుఁడగు వీరముకుందరాజు రాజ్యమునకు వచ్చి యతఁడుకూడ

కొంతకాలము సీతారామరాజుతో యుద్ధముచేసి తుదకు సీతారామరాజుతో సఖ్యపడెను. కాని వీరముకుందరాజు స్వల్పకాలములోనె మరణించుటచే నాతని తమ్ముఁడగు రాజ భూపాలరాజు రాజ్యమునకు వచ్చెను. ఇతఁడుకూడ విజయ నగరముపైని తిరుగుఁబాటు చేయుటచే సీతారామరాజు కాశి పురమునుకూడ తీసికొని రాజభూపాలరాజును విజయనగర ముకోటలో నిర్బంధించెను.

6. మాడుగులు పైదాడి

సీతారామరాజు వీరముకుందరాజుతో సఖ్యపడిన పిమ్మట శృంగవరపుకోట విడిచిపెట్టి మాడుగులు లింగ భూపతిని వశపఱచుకొనుటకై యచ్చటికి బయ లుదేరెను. సీతారామరాజు ప్రియత్నములన్ని యును అనకాపల్లిజమీందారగు పాయకరాయనింగారును, లింగభూపతియును గ్రహించి సీతారామరా జనకాపల్లి వచ్చిన మాడుగులు లింగభూపతి పాయకరాయనికి సహాయ ముచేయుటకును, మాడుగులు వచ్చిన పాయకరాయనింగారు లింగభూపతికి సహాయపడుటకును వారిలోవారు నిర్ణయించు కొనిరి. ఈనిర్ణయమును సీతారామరాజు తెలిసికొని వా రుభ యులును కలియకుండ తనసైన్యము అనకాపల్లి మాడుగులు మధ్యప్రదేశమునకు వచ్చి చేరునట్లు చేసెను. అట్లుచేసి సాగి నారాయణరాజునకు కొంతసైన్య మిచ్చి మాడుగులుపైకిఁ బంపెను. నారాయణరాజు మాడుగులుపైకి దండెత్తి వెళ్ళి

మాడుగులు స్వాధీనము చేసికొని యచ్చట నొకఠానా యేర్పాటుచేసెను. లింగభూపతి యక్కడనుండి పాండ్రింకి దుర్గముపైఁ బ్రవేశించి యచ్చటనుండి గోవాడమార్గమున వచ్చి పితూరీలు చేయుచుండెను. ఈపితూరీదారులను పట్టుకొనుటకై సీతారామరాజు ఇద్దరు కంపెనీయుద్యోగులతో నక్కడకు రాఁగా లింగభూపతియును దివాన్ విద్యాధార జోగిరాజును రాత్రివేళ యాకస్మికముగా వారిపైఁ బడి కంపెనీయుద్యోగుల నిద్దరిని హతముచేసి పాఱిపోయిరి. ఇట్లు రాజును మంత్రియు కలసి కొండలుపట్టి గోదావరి దాఁటి పాఱిపోయినపిమ్మట లింగభూపతి యచ్చటనే అస్తమించెను.

గొలుగొండ పైదాడి.

పిమ్మట సీతారామరాజు గొలుగొండపైని దాడివెడలెను. అది మన్యప్రదేశమగుటచే లోనఁ బ్రవేశింపలేక కొండ భూములు వదలి పల్లపుభూములు మాత్రము స్వాధీనము చేసికొనెను. తరువాత సీతారామరాజు పూసపాటి రామచంద్రరాజను సరదారుని పిలిచి యెట్లైన గొలుగొండరాజగు మల్లురాజును చంపిరమ్మని పంపెను. రామచంద్రరాజు గొలుకొండ చని మాయోపాయములచే మల్లురాజును రప్పించి వానిని చంపించెను. కాని వెంటనే మల్లురాజుసరదారులు రామచంద్రరాజును త్రోవలోఁ బట్టుకొని చంపి వానిశవమును నడవిలోనె పాఱవైచిరి. ఏ

దెక్కైనను గొలుగొండమాత్రము సీతారామరాజునకు స్వాధీనము కాలేదు. గొలుగొండసరదారులు వేఱొకరాజును నేర్పాటు చేసికొనిరి.

ఇట్లే సీతారామరాజు రాజమహేంద్రవరము మొదలగుప్రదేశములపైకిఁ గూడ యుద్ధమునకుఁ బోయెను. ఇట్లు సీతారామరాజు చేయుటలో నీతని ముఖ్యోద్దేశము విజయరామరాజునకు దేశములో పలుకుఁబడి లేకుండ సర్వాధికారమును తాను సంపాదించవలెనన్న దురుద్దేశము తప్ప వేఱు కాదు.

సీతారామరాజు ఈ ద్దేశము.

సీతారామరాజు తన దురాశచే నానాఁటికి జనకంటకుఁ డయ్యెను. రాజబంధుపుల నిర్బంధముచే విజయరామగజపతి యీతనిని దివాన్ పదవినుండి తొలఁగింపఁ బూనుకొనెను. కాని సీతారామరాజు తనపదవిని విడిచిపెట్టుట కంగీకరింపలేదు. తనకుమారుఁ డగు నరసింహగజపతిని విజయరామరాజు తనకు తదనంతరకర్తగా స్వీకరించుట కొప్పుకొనిన తాను దివాన్ పదవిని వదలి వేఱొకచోటునకుఁ బోవుటకు సీతారామరాజు అంగీకరించెను. విజయరామరా జెక్కైనను నీతనిని వదల్చుకొనునుద్దేశముతో తనకు మునుముందు పుత్రసంతానము లేకపోయిన తనతదనంతరము తనరాజ్యము నరసింహగజపతికి వచ్చుటకు విజయరామరాజు సమ్మతించెను. 1775 సంవత్సరమున నీయొడంబడిక జరిగినపిమ్మట సీతా

రామరాజు దివాన్ పదవిని విడిచిపెట్టి కంపెనీవారినుండి హావేలీభూములను గుత్తకు తీసికొనెను.

విజయరామగజపతిపైఁ గుట్రలు పన్నుట.

ఇంతటితో సీతారామరాజు తృప్తినొందక పిమ్మట కంపెనీయుద్యోగులతో కలిసి విజయరామగజపతిపై నీతఁడు కుట్రలు పన్నసాగెను. అప్పటి కంపెనీయుద్యోగస్థులు మిక్కిలి లంచగొండులు. యుక్తాయుక్తవివక్షత లేనివారు. పరిపాలనమునకంటె ధనార్జనమునందె యెక్కువ బుద్ధికలవారు. మిక్కిలి బలమైన జమీందారీలలో కలహము లుద్భవించుట లంచమే ప్రధానముగాఁ జేసికొని పరిపాలించుచుండిన కంపెనీవారికి మిక్కిలి యనుకూలముగా నుండెను. అందుచే కంపెనీయుద్యోగస్థులు సీతారామరాజునకు తోడ్పడుచు వచ్చిరి.

ఈదినములలో (ననఁగా 1775 వ సంవత్సరాంతమున) లార్డు పైగాటు చెన్నపురిగవర్నరుగా వచ్చెను. ఈయనకాలములోనె (1776 సంవత్సరమున) ఉత్తరసర్కారులలోని జమీందారుల వ్యవహారములను సమగ్రముగాఁ బరిశీలించి నివేదికమును (Report) పంపుటకొఱకు నొకసంఘమును పంపుటకు కౌన్సిలువారు నిర్ణయించిరి. ఈగవర్నరుగారు ఒకానొకవిషయములో చేసిన నేరమునకై 1776 సంవత్సరము ఆగష్టు

మాసములో 'సీతనిని కౌన్సిలువారు *గవర్నరుపదవినుండి తప్పించిరి.

తరువాత యీతనిస్థానమునఁ బని చూచుచుండిన "స్ట్రాటన్" దొరగారు 19 గురు సభ్యులుగల విచారణసంఘమును ఉత్తరసర్కారులలోనికిఁ బంపిరి.

1778 సంవత్సరము ఫిబ్రవరిమాసములో గవర్నరుగా వచ్చిన సర్ తామస్ రాంబోల్టుదొరగారు ఈకమిటీవిచారణమును నిలుపుచేయించి ఉత్తరసర్కారులలోని జమీందారుల నందఱను స్వయముగా విచారించుటకై చెన్నపుర మ్మని యాజ్ఞాపించిరి. ఉత్తరసర్కారులలో నున్న 31 జమీందారులలోను పదునెనమండుగురు జమీందారులుమాత్రము గవర్నరుగారి యుత్తరువును మన్నించి చెన్నపురి వెళ్ళిరి. మిగిలిన పదుముగ్గురును సమనులను మన్నించలేదు.

జమీందారులు కంపెనీవారికి చెల్లింపవలసిన పేష్కష్ మొత్తమును వృద్ధిచేయుటగాని తగ్గించుటగాని వారు తన కిచ్చులంచములపై నాధారపడియుండెను. రాష్ట్రాధ్యక్షుఁడు మొదలు మండలాధ్యక్షునివఱకును లంచమే ప్రధానముగాఁ జేసికొని పరిపాలించుచుండిరి.

ఈసందర్భముననే సీతారామరాజుగారు రాంబోల్డు

---

* ఈయన 1777 సం॥ మే నెలలో "మవుంట్" అను స్థలమున ఖైదీగా నుండి చనిపోయెను.

గారితో మైత్రియొనరించుకొని వారిని సంతృప్తులుగాఁ జేసి మరల దివాన్ పదవిని సంపాదించిరి. ఈపర్యాయము సంపాదించిన దొక్క దివాన్ పదవియే కాదు. దివాను నేర్పాటు చేయునధికారము ప్రెసిడెన్సీవారికే యుండుటకును, విజయరామగజపతి తదనంతరము తనకుమారుఁ డగు నరసింహగజపతి రాజ్యమునకు వచ్చుటకును, కౌల్లుకదవా లన్నియు నిప్పటినుండియే నరసింహగజపతిపేర జరుగుచుండుటకును, నరసింహగజపతికి తానే సంరక్షకుఁడుగా నుండుటకును గూడ గవర్నరుగారివలన ఉత్తరువు చేయించెను. ఈయుత్తరువు చేయుటకు రాంబోల్డుగారి యాంతరంగిక కార్యదర్శి సీతారామరాజుగారివలన ఒకలక్షరూపాయిలకు (లంచము) *దస్తావేజు కట్టుకొనెను.

విజయరామగజపతి ప్రెసిడెన్సీ బోర్డువారి యుత్తరువు నుల్లంఘించుచు నీవిషయము కోర్టాఫ్ డైరెక్టర్లకుఁ దెలియఁజేయుట.

కాని యీప్రెసిడెన్సీవారి యుత్తరువును విజయరామగజపతి మన్నింపక యిట్టియాజ్ఞాపత్రము దేశమునందు తమకు గలయధికారమునకును గౌరవమునకును భంగము కలిగించుచున్నదనియును, అందుచే నిట్టి యాజ్ఞాపత్రమును తాము మన్నింపఁజాల

* 1781 సం॥ "కమెటీ ఆఫ్ సీక్రిసి" (Committee of Secrecy) వారి మూడవరిపోర్టు 13-14 పుటలు చూడవలెను. 1782 సం॥ ఏప్రిల్ 25 తేదీని House of commons వారియెదుట మే డండాసు దొరగారు జరిగించిన 12 వ తీర్మానమును చూడనగు.

మనియును ప్రెసిడెన్సీబోర్డువారికి వ్రాయుచు నీవిషయమంతయు (ఇంగ్లాండులో నున్న) కోర్టాఫ్ డైరెక్టర్లకు తెలియఁజేసిరి.

(దానిపైని) కోర్టాఫ్ డైరెక్టర్లు 1781 సం॥ జనవరి 10 తేదీని ప్రెసిడెన్సీవారి కొకయుత్తరము వ్రాసిరి. అందులో

**1781సం॥జనవరి 10తేదీని ప్రెసిడెన్సీవారి పేర కోర్టాఫ్ డైరక్టర్లు వ్రాసిన ఉత్తరములోని ముఖ్యవిషయములు-ఫలితము-**

రాంబోర్డు (గవర్నరు)గారిని మఱియిద్దరు కౌన్సిలులోని సభ్యులను వారివారి పదవులనుండి తొలఁగించుట (dismiss)యే కాక "మిక్కిలి పురాతనమైన విజయనగరమురాజావారికి ప్రసిడెన్సీస్థలములో జరిగిన యగౌరవము మాకు తెలిసి మేము మిక్కిలి యాశ్చర్యపడి చాల విచారించితిమి. వారు మీకు తెలియఁజేసిన కారణములను, ప్రార్థనములను మీరు వినక, దురాశాపరుఁడును, కృత్రిమ (చింతయునుగల) స్వభావుఁడును నగు సీతారామరాజుగారిని మీరు స్వతంత్రించి, సహింపఁదగని విధముగా, (విజయరామరాజుగారికి) సర్కారునకు దివానుగా నియమించి సీతారామరాజుగారి కృత్రిమోపాయములకు విజయరామరాజుగారిని బద్ధులగునట్లు మీరు చేసి కేవలము అన్నగారివశములో మీ రాయనను పడవేసిరి. కంపెనీవారికి రావలసిన ధనము చెల్లుటవిషయమున జాగ్రత్తపెట్టుట యగత్యమైనప్పటికిని, ప్రత్యేకముగా కంపెనీవారి యధికారము

ను మనోవాక్కాయములతో ధిక్కరించిన యంశములలోఁ దప్ప, *రాజాగారిపట్ల నిట్లు జరిగించుట కెంతమాత్రము నవకాశము లేదు." అని కూడ వ్రాసిరి.

1782 సంవత్సరమున ఏప్రిల్ 25 తేదీని లార్డు మెల్వెస్ అనుపేరుగల "డందాసు" దొరగారు House of Commons వారియెదుట ప్రసంగించిన యొకప్రసంగములో "దూరదృష్టియును సత్స్వభావమును గల †జగన్నాథరాజుగారి స్థానమున, దివాన్‌గిరీలో సీతారామరాజుగారిని ప్రవేశపెట్టుటకై విజయనగరమురాజావారిని బెదరించియు, వారియెడల కఠినమైన పద్ధతుల నవలంబించియు, వారిని బలవంతపెట్టుచున్నట్లును తెలియుచున్నది. ప్రసిడెన్సీ స్థలములో రాజాగారిపట్ల జరిగించిన యిట్టిబెదరింపులు, బలవంతములు, అనాదరణములు, మిక్కిలి నీచమైనవియును, అక్రమమైనవియును, అన్యాయమైనవియు నగుటయేకాక మీఁద మిక్కిలి ప్రెసిడెన్సీవారి యిట్టిచర్యలు కంపెనీవారి లాభమునకును, బ్రిటిష్‌వారి ఘనతకునుకూడ హానికరమైన"వని యాయన తెలియఁజేసెను.

ప్రెసిడెన్సీవారి చర్యలను కోర్టాఫ్ డైరక్టర్లు గర్హించుటను రెండవ నిదర్శనము.
1782

*1781 సం॥ రహస్యసంఘము (Committee of secrecy)వారి రెండవరిపోర్టు 153 నెంబరు అనుబంధము (appendix) చూడవలెను.

†ఈ జగన్నాథరాజుగారు రాజావారికి మేనల్లుఁడు. దివాన్‌గానుండెను.

సీతారామరాజుగారు చెన్నపురిలో నుండఁగా విజయరామగజపతిమహారాజావారు కంపెనీవారి బాకీతీరుమానము నిమిత్తము సీతారామరాజుగారికి రెండులక్షలయొకవేయిరూపాయిలు పంపిరి. ఆసొమ్ములో కొంచెమైనను కంపెనీబాకీక్రింద జమకట్టఁబడలేదు.

ఇదివఱకు త్తరసర్కారులలోని జమీందారుల వ్యవహారములను విచారించుటకు 1776 వ సంవత్సరమున 19 గురు సభ్యులతో నేర్పాటుకాఁబడినసంఘ మిప్పుడించుక సవరింపఁబడి సంఘసంఖ్య తొమ్మిదికి తగ్గింపఁబడెను. ఈసంఘము 1783 వ సంవత్సరమున విచారణ ప్రారంభించి 1784 వ సంవత్సరమున తమవిచారణను పూర్తిచేసి నివేదికమును దొరతనమువారికిఁ బంపెను. ఆ నివేదికములోని విషయము లిట్లున్నవి

విచారణసంఘము. 1783

"......హవేలీభూములను సీతారామరాజు చాల దుస్థితిలోనికిఁ దీసికొనివచ్చెను. జిల్లాలో నితరప్రదేశములయందుండు ప్రజలపైని మిక్కుటముగ పన్నులు వేయుటవలన ప్రజలు పాఱిపోయిరి. జిల్లాలోనిపంటలు నశించెను. వ్యవసాయదారులు తాము పండించుకొనుదానిలో నైదవవంతుమాత్రమే యనుభవించుచుండిరి. వృత్తిపన్ను లెక్కువగానుండుటచే వ్యాపారములు తగ్గెను. ప్రజలకు న్యాయమొసఁగెడు న్యాయస్థానములు లేవు. ప్రజలు చాలబీదలై క

సంఘమువారి నివేదికము.

ట్టుకొనుటకు సరియైనగుడ్డలేక కడుపున కన్నము లేక కూలిచేసి కొని జీవించుచున్నారు. ప్రజలనుండి వచ్చుచుండిన రాబడి నంతయు జమీందారు తనస్వంతకర్చులకై వినియోగించు చుండెను. వెనుకముందు లారయక తనచేతనున్న ధనమునం తయు జమీందారు దుర్వ్యయము చేయుచుండెను. తనసై న్యములను తగ్గింపవలెనని యెన్నిసారులు వ్రాసినను నింకను 7760 మంది సైనికుల నుంచెను.

అందు 1620 మంది యూరపియను సోల్జరులవలె దు స్తులను ధరించి యాయుధపాణులై యున్నారు. ఈసైన్యము లను బోషించుటకై సంవత్సరమునకు 5½ లక్షల రూపాయి లను జమీందారు వ్యయపఱచుచుండెను. ఈసైన్యములు కాక తానుకోరినపుడు పాలకొండ, జయపురము, గొలుగొం డ, ఆండ్రి, టెక్కలి, కిమిడి మొదలగు జమీందారులు తను సహాయముగా సైన్యమును ధనమును బంపుచుందురు. సీతా రామరాజు బాధలకుఁ దాళఁజాలక కొందఱు జయపురప్రాం తములకుఁ బాఱిపోయిరి. కురుపాము మొదలగు జమీందారు లకు తబ్జీలొసఁగి వారిజమీనులను సీతారామరాజు వశపఱచు కొనెను. బొబ్బిలి, పాచిపెంట, కాశీపురము, సాలూరు, బిసం కోట మొదలగు నితరజమీందారులను విజయనగరమున ఖై దీలుగా నొనరించెను.”

"కాఁబట్టి ప్రజలయొక్క క్షేమలాభములకై విజయనగరముయొక్క బలమును చాలవఱకు తగ్గించు టవసరమని యీసంఘమువా రభిప్రాయపడుచున్నారు. మన్యప్రదేశములోని యల్లరుల నడచుటకై జమీందారునకు 2000 సిబ్బందియును, ఆత్మసంరక్షణార్థమై 767 గురు నౌకరులును, 50 గుఱ్ఱములును నుండినచాలును. మిగిలిన సైన్యమునంతటిని తీసివేసి దానికగుచున్న వ్యయము 4 లక్షల రూపాయిలును నిదివఱకుఁ దాను గట్టుచుండిన 5 లక్షల రూపాయిల పేష్కషుతోఁ గలిపి ప్రతిసంవత్సరమును తొమ్మిదిలక్షల రూపాయిలు చొప్పున కంపెనీవారికిఁ గట్టుటకును నీసంఘమువారు సిఫార్సు చేయుచున్నారు. అంతియకాక జయపురము, పాలకొండ, గొలుగొండ మొదలగు జమీందారులకు విజయనగరముతో సంబంధములేకుండ ప్రత్యేకముగా కౌళ్ళ నిచ్చుటకునుగూడ యీసంఘమువారు సిఫార్సు చేయుచున్నారు......"

కంపెనీదొరతనమువారు కమిటీనివేదికమును బరిశీలించినపిమ్మట విజయరామగజపతి తన సైన్యమును తగ్గింపవలెననియును, కమిటీచేసిన సిఫార్సుప్రకారము సాలునకు 9 లక్షల రూపాయిలను దొరతనమువారికి జమీందారు చెల్లింపవలయుననియును, పూర్వపు విజయనగరముజమీందారీకి అనకాపల్లి, ఉరట్ల, సత్యవరము చేర్చితిమనియును

దొరతనమువారి యాజ్ఞాపత్రము 25 th March 1788

నొకయాజ్ఞాపత్రిమును దానితో నొకకొలును విజయరామ గజపతికిఁ బంపిరి.

ఆజ్ఞోల్లంఘనము

విజయరామగజపతి యా యాజ్ఞాపత్రిమును మన్నించ లేదు. తన్ను చెల్లింపుమనిన యదనపుపన్నును గూడ యతఁడు చెల్లించలేదు.

1784 సీతారామ రాజుగారి కుట్రలు

'రాంబోల్డు' (గవర్నరు) గారిచే మరల దివానుగా నే ర్పఱుపఁబడిన సీతారామరాజు 1784 వ సంవత్సరమున మరల నాపదవినుండి తొలఁగింపఁబడెను. పిమ్మట సీతారామరాజు సింహాచలములోఁ దనస్థాన మేర్పాటుచేసికొని కంపెనీయుద్యోగస్థులతోఁ గలిసి యేలాగు ననైన విజయరామగజపతిని సింహాసనభ్రష్టునిగాఁ జేయుటకుఁ దాను చేతనైనన్ని ప్రయత్నములు చేయుచుండెను. ప్రెసిడెన్సీ వారును విశాఖపట్టణము *కౌన్సిలువారును గూడఁ దమకుఁ జేతనైన యన్నివిధములను సీతారామరాజునకుఁ దోడ్పడుచుం డిరి. దాట్లవారు లోనగురాజబంధువులనుగూడ విడఁదీసి విజ యరామగజపతిపైఁ గుట్రలు పన్నుచుండెను. కంపెనీవారి కనేకమైన యాశలను గల్పించి యెట్లైనను విజయనగరము సంస్థానమును కంపెనీలో కలిపివేసికొమ్మనియును, నాపనిలో

---

* సీతారామరాజుగారి యాశను, లాభమును వృద్ధిఁబొందించుటకు ప్రెసిడెన్సీవారును కౌన్సిలువారును నుపచరించుట కేవల మాయంశములోనే కాదు..." (రహస్యకమిటీవారి రెండవరిపోర్టు M 16 పుట చూడవలెను.)

తాము కావలసినంత సహాయమును జేసెదమనియును కొందఱు రాజబంధువులు కంపెనీవారిని బలవంతపెట్టిరి.

"...యీ పుష్పాల రమణప్పనాయుడుగారి మూలంగా సదరహీవా)సినవారు ముగ్గురుని హితపర్చుకొని మీాకు విస్తారం లంచం యిస్తూవున్నాము॥ అని యీలాగంటి పితూరీమాటలు మాట్లాడేవరకు కుంఫిణీవార్కి ఆశ పుట్టి విజయరామరాజుగార్కి యేలాగైనా వంకరచేసి సమస్తానం తీసి తమలో కలుపుకోవలెనన్న మాటలే విచారించినారుగాని ధర్మం విచారించినారుకారు." (పూసపాటివారికి కైఫీదు పుట 53.)

సీతారామరాజు మరల కంపెనీవారి సహాయముతో 1790 వ సంవత్సరమున దివాన్ పదవిని సంపాదించెను. కాని 1791 సంవత్సరము నవంబరుమాసములో మరల సీతారామరాజు దివాన్ పదవినుండి తొలఁగింపఁబడెను.

1790-91 సీతారామరాజుగారి దివాన్‌గిరీ

1792 సంవత్సరము ఫిబ్రివరినెలలో మరల దివాన్‌గా ప్రవేశించి 1793 వ సంవత్సరమున మరల కంపెనీ దొరతనమువారిచేఁ దొలఁగింపఁబడెను.

1792-93

ఈ సీతారామరాజు సలహాలవలన కంపెనీవారికిఁగూడ నితఁ డనిష్టుఁడయ్యెను. ఇతఁడొకసారి దివాన్ పదవిని విడిచి పెట్టి అనకాపల్లిలో నుండఁగా నొకనాఁడు కంపెనీసేనలు వెళ్లి కుటుంబసహితముగా సీతారామరాజునకు సంకెలలువేసి నడి

పించి విశాఖపట్టణము తీసికొనివచ్చుచుండఁగా నింతలో సింహాచలములోనుండిన విజయరామగజపతి కావిషయము తెలిసి వెంటనే కొంతసైన్యమును బంపి యాతనిని విడిపించెను.

దీనివలన సీతారామరాజుగారి హృదయనైర్మల్యమును, విజయరామరాజుగారి హృదయనైర్మల్యమును, కంపెనీవారి రాజనీతియును పాఠకులు గ్రహింపకపోరు.

దొరతనమువారికి సంస్థానమువారు చెల్లింపవలసిన బాకీ 6½ లక్షలు

ఇప్పటికి దొరతనమువారికి విజయనగరంసంస్థానము 6½ లక్షలరూపాయిలు "పేష్కష్" బాకీపడెను. సీతారామరాజుగారి ప్రోత్సాహముచే చిల్లరజమీందారు లందఱును మరల నల్లరులు ప్రారంభించిరి. ఈసమయములో కంపెనీవారు విజయరామగజపతిని వెంటనే బాకీసొమ్ము (6½ లక్షల రూపాయలు) చెల్లింపవలసినదనియును అట్లు చెల్లింపనిచో నతని రాజ్యమునుండి తొలఁగించి కొంతతబ్జీనిమాత్రమాతనికిచ్చి విశాఖపట్టణమునకుఁ బంపివేసెదమనియును చెన్నపురిదొరతనమువారు 1793 సంవత్సరము మేనెల 29 తేదీని ఉత్తరువు చేసిరి.

29 th may 1793

దానిపై విజయరామగజపతి కంపెనీవారికిని తమకును గల లెక్కలను సరిచూపించి, కంపెనీవారు చెప్పినంతసొమ్ము

విజయరామగజపతి తమబాకీని గూర్చి లెక్కలను కంపెనీవారికిఁ బంపుట

తాము కంపెనీకి బాకీ లేమనియును, లేనిపోని యదనపు కప్పమును తెమ్మనుట కంపెనీవారికి భావ్యము కాదనియును, కంపెనీవారు గత 18 సంవత్సరములనుండి యును తమకు మూడులక్షల యేఁబదివేలరూపాయిలు హాసీలు బాకీయున్నారనియును, కంపెనీకి సంస్థానమువలన చెల్లవలసన "పేష్కష్" లో కంపెనీవారు సంస్థానమునకు బాకీపడిన హాసీలు కొట్టివేయఁగా నీక తాము చెల్లింపవలసిన బాకీ స్వల్పమేయనియును ఆ బాకీ తాము మూడువాయిదాలలోఁ జెల్లించెదమనియును కంపెనీవారికి వ్రాసి గుగ్గిరాల బుచ్చన్నగారిచేతికి తమ లెక్కల నిచ్చి పంపిరి.

కంపెనీవారి ప్రత్యుత్తరము

రెవెన్యూబోర్డువా రాలెక్కలను చూచి, బాకీ చాల కాలమునుండి పెఱుగుచున్నదగుటచేతను మొత్తముకూడ చాల హెచ్చగుటచేతను తా మాబాకీని సరి చూచుకొనమనియును, నింతకాలమువఱకును విజయనగరమువారు తమకు రావలసిన హాసీలును వసూలు చేసికొనకుండ ఉపేక్షచేయుట తమలోపము కాదనియును ప్రత్యుత్తర మిచ్చిరి.

ఈ ప్రత్యుత్తర మెంతసవబుగను యుక్తియుక్తముగను నున్నదో చదువరులే యూహించెదరుగాక! ఈదినములలో కంపెనీవారియొక్క పరిపాలనావిధాన మెట్లున్నది

యు వీరిన్యాయ మేరీతిగా ప్రివర్తించుచున్నదియు 'లార్డు మెకాలే' వంటి మహానీయుడు Essay on Clive, Vol. VI of his works Pages 391—94 లో వ్రాసిన యీక్రింది విషయమును గమనించిన బోధపడఁగలదు.

"The situation of India was such that scarcely any aggression could be without a pretext, either in old laws or recent practice. All rights were in a state of utter uncertainty; and the Europeans, who took part in the disputes of the natives confounded the confusion, by applying to Asiatic polities the public law of the west and analogus drawn from the fendal system. If it was convenient to treat a Nabob as an independent prince, there was an excellent plea for doing so. He was independent in fact. If it was convenient to treat him as a mere deputy of the Court of Delhi, there was no difficulty; for he was so in theory. If it was convenient to consider his office as an hereditary dignity, or as a dignity held during life only. or as a dignity held only during the good pleasure of the Mogul, arguments and precedents might be found for every one of these views The party who had the heir of Baber in their hands represented him as the undoubted, the legitimate, the absolute sovereign, whom all subordinate authorities were bound to obey. The party against whom his name

was used did not want plausible pretexts for maintaining that the empire was in fact dissolved, and that though it might be to treat the Mogul with respect, as a venerable relie of an order of things which had passed away, it was absurd to regard him as the real master of Hindustan. "

1793 వ సంవత్సరము ఆగష్టు 2 తేదీని కంపెనీవారు విజయనగరముకోట నాక్రమించుకొని 3 వ తేదీని సీతారామరాజును చెన్నపురిపోవున ట్లాజ్ఞాపించిరి. సీతారామరాజునకు నెలకు 5000 రూపాయిలు కంపెనీవారు తమస్వంతధనము నుండి యిచ్చుచుండిరి.

విజయనగరముకోటను కంపెనీవా రాక్రమించుకొనుట.
2nd Aug. 1793.

కోటను కంపెనీవా రాక్రమించుకొనినను సంస్థానము మాత్రము కంపెనీవారికి స్వాధీనము కాలేదు. రైతు లెవరును కంపెనీవారికి దస్తుచెల్లింపలేదు. ఇట్లు తొమ్మిదిమాసములవఱకు కంపెనీకి దస్తుచెల్లక పోవుటచే నింక విజయరామగజపతి యీ మండలమున నున్నంతకాలమును తమకు బాకీ వసూలుకాదనియును నిశ్చయించుకొని కంపెనీవారు రాజును మచిలీపట్టణము వెళ్లున ట్లాజ్ఞాపించిరి.

కంపెనీవారు విజయరామగజపతిని మచిలీపట్టణము పోవునట్లు ఆజ్ఞాపించుట
April 1793.

అప్పటికి విశాఖపట్టణములోనున్న విజయరామగజపతి మచిలీపట్టణము వెళ్లుట కిష్టపడక తనకుమారుఁడును

విజయరామగజపతి మచిలీపట్టణము వెళ్ళకుండుటకు నిశ్చయించుకొనుట.

భార్యయున్ను అన్నమరాజుపేటకు పయనమయ్యెను. రాజుగారు విజయనగరము వెళ్లుచున్నారేమోయని కంపెనీవారు భ్రమపడిరి. కాని యాతఁడట్లు కొంతదూరము చని సింహాచలమువద్ద సింహాచలమున డేరాలువేయించి యచ్చట తన ప్రయాణము నాపుచేసెను. దేశమును విడిచిపెట్టుట తనకెంత మాత్రము నిష్టము లేదు. ఈయుత్తరువు మిక్కిలి కఠినమైనదిగను నాత్మగౌరవమునకు భంగకరముగను రాజునకుఁ గనఁబడెను. ఇప్పుడు తాను దేశముచు విడిచిపోయిన నిఁక నెన్నఁడును తనదేశమునఁ దనకుఁ బలుకుఁబడి కలుగదనియును దేశమును విడిచిపెట్టుట యనునది తనకొక గొప్ప యగౌరవహేతువును నపశకునసూచకమును నని భావించెను. అందుచే నిఁకనేమైనను సరియే విజయరామగజపతి తనదేశమును విడిచిపెట్టఁదలఁచుకొనలేదు.

ఈవిషయము "శామీయరు" (Chief in Council Vizagapatam) గ్రహించి విజయరామగజపతిని పైకి పంపివేయుటకు మార్గమేదియని రామజోగిపంతులును రమణప్నాయని పిలిపించి సలహాచేసెను. అప్పుడు రామజోగిపంతులు "నేను స్వయముగా వెళ్ళి రాజుగారిని బందరు మార్గమునఁ బెట్టి వచ్చెదను." అని ఛీఫ్‌తో చెప్పి కొంతసైన్యముతో రాజుగారియొద్దకు వెళ్ళి వారిని బందరు వెళ్లుమని నిర్బంధిం

చెను. రామజోగియొక్క నిర్భయవాక్యములకు ఆశ్చర్యము ను కోపమును కలుగ "చిన్నప్పటినుండియు మాయుగ్గుపాలు త్రాగి మాయన్నము తిని పెరిఁగి యిప్పుడింతనిర్భయముగా కంపెనీతో కలసి మమ్ము నిర్బంధపఱచుటకు వచ్చిన యీ దుర్మార్గునకు వెంటనే శిరచ్ఛేదనము చేయుఁ" డని తమ సర దారుల కాజ్ఞాపించెను. కాని దయాళుఁడగు విజయగోపాల రాజను సరదారుఁడు బ్రాహ్మణులను జంపుట కూడనిపనియని రాజుగారికి బోధించి యారామజోగికి సంకెలలు వేయించి ఖైదుచేయించిరి.

రాజుగారి యుద్ధ నిశ్చయము May 1794

అక్కడనుండి రాజుగారు తిన్నగా పద్మనాభము చేరు కొనిరి. ఇఁకఁ గర్తవ్యమేమి? కంపెనీతో యుద్ధముచేయుట తప్ప వేఱుమార్గము లేదు. తన కాప్తులగు రాజబంధువులతో యోజించి తుదకు యుద్ధ ముచేయుటకే నిశ్చయించెను. ఇదివఱకు విశాఖపట్టణము దొరతనమువారిచేఁ బూర్తిగా తమబాకీజీత ములు చెల్లింపఁబడిన తనసైన్యమును వెంటనే పద్మనాభము వచ్చి తన్నుకలసికొనుటకై విజయరామరా జాజ్ఞాపించెను. తదాజ్ఞానుసారము కాల్బలమును గుఱ్ఱపుదళమును వచ్చి రాజుగారిని కలసికొనెను. తనరాజ్యములోని యితరసేవకుల నందఱను రప్పించెను. "తమపాత్రితపగలను మఱచిపోయి మీయందఱితో సఖ్యముగా నుండుటకు శ్రీవిజయరామ

గజపతిమహారాజావారు కోరుచున్నారు కావున వెంటనే మీరందఱును (శ్రీ) మహారాజావారికి సహాయభూతులు కావలె" నని చిల్లరజమీందారులకు తాఖీదులు చేయించెను. రాజావారు జయపురమో బస్తరో వెళ్ళెదరని చాలమంది యూహించిరి. కొండలలో వీరికిఁ గొంత నిలువసైన్యము కలదు. విజయనగరముకోటలో నిలువయున్న శ్రీ రాజావారి పటాలము అచ్చటి సేనానాయకునితోఁ దమయుద్దేశమును

14th may 1794. తెలుపకయే వచ్చి పద్మనాభములోనున్న తమ రాజావారిని కలసికొనెను. శృంగవరపుకోటలో నున్న మఱిమూడు పటాలములుకూడ నట్లే యొనరించెను.

ఈవార్తలన్నియును కంపెనీవారి చారులు (రాజద్రోహులగు రాజసేవకులు) కంపెనీవారికి విన్నవించిరి. మే

29th may కంపెనీవారి సైన్య మోహరము నెల 29 తేదీని (శ్రీ)కాకుళమునుండి ఇంగ్లీషు సేనానాయకుఁడగు 'లెఫ్టనెంటుకర్నల్ ప్రెండర్‌గాస్టు' (Lientenent Colonel prendergast) 5 పటాలములతో భీమునిపట్టణము చేరెను. విజయనగరమునుండి 'కాక్సు' (Cox) సేనాని $2\frac{1}{2}$ పటాలములతో వచ్చెను. చెన్నపురినుండి మఱికొన్ని తుపాకులును ఫిరంగులును మందుగుండుసామానును వచ్చుచున్నట్లు వార్తలు వచ్చినవి.

ఇప్పటికి విజయరామగజపతికిఁ జేరిన సేన 4000. ఈ

భయంకరమైన యల్లకల్లోలము చెన్నపురి చేరినంతటనె చెన్నపురిగవర్నరు 'సర్ చార్లెస్ ఓక్లే' (Sir Charless Oakely) విజయరామరాజున కొకలేఖను వ్రాసెను. అందు సిపాయిలనుగూర్చి రాజుగారి కోరికలన్నిటిని కంపెనీవారు విచారించి పరిష్కరించెద రనియును వెంటనే విజయరామగజపతి సామాన్యసేవకులతో విశాఖపట్టణము చేరవలయుననియును, అట్లు విశాఖపట్టణము చేరక కంపెనీయాజ్ఞలను తిరస్కరించినచో నాతఁడు బుద్ధిపూర్వకముగా కంపెనీసైన్యముతో యుద్ధముచేయుటకు నిశ్చయించుకొనినట్లు భావించి వెంటనే తమ సైన్యములను విజయరామగజపతిపైకిఁ బంపెదమనియును వ్రాయఁబడియున్నది.

దానికి విజయరామగజపతి ప్రత్యుత్తర మీయలేదు. ఉభయపక్షములయందును యుద్ధప్రయత్నములు తీవ్రముగా జరుగుచుండెను. ఇట్లొకమాసము గడచెను.

విశాఖపట్టణము ప్రయాణమగుటకు 24 గంటలకాలము గడువొసంగి యాగడువు దాఁటినవెంటనే యాతనిపైకి యుద్ధమునకు వెడలవలయునని జూలై 5 తేదీని చెన్నపురిదొరతనమువారు సేనానాయకున కుత్తరువుచేసిరి. చెన్నపురిదొరతనమువారి యుత్తరువు ననుసరించి కంపెనీసేనాని విజయరామగజపతికి విశాఖపట్టణము

5th July 1794

పయనమగుటకు 24 గంటల గడువు నిచ్చుచు నొకపత్రము పంపెను.

విజయరామగజపతి యాపత్రము నందుకొని జూలై 8-9 తేదీలలో పద్మనాభము దేవాలయములోఁ దమ రాజ బంధువులను సరదారులను సమావేశపఱచి యొక కార్యాలోచనసభ గావించి అందు శ్రీరాజావా రిట్లుపన్యసించిరి.

పద్మనాభమున రాజదర్బారు
8th and 9th July 1794

ఉపన్యాసము.

"శ్రీవిజయనగర సంస్థాన గౌరవ పరిపాలనా తత్పరులగు యోధాగ్రేసరులారా! మనమిప్పుడు విజయనగరగౌరవ సంరక్షణార్థమై కంపెనీవారితో యుద్ధము చేయవలసివచ్చినది. దిగంతవిశ్రాంతకీర్తి వహించిన శ్రీబాబాజీవారి పరిపాలనములో నీ మూర్పిండియా వర్తకసంఘమువారును పరాసు సంఘమువారును గూడ బాబాజీవారి యనుగ్రహమును సంపాదించుటకై పడినపాట్లింతింతవ్వరలో నీవర్తకసంఘము వారు మఱువఁదగినది కాదు. 1751 వ సంవత్సరము నవంబరు 7 వ తేదీని బాబాజీగారు 'అంతర్వేది' విచ్చేసినప్పుడు బెండమూరులంకను దమకు కౌలున కిప్పించుచుఁడని యుభయులును నమూల్యములగు కానుకల సమర్పించి బాబాజీగారికి వ్రాసికొనిన దరఖాస్తులిదివఱకును మనకాగితములలో నున్నవి. బాబాజీగారు వీరికిఁ జేసిన మహోపకారములకు మితిలేదు.

ఈవర్తకసంఘమువారు ఉత్తరసర్కారులలో నిలువ నీడలేక ఘోరించిసేనానాయకుఁడగు బుస్సీచేఁ దఱుమఁబడి వీరిస్థాన ములన్నియును 1758 వ సంవత్సరము జూన్ మాసమున నాక్రమింపఁబడినప్పుడు మాయన్నగారగు శ్రీమదానంద గజపతిమహారాజు మన్యసుల్తాన్ బహదూర్ వారు విశాఖ పట్టణముకోటను పరాసులనుండి సెప్టెంబరు 2 తేదీని స్వాధీ నము చేసికొని దేశభ్రష్టులైపోయిన యీవర్తకసంఘము వారిని మరల కలకత్తానుండి రప్పించి వారి కభయహస్త మొసఁగి మొన్నమొన్న ముప్పదియారు సంవత్సరములక్రిం దట 1758 వ సంవత్సరము సెప్టెంబరు 12 వ తేదీని వీరికి విశాఖపట్టణమును ప్రసాదించి వీరిని బునరుద్ధరించిన విషయ ము మీలోఁ బెక్కండ్రు యోధు లెఱింగియే యున్నారు. వీరి కాశ్రయ మొసంగవద్దనియును తమతో నేకీభవించి తమ కు సహాయ మొనరింపవలెననియును దక్కను సుబేదారుఁ డగు సలాబత్ జంగంతటివాఁడు అన్నగారిని కోరఁగా కేవల ము కంపెనీవారికిఁ దా మొనరించిన తమ వాగ్దానమునందే తమబుద్ధిని నిలిపి నైజాముయొక్క ఉత్తరమును కూడ నాయన మన్నింపలేదు. పిమ్మట నైజాముస్నేహము చేసికొనుట మం చిదని చెన్నపురిగవర్నరు 1759 సం॥ నవంబరు 30 తేదీని మాయన్నగారికి ఉత్తరము వ్రాయఁగా మొదట నైజాము వారి ఉత్తరమును తిరస్కరించి మరల వారిస్నేహమునకై

ప్రియత్నించుట ఆత్మగౌరవమునకు భంగమని తా నందులకు ప్రియత్నమైనను జేయలేదు. అన్నగారి మూలముననే నైజాముతో సఖ్యమొనరించుకొనిన భాగ్యమును వీరికిఁ గలిగినది. అన్నగారిమూలముననే చెన్నపురికోటను ఘెరించివారాక్రమించుకొనినప్పుడు వీరికి నశించిన ప్రతిష్ఠయు మరల నేర్పడినది. అన్నగారు కీర్తిశేషులైన పిమ్మట మొన్నమొన్న మా "హయాము"లో సామ్రాజ్యమంతయు క్షీణించి ఢిల్లీపు యొక్క పోషణములో నున్న "షాఅలం' 1765 సం॥ ఆగష్టు 12 వ తేదీని తన స్వాధీనములో లేని యుత్తరసర్కారులను కంపెనీవారి కిచ్చివేసినంతనే వీరి కీరాజ్యముపై నధికారము కలిగెనా? లేక పిమ్మట 1766 సం॥ నవంబరు 12 తేదీని నైజాముతో వీరు చేసికొనిన యొడంబడికవలన వీరి కీరాజ్యముపై నధికారము కలిగెనా? నైజాముకూడ తన కధికారములేని కళింగరాజ్యమును కేటించియే యొడంబడిక చేసికొనెను. పిమ్మట మేముగదా వీరిపరిపాలనమునకు సమ్మతించి 1769 వ సం॥ జూలై 7 వ తేదీని వీరిని విశాఖపట్టణము చేరఁదీసినది. మాయనుగ్రహమువలన, మాయనుమతిపైని మా యీ దేశమునఁ గాలు పెట్టఁగలిగిన యీపాశ్చాత్య వర్తకసంఘమువారు, ఈనాఁటికి మాయన్నగారిని, మా సరదారులను, మాబంధువులను, మాసేవకులను మానుండి విడఁదీసి మమ్ములను 24 గంటలలో నిచ్చుటనుండి విశాఖపట్ట

ణమునకు నిరాయుధులమై సామాన్యసేవకులతో పొమ్మని యిప్పుడు మాకొక యాజ్ఞాపత్రము నంపిరి.

మనము మనసైన్యములను తగ్గింపవలెనఁట. మన్యపు పితూరీల నడచుకొనుటకు మాత్రమే రెండువేల సిబ్బందియు 767గురు సేవకులును, 50 గుఱ్ఱములును మనకుండిన చాలు నఁట. ఇతరులవలన మన కపాయము కలిగిన తమసేనలు మనలను రక్షించునఁట. మనసైన్యముల కగుచున్న వ్యయము నాలుగులక్షల రూపాయిలును వారిపాదమూలమున పూర్వపు పేష్కష్‌తో కలిపి మొత్తము తొమ్మిదిలక్షల రూపాయిలు సంవత్సరమునకుఁ జెల్లింపవలెనఁట. మనము మనరాజ్యమును సరిగా పరిపాలించుకొనలేమఁట. అందుచే మనరాజ్యమును తాము పాలించెదరఁట. తామైనను మన మీరాజ్యమున నున్నంతకాలమును పరిపాలించలేరఁట. అందుచే మన మందఱము మనరాజ్యమును విడిచి మండలాంతరములు గడచి మచిలీపట్టణము పోవలెనఁట. ఇది మనప్రజల క్షేమలాభము లకై వారుచేసిన యేర్పాటఁట. వీరికి మనము పేష్కష్ బాకీ బాకీ పడినామఁట. నిజముగా వారికి మన మీయవలసిన మొత్త మత్యల్పము. వారు మన కీయవలసిన హాసీల్ మూడు లక్షలయేఁబదివేల రూపాయిలును వారికి రావలసిన నిజమైన పేష్కష్‌నుండి తీసివేసిన నిఁక వారికి రావలసినమొత్త మత్య ల్పము. మనకు వా రీయవలసిన సొమ్మును వా రీయరఁట.

వారికి మన మీయవలసిన సొమ్ముమాత్రము మనము తత్క్షణము చెల్లింపవలెనఁట. మాయన్నగారు చెన్నపురిలో నున్నప్పుడు మేముపంపిన రెండులక్షలరూపాయిలును బాకీక్రింద జమకట్టుకొన్నారెరి. ఐనప్పటికిని వారు చెప్పిన మొత్తము నంతటికిని మేమొప్పుకొని మూడువాయిదాలలో సొమ్ము చెల్లించెదమని తెలియఁజేసితిమి. అందులకు వారు సమ్మతింపక కోట నాక్రమించుకొని నెల కెంతో కొంతసొమ్ముచొప్పున తీర్చుకొనెదమని చెప్పిరి. దానికిని మేమేమియు ననక విశాఖపట్టణమున మేముండఁగా మనలను మనరాజ్యమును విడిచిపోవలెనని శాసించిరి. ఇప్పుడు మనరాజ్యమును మనము విడిచిపోయిన మరల మనరాజ్యమున మనము కాలిడుట కవకాశముండునా? పోయిన పలుకుఁబడిని మరల మనము సంపాదింపఁగలమా? మనచేఁ బునరుద్ధరింపఁబడిన ఒకానొకపాశ్చాత్యవర్తకసంఘమువారి యడుగులకు మడుగులొత్తి చేతులార మన సామ్రాజ్యలక్ష్మిని వారి కప్పగించిన రాఁబోవు చరిత్రకారులు మనలనుగూర్చి యేమనివ్రాయుదురో యూహింపుఁడు. చతుర్మండల మండలేంద్ర కోటీరస్థగిత రత్నప్రభావిభాసిత పాదపీఠయగు శ్రీ విజయనగర సామ్రాజ్యలక్ష్మిని పాశ్చాత్యవర్తకుల కప్పఁజెప్పి దీనులమై బం...
నీచపుచావు చచ్చుటమేలో, లేక, బహు...
జ విరాజమానయగు శ్రీ విజయ...

రక్షణార్థమై యాత్మప్రాణపరిత్యాగ మొనరించి నిమేషములో వీరస్వర్గము చూఱఁగొని యఖండాఖండల రాజ్యలక్ష్మీ కృపా వీక్షణముల కర్హులమగుట మేలో బాగుగా యోజింపుఁడు. ఎప్పుడైనను చావుతప్పదు. ఏదో యొకరూపమునఁ జచ్చెదను. దీర్ఘవ్యాధి పీడితులమై యేపంచనో పేరుప్రతిష్ఠలు లేక చచ్చుటకంటె హాయిగా క్షత్రియకులజులకు సహజధర్మమగు యుద్ధభూమిని స్వరాజ్యలక్ష్మీ గౌరవ సంరక్షణార్థమై ప్రాణముల సమర్పించెదముగాక! నేఁడు మరణమునకు వెఱచి దాఁగొనిన రేపు చావక మానుదుమా? మృత్యువు మేనితోడిదె కదా? దేశకాలపరిస్థితులఁబట్టి యాలోచించిన మన కీయుద్ధమున జయము సిద్ధించుట దుర్ఘటము. ఏలయన మొదట స్వకుటుంబమునందే ద్రోహులు బయలువెడలిరి. బాల్యమాదిగ మాయన్నగారు నాపై నెట్టిద్రోహచింతతో మెలంగుచుండిరో యెన్ని ద్రోహకార్యము లొనరించిరో మీ రెఱుంగనివికావు. మొదట మన్నెపుసీమలలోఁ బ్రయాణ మొనరించి పితూరీలు లేవఁదీసి హుజూరునకు సమముగా దస్తుపైకము చెల్లకుండఁ జేసిరి. పిమ్మట మన ముద్యోగులను గొందఱను విడఁదీసి వారికి ...కల్పించి వారి తోడ్పాటుతో నాకస్మికముగా నొకనాఁ ...ప్రవేశించి యాయన యొనరించిన దారుణకృత్య ...మేము జ్ఞాపకము చేయ నవసరములేదు. ...కుఁడు పోడిపించి చంపించెను.

మమ్ము బాధించుటకును జంపించుటకునుగూడ ననేక ప్రయత్నములు చేసెను. మాసొమ్ము తిని మాసేవచేయుచుండిన సేవకుల నెందఱినో యీతఁడు రాజద్రోహులుగా మార్చెను. వారిలో దాట్ల వేంకటరాజు (కుమందార్) కుమారుఁడు వేంకటపతిరాజు, కోనుగంటి చినరామజోగి, వేంకటపతిరాజు పెదతండ్రి కుమారుఁడు అప్పలరాజు, పుష్పాల రమణప్ప నాయుడు మున్నగువారు ముఖ్యులు. వీ రీకంపెనీవారిని మనపైకి లేవఁదీసి మనరహస్యములన్నియు కంపెనీవారి కిచ్చిరి. మనసరదారు రామజోగి కంపెనీవారి కిప్పుడు సరదారుఁడై మమ్ము మచిలీపట్టణము వెళ్ళుమని యాజ్ఞాపత్రము తీసికొనివచ్చెను. మేము విశాఖపట్టణములో మకాము చేసియుండఁగా మా సమీపమున నున్నట్టులేయుండి మాదివాన్ జగన్నాథరాజుగారిని ఖైదుచేయుటకు అన్నగారు చెన్నపురినుండి విశాఖపట్టణము చీఫున కాజ్ఞాపత్రము తెప్పించినారు. ఈతఁ డెన్నిద్రోహములు మాయెడఁజేసినను మేము లేశమైన నాతనికి ప్రత్యపకారము చేయ హృదయమునఁ దలంపలేదు. ఈయనను సకుటుంబముగా నొకపర్యాయము కంపెనీవారు బంధించి కాలినడకతో తీసికొనిపోవుచుండ నప్పుడు సింహాచలములోనున్న మాకుఁ దెలిసి తత్క్షణమే కొంతసైన్యమును బంపి యాతనిని విడిపించి తెప్పించితిమి. ఇంకను నిప్పటికిని మననౌకరులలోఁ గొందఱు రాజద్రోహు

లున్నారు. వారు సమయము చిక్కినప్పుడెల్ల మనరహాస్యము లను కంపెనీవారి కిచ్చుటకే సంసిద్ధులై యున్నారు. మహామ్మద్‌షా కొలువులో నాఁడు ప్రోగుపడిన రాజద్రోహులను బోలిన రాజద్రోహులే మరల నేఁడును మనకొలువులో సంప్రాప్తమైరి. * నైజాముల్ ముల్కు సాదత్తు (లక్నోనవాబు) ల

---

* "Native historians relate that when the victorioses invader had obtained possession of the imperial city, he sent for both the Turanian (the Nizam of Hyderbad), and the Persian, (the Nabob of Lucknow). and rough by reproched them for their selfishness and treachery. 'But I will scourge you he pursued, 'with all my wrath, which is the instrument of divine vengeance.' Having said this, he spat upon their beards and drove them from his presence. The crest-fallen couple of confederates, up on this conferring, agreed that each should go home and take poison; it being out of the question for them to outline such disgrace. The Nizam was the first in the field of honour; and having swallowed his potion in the presence of his household, shortly afterwards fell motionless to the ground. A spy of Saadat's having satisfied himself of the result, hastened to his master, who being ashamed to be beaten in this generous rivalry, fulfilled his part of the compact to the letter, taking a draught that proved instantly fatal. No sooner was the breath out of his body than Chin Killich Khan (Asof Jah, the great Nizam-ul-mulk) came as by a miracle to life, and even

వలె మాయన్నగారు మున్నగువారు మాకు సంప్రాప్తమైరి. ఆ దుర్మార్గులు నాదరుషాహ్‌నేకమై ఢిల్లీనగరమంతయు దోఁపించి పట్టణము పీనుఁగులపెంట చేయించి రాజభవనములో "నాదర్షా"ను బ్రవేశపెట్టిరి. కాని యూనీచులు దాని ప్రతిఫలమును పొందకపోలేదు. పిరుదు మనగుట్టును వట్టును కంపెనీవారి కందిచ్చి మనకోటలో కంపెనీవారిని ప్రవేశపెట్టిరి. అందుచే మేమిప్పుడు జయమును శంకించుచున్నాము. ఏదైనను హీనపు చావు చచ్చుటకంటె స్వకులమర్యాదలను నిలువఁబెట్టి రాచకొలమువారికి విహితమయిన మరణమును రణరంగమునఁ బొందెదముగాక! ఈ పద్మనాభయుద్ధము చిరస్మరణీయమై యుండకపోదు. ఇందు కంపెనీవారు మాకుటుంబమువలన పొందిన మహోపకారములును, వారు మాకుచేసిన యపకారమును, అన్నగారి దౌర్జన్యమును, మనసేవకులలోఁ గొందఱొనరించిన రాజద్రోహమును, మీరు చూపుచుండిన యఖండస్వామిభక్తియు, దిగంతవిశ్రాంతికీర్తి రమానాయకుం డగు మాతండ్రిగారి యాజ్ఞానుసారము మాతల్లిగారగు చంద్రియ్యమ్మగారు మమ్ము నీ సంస్థానమునకు నధీశ్వరులుగాఁ జేసినందులకు తుచ్ఛప్రాణముల కాశపడి యేమూలనో చావకుండ తండ్రి

---

afterwards amused his confidential friends by the narrative of how he had outwitted the pedler of Khorasan."

(Keene's Fall of the Moghul Empire Page 40)

గారివలె రణభూమినే స్వరాజ్యలక్ష్మీగౌరవ సంరక్షణార్థమై మాయసువులను సమర్పించి నిజకంఠరక్తధారలతో మేము మాజననీజనకుల కొనరించు శాశ్వత పితృతర్పణములును పద్మనాభమును దలఁచినంతమాత్రమున మనుష్యమాత్రునకు జ్ఞాపకము రాకపోదు.

కావున యోధాగ్రేసరులారా! ఇప్పుడు మనము చేయవలసినపని యింతకుమించి వేఱొండు గోచరించలేదు. కావున మీమీ యభిప్రాయములను గూడ తెలియఁజేసి వెంటనే విజయనగరరాజ్యలక్ష్మీ గౌరవము నిలుపుటకై పూనుకొనుఁడు."

ఈవాక్యములు (శ్రీ) రాజావారినోటినుండి వెలువడునంతకు రాజవీరుల హృదయములు సంచలించెను. దేశభక్తి శపథము. ముప్పిరిగొనియెను. పూర్వరాజుల చరిత్రము లెదుట తాండవించెను. విజయనగరరాజ్యలక్ష్మీ గౌరవసంరక్షణమె తమకు పరమావధి యని యెల్లరును కృతనిశ్చయులైరి. తాము యుద్ధమునుండి వెనుకకు మఱలమని కత్తులపైని చేతులనువేసి శపథములను చేసిరి.

కాని రాజుగా రంతటితో సంతృప్తిపొందక దేవాలయములో పద్మనాభస్వామివారికి నివేదనమైన మహాప్రసాద ఘోరపరిమాణము మును చేతితోఁ బట్టుకొని 'యుద్ధమునఁ జచ్చుటయో విజయమును జేకొనుటయో' తప్ప వేఱొండుమార్గము

నవలంబింపమని ప్రమాణమును చేయుడని యెల్లరిని కోరిరి. వారల్లే స్వామివారి మహాప్రసాదమును చేతఁబూని ఘోర ప్రమాణమును జేసిరి.

పిమ్మట నెనిమిదేడుల యీడుగల నారాయణబాబను కుమారుని పట్టమహాదేవియగు సీతయ్యమ్మగారిని పిలిపించి

కుటుంబమును కాశీపురమునకు బంపుట.

వారికిఁ జెప్పవలసిన విషయములన్నియును జెప్పి కొంతసిబ్బందిని కాకర్లపూడి బాపిరాజుగారిని తోడిచ్చి కాశీపురము పంపించిరి.

రాజుగారును సరదారులును సైనికులును యుద్ధమునకు సిద్ధముగానుండిరి. ఆషాఢ శు ౧౨ బుధవారమున కం

పద్మనాభముయుద్ధము 10 th July 1794

పెనీ సైన్యములు తమపైకి వచ్చునని రాజుగారు నిశ్చయించుకొని యానాఁడు వారు చాల జాగరూకతతో నుండిరి. కాని వారిసేనలోఁ గొందఱు శత్రువులకు సమాచారము లందిచ్చుటచే ఆనాఁటికి వారు రాలేదు. మఱునాఁడురాత్రికూడ రాజుగారు మిక్కిలి జాగరూకతతోడనే యుండిరి. ఎప్పటివార్త లప్పుడు తమసైన్యములోనివారు శత్రువుల కందిచ్చుచుండిరి. తెల్లవారుజామున మూడుగంటలకు రాజుగారు సైన్యములను భద్రముగా నుండుమనిచెప్పి తాము శయనించిరి. ఈవిషయము వెంటనే శత్రుసైన్యములకుఁ దెలియుటచే శత్రువులు (శ్రీ

ముని పట్టణమునుండి) మిక్కిలి వడిగావచ్చి రాజుగారి సైన్యములను ముట్టడించిరి.

ఈవార్త రాజుగారికి తెలియఁగనే వెంటనేలేచి నిత్యకృత్యములను తీర్చికొని చెంతనున్న రావు జోగయ్యగారిని చూచి "మేము తెల్లవారుజామున నిద్రించుచున్న సమయమున మనవారెవరో శత్రువుల కాచోకి యిచ్చియున్నారు. లేనిచో నింత వేగముగా వారు వచ్చుట సంభవింపదు. మెడనున్న పూలమాల కాలసర్పమగుచుండ మన మేమిచేయఁగలము. మనకు రంగని సెలవైనది. ఐనను నోపినంత వఱకుఁ బురుషకార్య మొనరించుదము. అంబారీ కట్టి యేనుఁగును తెప్పింపుము. శత్రుసైన్యములు వచ్చినజాడ తెలిసికొని మనలోఁ గొందఱు తెచ్చటికో పాఱిపోయిరి. పోయినవారిని పోనిమ్ము. వా రాశరీరములతో నెంతకాలము జీవించెదరో జీవింపనిమ్ము. ఉన్నవారిలో రాజద్రోహులు లేకున్న వీరితోడనే మనము శత్రువులను గెలువవచ్చును." అని సకలాభరణభూషితులై యుద్ధమున కనుకూలమగు దుస్తులను ధరించి సిద్ధము కాఁబడియున్న బంగారపుటంబారీయేనుఁగు నెక్కి సపరివారముగా శత్రుసైన్యముపైకి నడువనారంభించిరి. "శత్రువులు ముందుగా మనపైకి గుండు ప్రేల్చువఱకు మీ రెవరును వారిపైకి గుండు ప్రేల్చవద్దు" అని రాజుగారు తమసైనికులకు గట్టిగ నాజ్ఞాపించిరి.

## రెండవభాగము.

పూసపాటి విజయగోపాలరాజుగారు, ఁ
నరసరాజుగారు, దాట్ల అప్పలరాజుగారు, రావు జో,
రాజబంధువులు గారు, ఇంకను మఱికొందఱు దాట్ల, దం
లూరి, సాగి, చింతలపాటి, గొట్టెముక్కల, లేజర్ల, పెను
మచ్చ, (మత్స్య) వంశస్థులైన రాజబంధువు లనేకులును,
రాజుగారి ననుసరించి చుట్టును బలసియుండిరి.

దావుతుఖాను తనసైన్యముతో రాజుగారికి ముందు
నడచుచుండెను. అనబేగు తనసైన్యముతో ప్రక్కగా నడచు
యుద్ధభూమియం చుండెను. రాజుగారిసైన్యము కంపెనీసైన్యము
12000 లంచము. నకు మిక్కిలి సమీపించెను. రాజుగారిసైన్య
ము లింకను నెక్కువగా నుండుటచేతను తమసైన్యమునకు
మిక్కిలి సమీపించుటచేతను కంపెనీసేనాని మిక్కిలి తొం
దరపడి యేమిచేయుటకును తోఁచక 12000 రూపాయిలు
దావుతుఖానునకు లంచమిచ్చి తనసైన్యముతో పైకి తొలఁగి
పొమ్మని చెప్పెను. పండ్రెండువేలరూపాయిలు కన్నులఁ
బడఁగనే యాసిచుఁడు రాజద్రోహమునకు నెట్టుకొని రాజా
జ్ఞకు వ్యతిరేకముగా ముందుగా మూడుగుండ్లు పేల్చి తన
ఫౌజుతో బ్రక్కకు తప్పుకొనెను.* దావుతుఖాను ప్రక్కను

---

* "...యింతలో కుంఫిణీవారు పని మించినని రాజుగారి సరదారుఁడు
దావుతుఖాను కుమందాను అగాడీని నడుస్తూవున్న వారికి పన్నెండువేల
రూపాయిలు లంచంయిచ్చి మూడుచదుసెల్లు కాల్పించినాడు. వాడు ఫిరం

ంటచే ముందర బయలయ్యెను. రాజుగారును రాజ
ఃరులును శత్రువుల ఫిరంగులయెదుటఁ బడిరి. వత్స
యి నరసరాజుగారును దాట్ల అప్పలరాజుగారును తమ
యొద్దనున్న మూడువందలమంది వేఁటతుపాకీఫౌఁజుతో శత్రు
సైన్యముపై కుఱికి వారిలోఁ బెక్కండ్రి హతమొనరించిరి.
కొంతసేపటికి అప్పలరాజుగారును, నరసరాజుగారును వారి
ఫౌఁజును నేలఁగూలిరి. ఇంతలో 'హలాగ్రిజు' అను నొక
శూరశిఖామణి తన పదునారుగురు గుఱ్ఱపురౌతులతో కదన
భూమి కుఱికి యతివిచిత్రముగా శత్రుశిరముల ఛేదించెను.
తానొక్కఁడును శత్రువులలో నిరువదియొక్కమందిని నఱకెను.
అప్పటికి తనకత్తి మొఱవోవుటచే, తన చేకత్తితోఁ బెక్కం
డ్రి చిత్రవధ గావించెను. ఇంతలో 'ఆననబేగు' పటాలము
వచ్చి శత్రుఫిరంగుల నాక్రమించెను.

అచ్చటివా రట్లు యుద్ధముచేయుచుండఁగా నిచ్చట
రాజుగారు తమసైన్యమును హెచ్చరించుచు ముందునకు

---

గులకు సమీపంగా పోయినాడు. యిఖ వఖ దవుడు చేస్తే ఫిరంగులు అందు కోవచ్చును. అంత సమీపంగా పోయినవాడు. పన్నెండువేలరూపాయిలు లంచంతిని రూపాయిలు వళ్ళోపడగానే రాజు యీవల వున్నాడని సంజ్ఞ చేసి తను పటాలంతోటి లయిను తప్పుకొని పారిపోయినాడు. తి॥ ముందర బయలు అయినందున మహారాజులుంగారు ఫిరంగులయెదుట పడిరి." (బూసు పాటివారికైఫీదు పుట ౬౭)

రాజుగారు యుద్ధ నడచుచుండఁగా నొకగుండు వచ్చి రాజుగారి **భూమిని గూలుట** ముంజేతిమీఁద తగిలెను. ఆగాయమునకు తాంబూలముతమ్మ వేసి కట్టుచుండఁగా రెండుతొడలకును రెండుగుండ్లు తగిలెను. పిమ్మట వక్షస్థలమున కొన్నిగుండ్లు తగిలి రాజుగారు నేలఁగూలిరి. శ్రీరాజావారు రణభూమి నొఱగిరనువార్త తెలియఁగనే నలుదిక్కులనుండి సైనికులు ను సరదారులును పరుగులిడి వచ్చి చూచునంతకు రాజుగారి ఒమ్మున నిరువదిముప్పదిగుండ్లు తాకియున్నవి. 'రంగ రంగ' యని స్మరణచేయుచు ప్రాణవాయువులను విడుచుచుండిరి. వారిచుట్టును రెండువందలయెనమండుగురు రాజపుత్రవీరులు ఆయుధహస్తులై పడియుండిరి. అందు నలువది రాజబంధువుల శరీరములు వారిచుట్టును బురుజులవలెఁ బడియుండెను.

ఇప్పటికిని పద్మనాభశైలభాగమున విజయరామగజపతి యుద్ధమున గూలుటను గూర్చి యీవిధమున వ్రాయఁబడియున్నది.

శ్లో॥ "అత్యక్తసైనికవరః ప్రతిభాతిసమ్య
గద్యాపి దివ్యనృపవైభవలాంఛనశ్రీః
సామంతవీరతనుబృందసమావృతస్స
శ్రీపద్మనాభధరణీధరపార్శ్వభాగే.॥"

ఈవిధముగా విజయనగరముప్రభువులకుఁ గల కళింగరాజ్యాధిపత్యమును స్వాతంత్ర్యమును నంతరించెను. ఈపద్మనాభయుద్ధమే విజయనగరరాజ్యమునకు నవసానమును కంపెనీరాజ్యాభివృద్ధికి బలమును కలుగఁజేసెను.

కంపెనీపరిపాలన మీవిధముగా నానాఁటి కతిత్వరితముగా దేశమున బలపడసాగెను. ఈకంపెనీపరిపాలనము యొక్క సత్వరాభివృద్ధినిగూర్చి "మెకాలే" చాలసొగసుగా వర్ణించెను.*

---

* "In what was this confusion to end? Was the strife to continue during centuries? Was it to terminate in the rise of another great monaichy? Was the Moosulman or the Mahratta to be the Lord of India? Was another Baber to descend from the mountains and to lead the hardy tribes of Cabul and Chorasan against a wealthier and less warlike race? None of these events seemed improbable. But scarcely any man, however sagacious would have thought it possible that a trading company, separated from India by 15,000 miles of sea, and possessing in India only a few acres for purposes of commerce, would, in less than a hundred years, spread its empire from Cape Comorin to the eternal snow of the Himalayas; would compel Mahratta and Mahommedan to forget their mutual fends in common subjection; would tame down even those wild races which had resisted the most powerful of the Moguls; and, having united under its laws a hundred

విజయరామగజపతి రాజ్యమునకు వచ్చునప్పటికి (1760 సం॥) నీక్రిందిజమీందారులు విజయనగరమునకుఁ గట్టుచుండిరి.

| జమీందారీలు. | జమీందారులు. |
| --- | --- |
| 1. జయపురము | లాలాకృష్ణదేవు |
| 2. శృంగవరపుకోట | ముఖీకాశీపతిరాజు |
| 3. మాడుగులు | లింగభూపతి |
| 4. సాలూరు | సన్యాసిరాజు |
| 5. కోటపాలెము | ముత్తావారు |
| 6. కురుపాము | శివరామరాజు |
| 7. అనకాపల్లి సత్యవరము | కాకర్లపూడి రామభద్రి పాయకరావు |
| 8. గోలుగొండ | వీరభూపతి |
| 9. పాలకొండ | విజయరామరాజు |
| 10. ఆండ్రి | రామన్నదొర |
| 11. రేగులవలస | పూసపాటి విజయరామ రాజు, పూసపాటి రామ చంద్రరాజు |

millions of subjects, would carry its victorious arms for east of the Burrampooter, and far to the west of the Hydaspes, dictate terms of peace at the gates of Ava, and seat its vassal on the throne of Candahar."

(Essay on Clive page 391–94).

| | | |
|---|---|---|
| 12. | పోరాము | పాయకరావు |
| 13. | తేడపాచిపెంట | వీరప్పరాజు |
| 14. | సంగమవలస | నిశ్శంకు |
| 15. | చెముడు | లక్కిరాజు |
| 16. | రాజాము | వేంగళరావు |
| 17. | నరవ | మేదినీరావు వీరనరసింహరావు |



# మూడవభాగము.

## తదనంతరచర్య.

నారాయణబాబుగారు కాశీపురము చనుట.

విజయరామగజపతి మరణవార్త నారాయణబాబుగారికి చేరినది. ఈయన యెనిమిదేండ్ల బాలుఁడు. ఈయన తనతల్లిగారైన సీతయ్యమ్మగారితోడను కాకర్లపూడి బాపిరాజుగారితోడను మఱికొంత రాణువతోడను కాశీపురమునకుఁ జనిరి. అప్పటికి కాశీపురమును ముఖకాశీపతిరాజుగారి మూఁడవకుమారుఁడగు రాజభూపాలరాజు పరిపాలించుచుండెను. శ్రీ నారాయణబాబుగారిని వారితల్లులను రాజభూపాలరాజుగారు సగౌరవముగా నాదరించి కొన్నిదినములు తమగృహమునందుంచుకొని యిక్కడనుండి మక్కువకు తీసికొనివెళ్లి దిగఁబెట్టెను. పద్మనాభముయుద్ధములో విజయరామగజపతిపక్షమున యుద్ధముచేసినవారిలో మిగిలిన కోలగొట్ల పట్టాభిరామయ్య యను నొకవైశ్యశిఖామణియు నీనారాయణబాబున కంగరక్షకుఁడుగా నుండెను.

నారాయణబాబుగారు మక్కువ చనుట

అక్కడనుండి నారాయణబాబుగారు నారాయణపట్టణములో నప్పుడు నివసించియుండిన జయపురాధీశ్వరుఁడగు రామచంద్రదేవుగారితోడను తదితరజమీందారులతోడను నుత్తరప్రత్యుత్తరములు జరి

పెను. అనతికాలములోనె నారాయణబాబుగా రనేకవేలసైన్యమును పోగుచేసిరి. తమనాయకులను సరదార్లను పంపించి కిస్తీలు వసూలు చేయించెను. అవసరమైనచో కంపెనీతో డీకొనుటకు సిద్ధపడియుండెను. అంతటితో నాగకసంస్థానములోని ప్రధానస్థానములకుఁ గొన్ని పటాలములను బంపి వాని నన్నిటిని నాక్రమించెను.

సైన్యమును ప్రోగుచేయుట

ఈవార్త విజయనగరములోనున్న కంపెనీసేనానికి తెలిసి వానికేమియుఁ బాలుపోక మఱి మూఁడుపటాలములు కావలెనని పైకి వ్రాసెను. ఇట్టి విషమపరిస్థితులలో కంపెనీవారు దేశకాలపరిస్థితుల ననుసరించి క్రొత్తమార్గము నవలంబించిరి. విజయనగరముసంస్థానము నపహరించు నుద్దేశము తమ కెంతమాత్రమును లేదనియును నారాయణబాబుగారిని తీసికొనివచ్చిన వారిరాజ్యమును వారి కిచ్చివేసెదమనియును రాజుగారి కుటుంబములోని కొందఱు ముఖ్యులకు విశాఖపట్టణముదొరతనమువారు వ్రాసిరి. ఈయుత్తరమును రాజబంధువులు సగౌరవముగా నంగీకరించిరి. కాని విషయములుమాత్రము సందేహాస్పదముగా నుండుటచేఁ బూర్తియగు సంతుష్టిమాత్రము వారికిఁ గలుగలేదు.

1794 సం॥ ఆగష్టు 20 తేదీని చెన్నపురిగవర్నరుగారగు "సర్ చార్లెస్ ఓక్లే" గారు నారాయణబాబుగారి కొకయు

1791 సం॥ ఆగష్టు 20 తే దీని కర్కన్నగుగాను నారాయణబాబు గారికి వ్రాసిన జాబు.

త్తరమును వ్రాసిరి. నారాయణబాబు గారికిని వారికుటుంబమునకును బంధువు లకును వారియనుచరులకును పూర్వము వలెనె కంపెనీవారు సత్కారము లాచ రించుటకు దైవముపైని ప్రమాణముచేసి చెప్పుచున్నారనియు ను నీజాబుచేరిన ముప్పది దినములలో నారాయణబాబు తన రాజ్యములో ప్రవేశింపవలయుననియును, ఆలాగున 30 దిన ములలో రానిచో నారాయణబాబు కంపెనీయాజ్ఞల తిరస్క రించినట్లుగ భావింపఁబడి కంపెనీవారి యనుగ్రహమును గోల్పోవుదురనియును నాజాబునందు కలదు.

ఈజాబును చూచి నారాయణబాబుగారి మేనమామ గారగు జంపన విజయరామరాజుగారు "(శ్రీ)రాజావా రనతి కాలములోనె తమరాజ్యమునకు విచ్చేసెద" రని దొరతనము వారికి ప్రత్యుత్తరమిచ్చిరి. వీరి ననుసరించుకొనియున్న మఱి కొందఱు జమీందారులకుమాత్రి మీకార్య మిష్టములేదు. వారలందఱకును లాభకరముగా వ్యవహారములు పరిష్కరిం పఁబడువఱకు కంపెనీసైన్యములతోఁ బోరాడుచు కంపెనీకి నిలుకడ లేకుండ చేయవలెననియే వీరి యాశయము. వారట్లు కలహములతోడనే కాలము గడుపుచుండిరి. కంపెనీసైన్యాధి పతియగు "ఫ్రెండరుగెస్టు" చిల్లరిజమీందారుల యల్లరి నడచు టకై మఱిమూడుపటాలములనుబంపుమని విశాఖపట్టణము చీఫ్

నకు వ్రాసెను. సైన్యముతో లోంగదీయనెంచుట లాభకర మైన పనికాదనియును, సైన్యములు కొండలలోఁ బ్రయాణము చేసి వారిని వెంటఁదఱుముట కష్టమనియును, నందుచే వ్యవహారములు సామముగనే పరిష్కరించుటకు బ్రయత్నింపవలయుననియును విశాఖపట్టణముదొరతనమువారు ప్రత్యుత్తరమిచ్చిరి.

నారాయణబాబుగారు సెప్టెంబరు 21 తేదీకి "ఆండ్ర" కు వచ్చిరి. ఇతర జమీందారులుకూడ వచ్చి వారివారి జమీలను గైకొనవచ్చుననియును నెవరిజమీలను వారనుభవించుటకు కంపెనీవారెట్టి యభ్యంతరములను చెప్పరనియును దొరతనమువారొక (Proclamation) ప్రకటన చేసిరి.

నారాయణబాబుగారు జమీందారీలోఁ బ్రవేశించుట

21st Sep. 1794 కంపెనీప్రకటన.

దానితో దుర్భరపరిస్థితు లంతమొందెను. బొబ్బిలి, పాలకొండ, సాలూరు, మొదలగు జమీందారు లందఱును విజయనగరమునుండి విడివడి స్వతంత్రులైరి. ఎవరి జమీందారీలు వారికి వచ్చినవి. విజయనగరములో నిర్బంధింపఁబడిన జమీందారు లందఱును విడుదల చేయఁబడిరి.

పద్మనాభముయుద్ధముతో కంపెనీపరిపాలన మీభాగమున స్థిరపడినది. బలవంతుఁడగు విజయనగరముజమీందారు మరణించెను. ఛిల్లరజమీందారులు విజయనగరమునుండి విడిపోయి స్వతంత్రులైరి.

కంపెనీపరిపాలనము స్థిరపడుట.

ఇప్పటి విజయనగరముజమీందా రగు నారాయణగజపతి యొనిమిదేండ్లబాలుఁడు. అందుచే నిఁక కంపెనీపై తిరుగు బాటుచేయు బలవంతులగు జమీందారు లెవ్వరును లేరు.

సర్క్యూటుకమిటీవారి రిపోర్టుపత్రికారము విశాఖపట్టణములో ఫీఘుల నేర్పాటుచేయు పద్ధతి తొలఁగించి 1794 సం॥

**కలక్టరేటుపద్ధతి 20 నవంబరు 1794**

నవంబరు 20 తేదీనుండియు కలక్టరేటుపద్ధతిని తెచ్చిపెట్టిరి. జిల్లాను మూడుభాగములుగా విభాగించిరి.

**జిల్లానిరూపణము**

మొదటిభాగము: —1 విశాఖపట్టణము 2. కశింకోటహవేలీభూములు కలసి యొకభాగముగను,

రెండవభాగము:— విజయనగరముజమీందారీయును, పునరుద్ధరింపఁబడిన యితరజమీందారీలును కలసి రెండవ భాగముగను,

మూడవభాగము: — శ్రీకాకుళము, ఇచ్ఛాపురహవేలీభూములు, కిమిడిజమీందారీయును కలసి మూడవభాగముగను నేర్పఱుపఁబడెను.

మూడుభాగములకును ముగ్గురుకలెక్టరులు నియమింపఁబడిరి.

**శాశ్వతపరిష్కారము 1802**

1802 వ సంవత్సరములో శాశ్వతపరిష్కారము (పర్మనెంటు సెటిల్మెంటు) వచ్చినది. ఈపర్మనెంటు సెటిల్మెంటులో—

| | |
|---|---|
| 1. అనకాపల్లి | 9. నక్కపల్లి |
| 2. దిమిలి | 10. రాయవరము |
| 3. గొడిచర్ల | 11. పంచధార్ల |
| 4. మెలుపాక | 12. సర్వసిద్ధి |
| 5. కశింకోట | 13. శ్రీరామపురము |
| 6. కొండకర్ల | 14. ఉప్పాడ |
| 7. కొత్తకోట | 15. ఉరట్ల |
| 8. మునగపాక | 16. వేములపూడి |

ఈపదునారు జమీందారీభూములును విజయనగరము మహారాజావారు 162846 రూపాయిలకు వేలములో కొని పిమ్మట వానిని మఱికొందఱకు విక్రయించివేసిరి.

| | |
|---|---|
| ఆండ్ర | 9. మాడుగులు |
| 2. బెలగాము | 10. మేరంగి |
| 3. బొబ్బిలి | 11. పాచిపెంట |
| 4. చెముడు | 12. పాలకొండ |
| 5. గొలుగొండ | 13. సాలూరు |
| 6. జయపురము | 14. సంగమవలస |
| 7. కాశీపురము | 15. సరిపల్లిభీమపరము |
| 8. కురుపాము | 16 విజయనగరము |

ఈపదునారు పురాతనపుజమీందారీలును నెవరివి వారి కిచ్చివేయఁబడెను.

శాశ్వత పరిష్కారమైన పిమ్మటినుండియును (అనఁగా 1803 వ సంవత్సరము మేనెల, 13 తేదీ నుండియు) జిల్లాయంతయు నొక్క కలక్టరు చేతిక్రిందికి వచ్చెను. నాఁటినుండి నేఁటివఱకును జిల్లా కలెక్టరుల పద్ధతిపై నెపరిపాలింపఁబడు చుండెను.

జిల్లాయంతయు నొక్క కలెక్టరు క్రిందికివచ్చుట 13 మే 1803

—: జిల్లాలోని పిసూరీలు వానియుత్పత్తి. :—

1802 వ సంవత్సరములో జరిగిన పర్మనెంటు సెటిల్ మెంటు రాజకీయముగాఁ జూచిన జయప్రదముగాలేదు. పిలై నప్పుడెల్ల జమీందారులహక్కుల నడఁగఁద్రొక్కుటకు కంపెనీవారు ప్రయత్నించుచుండిరి. అందుచే జమీందారుల కసంతుష్టి హెచ్చెను. తమతమ జమీందారీలలో జమీందారుల కిదివఱకు సర్వాధికారముండెడిది. ఇప్పుడట్టి యధికారమేదియును లేదు. క్రొత్తచట్టము పూర్వము జమీందారులకుండిన గౌరవమునకును అధికారమునకును భంగము కలిగించెను. పోలీసువారిపై సంస్థానాధీశ్వరుల కధికారము లేదు. కూలినాలి చేసికొని జీవించు తక్కువకులస్థులు పోలీసునౌకరీలలోనికి వచ్చుచు వారు జమీందారులతో జోక్యము కలిగించుకొనుట తటస్థించుచుండుటచేత జమీందారులకు మిక్కిలి బాధకరముగా నుండెను.

ఈ కారణముచేత సెటిల్మెంటయిన కొన్ని సంవత్సరములవఱకును జమీందారులకు సంతృప్తి లేదు. అంతియు కాక వారిలోవారికిం గొన్ని యంతఃకలహములుగూడ కలిగెను. ఈ కలహించుచుండినవారిలోఁ జాలమంది పద్మనాభ యుద్ధ మైనపిమ్మట విజయనగరముజమీందారుక్రింద నుండి విడివడి బైటపడిన జమీందారులే. వీరు తఱచుగ సరిహద్దులకొఱకు కొందఱును వారసత్వముకొఱకు కొందఱును కలహించుచు నొకరిభూము లొకరాక్రమించు కొనుచుండిరి.

ఈయల్లరి సైన్యబలమును నడచుటకు దొరతనము వారు మొదట తలంచిరి. కాని దానివలన ప్రజావ్యయమును రక్తపాతమును దప్ప వేఱు లాభము కనంబడలేదు. సామమున స్వాధీనము చేసికొనుటకు చేసిన ప్రయత్నములు నిష్ఫలము లయ్యెను. బందెపోటులు దోపిడులు పితూరీలు హెచ్చెను.

—: పి తూ రీ లు. :—

1832-33 సంవత్సరములలో నొక్కసారి కొండజమీందారీలలో పితూరీలు ప్రారంభమయ్యెను. శృంగవరపుకోట (కాశిపురము) పితూరీ, పాయకరావు పితూరీ, పాలకొండ పితూరీ లేకకాలముననే బయలువెడలెను. వీ రొకరి కొకరుసాయము చేసికొనుచుండిరి.

## —: I కాశిపురముపిఘూరీ ముఖీ వీరభద్రిరాజు. :—

ముఖి వీరభద్రిరాజు శృంగవరపుకోటతాలూకాలోని మన్య ప్రదేశములలోనున్న కాశిపురము జమీందారీవంశము లోనివాఁడు. జయపురము మొదలైన జమీలను విజయనగరమువారు స్వాధీనము చేసికొనినప్పుడు ఈముఖీవారిసంస్థానముకూడఁ దీసికొనిరి. కాని 1793 వ సంవత్సరములో ముఖీ రాజభూపాలరాజు విజయనగరమువారి చెఱనుండి తప్పించుకొని తన జమీని స్వాధీనము చేసికొనెను. 1794 వసంవత్సరములో విజయరామగజపతి పద్మనాభముయుద్ధములో మరణించినపిమ్మట నాయనకుమారుఁడు నారాయణగజపతి యీయనయొద్దకే వచ్చెను.1796 వ సంవత్సరమున విజయనగరముసంస్థానము నారాయణగజపతికి స్వాధీనమైన పిమ్మట కలెక్టరు కొండజమీందారీ లన్నియును తనచేతిక్రిందనే యుంచుకొనవలెనన్న తలంపుతో కాశీపురముజమీందారీని మరల ముఖివారి కీయలేదు. ఆండ్రిజమీందారునకు గొన్నినాళ్లను సాగి తిరుపతిరాజుగారికిఁ గొన్ని నాళ్లను కౌలున కిచ్చిరి. ఈ సాగి తిరుపతిరాజుగారు విజయనగరముజమీందారునకు కేవలము తాబేదారునివలెనుండి ప్రవర్తించుచుండుటచేతను, కాశిపురము ప్రత్యేకముగా నొకజమీందారీగా నుండుటకుఁ దగినంత లేకపోవుటచేతను

దీనిని ప్రత్యేకముగా నొకసనదుపైని విజయనగరముజమీాందారునకే యిచ్చివేసిరి.

కలెక్టరుగారు కాశీపురముజమీాందారీ ముఖివారి నుండి తీసికొనినపిమ్మట రాజభూపాలరాజుగారి కుమారుఁడగు వీరభద్రరాజుగారికి నారాయణగజపతిమహారాజావారు నెలకు ౨౦౦ రూపాయి లిచ్చుచుండిరి. నారాయణగజపతి తన సంస్థానమును కలెక్టరున కప్పఁజెప్పి 1827 వ సంవత్సరమున కాశీ వెళ్ళినపిమ్మట వీరభద్రరాజుగారి కిచ్చుచుండిన ౨౦౦ రూపాయిలును పొరపాటున కలెక్టరుగారు వీరి కిచ్చుట మానివేసిరి. కాని పిమ్మట పొరపాటును సవరించుకొని వారి కీయవలసిన సొమ్మును వారి కిచ్చివేయుచుండిరి. అయినను పూర్వవైరమును తీర్చుకొనుటకై వీరభద్రరాజుగారు కంపెనీపైని కుట్రలుచేయుచు పితూరీ చేయనారంభించిరి. ఈవిషయము తెలిసి దొరతనమువారితనిని విశాఖపట్టణము రప్పించి మిలటరీఖాయిదాలో నుంచిరి. కాని యాతఁ డెట్లో తప్పించుకొని మరల పాఱిపోయెను.

పిమ్మట 'రసూల్'దొర కాశపురమునకు కొంతసైన్య మంపి కాశిపురమును తగులఁబెట్టించి వీరభద్రరాజు నడవులకుఁ బాఱఁదోలెను. అప్పటినుండియు నాతఁడు కొండలలో నివసించుచు పితూరీ చేయుచుండెను. తుదకు 1833 వ సంవత్సరము జనవరిమాసములో నీతఁడు పట్టుబడి 'కోర్టుమార్షల్'

క్రింద విచారణచేయఁబడి మరణశిక్ష విధింపఁబడెను. కాని చెన్నపురిదొరతనమువా రీతని మరణశిక్ష తొలగించి యావజ్జీవకారాగారనివాసశిక్ష విధించి యనంతపురముమండలమున నున్న 'గూటీ' కోటకుఁ బంపిరి. ఉత్తరసర్కారులలోని పెక్కండ్రు పితూరీదారులు వారిజీవితకాలమునంతయు నీ గూటీకోటలోనె ముగించిరి.

ఈముఖీవారి పూర్వవృత్తాంతమును వంశావళియు వ్రాయుటకు సరియైన నిదర్శనము లెవ్వియు నింతవఱ కెంత ప్రయత్నించినను లభించలేదు. బొబ్బిలియుద్ధములో విజయరామగజపతికిఁ దోడ్పడిన ముఖీ కాశీపతిరాజుగారినుండి మాత్రమే లభించిందినది. అంతకు పూర్వపునామములు కొన్ని దానశాసనములవలన లభించినను వరుసగా మాత్రము లేవు.




శా. శ. ౧౬౭౨ (క్రీ). శ. 1670 సం॥న ముఖీ మొట్ట కాశీపతిరా జను నతఁడొకఁ డుండినట్లు "కండేపల్లి" ధర్మ

శాసన మొకటి చెప్పుచున్నది. ముఖీ సోమశేఖరుఁడు "సోంపురము" అగ్రహారమును దానముచేసెను. ఇతనిపేర * "కాపుసోంపురము" అను గ్రామముకూడ కలదు.

—: "పాయకరావు పితూరీ" 1832 :—

"కాకర్లపూడి" గ్రామము కాపురస్థుఁడగు కాకర్లపూడి కసవరాజుగారికి, 1 అప్పలరాజు 2 దేవనరాజు 3 జగ్గరాజు, 4 వేంకటరాజు, 5 నరసరాజు, 6 కోనరాజు, 7 మల్లపరాజు, అనియేడ్వురు పుత్రులు కలరు. అందు దేవనరాజుపుత్రులగు 1 కసవరాజు 2 అప్పలరాజు 3 వేంకటరాజులలో రెండవయాతఁడగు అప్పలరాజు గోలకొండలో సరదారుగా నుండి యుద్ధములలో మహమ్మదుకుతుబ్ షాకు ముఖ్యసరదారుగా వ్యవహరించుచుండిన అశ్వపతికి తోడ్పడుచుండెను. ఒకసారి యితఁడు కుంతిపురమునొద్ద ముకుందదేవుతో యుద్ధముచేసి యాభూమిని గోలకొండరాజ్యములో కలిపివేసెను. ఇట్లు మిక్కిలి విశ్వాసముతో నీకాకర్లపూడి అప్పలరాజుగారు గోలకొండలో సరదారీ చేయుచుండుటచే నీతనిసేవకు కుతుబ్ షా సంతసించి యీాయనకు కొంత జమీాందారీయును

* ఇప్పు డీగ్రామము నశించినది. ఇక్కడ రెండుమూడు నిలువుల శిలాశాసన మొకటి కలదు. ఈశాసనమంతయు కప్పఁబడి పైకి మూరెఁడు తాయిమాత్రము కానవచ్చుచున్నది.

* "పాయకరావు" అను బిరుదమును నొసఁగెను. ఈతఁడు 1612-1626 సంవత్సరముల నడుమ నుండెను. అనకాపల్లిలో నూకాలమ్మగుడియు భోగేశ్వరాలయమును నీలప్పలరాజు గారే కట్టించిరి. కొంతకాలమునకు (1776 వ సంవత్సరమున) నీయప్పలరాజుగారి కుటుంబము నశించెను.

చనిపోయిన జమీందారునకుఁ దల్లియు భార్యయు మాత్రముండిరి. ఈయన పోయినపిమ్మట నీయెస్టేటుపై మఱి 90 వేల రూపాయిలు "పేష్కష్" యెక్కువచేసి సంవత్సరమునకు 10,000 రూపాయిలు జమీందారుని తల్లికిని భార్యకును నిచ్చుకొను నిర్ణయముపైని విజయనగరముజమీందారునకు ఈజమీందారీ కంపెనీవారిచ్చివేసిరి. ఈ తల్లియును భార్యయును 1804 సంవత్సరమున నొకరును 1814 సంవత్సరమున నొకరును కాలధర్మమునొందిరి.

ఈ చనిపోయినవారిరువురిలోఁ గడపటి యామెకు మతి స్థిమితములేకపోవుటచే నీమె కీయవలసిన మనోవృత్తిని దొరతనమువారు రాపుచేసిరి. ఈమె యొకకుమారుని పెంచుకొనెనని యీమె మరణానంతరమునఁ గొందఱు దొరతనము వారికిఁ దెలియఁజేసిరి. కాని దొరతనమువారామాటను నమ్మలేదు. ఈ దత్తునిపినతల్లి (తండ్రి?) కుమారుఁడగు జగన్నాధరాజు 1832 వ సంవత్సరము జనవరిలో ఆయుధపాణు

* పాయక రావనఁగా బాగుగా యుద్ధముచేయువాఁడని అర్థము

లను గొందఱను సమకూర్చుకొని 'పాయకరావు' అను పేరుతో పితూరీ లేవఁదీసెను. ఇతనికి గొలుగొండ జమీం దారుని దివానగు నాగన్నదొర ప్రోత్సాహకుఁడుగా నుండెను. ఈపితూరీకి జగన్నాధరాజు స్వబుద్ధికంటె నాగన్న దొర బలవంతమే యెక్కువ కారణమయ్యెను. ఈ నాగన్న దొరచేతిలో జగన్నాథరాజొక కీలుబొమ్మగా నుండెను. ఈ నాగన్నదొర సైన్యములను సమకూర్చి జగన్నాధరాజునకు సహాయముగాఁ బంపుచుండెను. ఈజగన్నాధరాజునకుఁ బితూరీలో సహకారిగానున్న వేంకటపతిరాజు పట్టుఁబడెను.

ఇతనిని న్యాయస్థానములో విచారించి దొరతనము వారు నీనికి మరణదండనము విధించి యురితీయించిరి. నాగన్నదొరకృత్యమువలన నీ వేంకటపతిరాజునకు మరణము సంభవించె ననుద్వేషమున వేంకటపతిరాజుమిత్రు లిరువురా రాత్రి నాగన్నదొరయింటికి వెళ్లి "వేంకటపతిరాజు వచ్చెను. తలుపుతీయుము" అని తలుపు తట్టిరి. నాగన్నదొర తలుపు తెఱచినవెంటనే వానిశిరస్సును ఖండించి యురికంబమున త్రాటియందు వ్రేలాడు మండిన వేంకటపతిరాజు మొండెము నకు తగిలించిరి.

ఇంతలో 1833 వ సంవత్సరమున 'రసూల్' కలెక్టరుగా వచ్చెను. 'రసూల్' రావేగమే జగన్నాధరాజు నైజామురాష్ట్రములోనికిఁ బాఱిపోయి మరల 1834 వ సం॥న

కొంత లష్కరుతోఁ బ్రవేశించెను. దొరతనమువారు వీనిని వెంటాడఁగా నీతఁడు 'రంప' పాఱిపోయెను. కాని యచ్చటి రంపనాయకునిచే నాతఁడు పట్టుబడి దొరతనమువారి కప్పఁజెప్పబడెను. ఈపాయకరా వనుపేరుగల జగన్నాథరాజు పాయకరావుపేటలో నదిమొత్తున నురిదీయఁబడెను. ఇంతటితో నీ పితూరీ ముగిసెను.

—: పాలకొండ పితూరీ 1833 :—

ఈ పితూరీకి పాలకొండజమీందారు, వానిబంధువులు, పెద్దజగ్గయ్య యను నొక వేశ్యయును కారకులు. ఈపాలకొండ జమీందారులు 'జాతపువంశస్థులు' వీరి కీజమీందారి జయపురముమహారాజగు మొదటి విశ్వంభరదేవువలన నొసఁగఁబడెను. ఈవిశ్వంభరదేవు 1672 మొదలు 1676 వఱకును జయపురమును పరిపాలించెను. ఈపాలకొండ జమీందారు విలువిద్యలో మిక్కిలి నేర్పరి యగుటచేత నితని కీపాలకొండజమీందారీయును 'నరేంద్రరావు' అను బిరుదమును గూడ నీయఁబడెను. 1779 వ సంవత్సరమున విజయనగరము సైన్యములు పాలకొండజమీందారును పాలకొండనుండి వెడలఁగొట్టి దానిని స్వాధీనముచేసికొనెను. కాని యేకారణముచేతనో మరల విజయనగరమువారు వారిరాజ్యమును వారి కిచ్చివేసిరి. నాఁటినుండియు పాలకొండజమీందారు విజయనగరముసంస్థానాధీశ్వరులకు సంవత్సరమునకు

52 వేల రూపాయలు కప్పముకట్టుచు వారుకోరినప్పుడు తమ సైన్యములతో విజయనగరప్రభువుల సహాయమునకు వచ్చుచుండిరి. మండలములోని సైన్యము లన్నిటికంటెను పాలకొండసైన్యములు మిక్కిలి ప్రశస్తమైనవి. విజయరామగజపతి పద్మనాభములో కాలముచేసినపిమ్మట మూడుసంవత్సరముల (1796) వఱకు పాలకొండజమీందారు కంపెనీసైన్యముల పైని బహిరంగముగా తిరుగుబాటు చేయుచుండెను. అప్పుడు కంపెనీసైన్యములు పాలకొండజమీందారుఁడగు విజయరామరాజునకు ముఖ్యస్థానములగు వీరఘట్టము మొదలగు స్థానముల నాక్రమించుకొని యీతనిని రాజ్యమునుండి తొలఁగించిరి. ఇతనిపిమ్మట నితనికుమారుఁడగు సీతారామరాజు రాజ్యమునకు వచ్చెను. కాని యితఁడు 1798 సంవత్సరము న మరణించెను. పిమ్మట నితనితమ్ముఁడు వేంకటపతిరాజు రాజ్యమునకు వచ్చెను. రాజ్యపదభ్రష్టుఁడైన యితనితండ్రి విజయరామరాజు వీరఘట్టమునొద్ద కొంతసైన్యమును కూర్చుకొని శిస్తులు వసూలుచేయుటయు, దోఁచుకొనుటయుఁ బ్రారంభించెను. వీనిని శిక్షించుటకై దొరతనమువారు కొంత సైన్యమును బంపిరి. విజయరామరాజీసైన్యములకు దొరకకుండ తప్పించుకొని కొండలమీఁదినుండి నాగపురము పాఱిపోయెను.

వేంకటపతిరాజునకు నాతని దివానునకును 1828 వ సంవత్సరమున విరోధము కలిగెను. అందుచే వేంకటపతిరాజు దివానును వానితమ్మునిం గూడ చంపించెను. అచ్చటి పోలీసు బలము తక్కువగానుండుటచే వాని నేమియుఁ జేయలేకపో యిరి. ఈవార్త మండలాధికారికిఁ దెలిసినది. కాని యీసమ యమున జమీందారునిపట్ల నేమైన కఠినచర్య తీసికొనిన మి గిలిన జమీందారులలో నేమైన యసంతుష్టి కలుగవచ్చునని యును, కొండజాతులతో కలహము తెచ్చిపెట్టుకొనిన మిక్కి లి ప్రమాదించుననియును, అనవసరపు చిక్కు తెచ్చిపెట్టు కొనుట కార్యకారి కాదనియును తలఁచి కఠినచర్యలేమియు ను తీసికొనలేదు. మండలాధికారి (కలెక్టరు) తన గుమస్తా నొకనినిమాత్రము విషయములు తెలిసికొనుటకు పంపెను. కాని దానివలన ప్రయోజనము లేకపోయెను. ఇంతలో 1828 సంవత్సరము అక్టోబరు నెలలో వేంకటపతిరాజు చనిపోయెను.

ఆతనికి కూర్మరాజను కుమారుఁడు కలఁడు. ఇతఁడు వేంకటపతిరాజునకు శాస్త్రసమ్మతమైన కుమారుఁడు కాక పోయినను వేంకటపతిరాజు భార్యలందఱును సమ్మతించుటచే నితఁడే రాజ్యాధిపతి యయ్యెను. ఇతఁడు బాలుఁడగుటచే నితని (యెనమండుగురు) తల్లులలో నొకయామె రాజ్యకార్య ములను వ్యవహరించుచుండెను. తల్లులందఱును జగడగొండు లగుటచే వీరొక్కొక్క రొక్కొక్కపక్షముగాఁ జీలిపోయి

ప్రతిపక్షమువారును కొంతసైన్యమును, కొంతమంది కొండ నాయకులను జేరఁదీసికొనిరి. వారిలోఁ గొందఱు కూర్మ రాజును రాజ్యమునుండి తప్పించుటకుఁ బ్రయత్నించుచుండిరి. కూర్మరాజు తల్లులలో పెద్దజగ్గయ్య యను వేశ్య మిక్కిలి సామర్థ్యము కలది.

వీరియంతఃకలహము లనంతములై తుద కీకలహములు, పితూరీలు, దోఁపిడులు, గ్రామములు తగులబెట్టుటలు మున్న గు క్రూరచర్యలకిందికి మాఱెను. ఈ కూర్మరాజునకు రాజ్య పరిపాలనమునకు యుక్తవయస్సు వచ్చినది. అప్పటికి కంపెనీ వారికి 93 వేల రూపాయిలు పేష్కష్ బాకీపడియుండెను. అప్పటి యీతాలూకాలోని ప్రజలు దౌర్జన్యస్వభావము గల వారగుటచే కలెక్టరు దొరతనమువారికి వ్రాసి కొంతసైన్య మును తెప్పించెను. ‘ బూర్జ ’ యొద్ద కంపెనీసైన్యము పితూరీ దారుల నెదిరించెను. పితూరీదారులు గ్రామమునూ దోఁచు కొని పాఱిపోయిరి.

1833 సం॥ జనవరినెలలో (అనఁగా రసూల్ స్పెషల్ కమీషనర్‌గా వచ్చినషిమ్మట) పితూరీదారులు పాలకొండ లోనున్న అమీనాకచేరీపైఁబడి యందులోని ప్రాతఖైదీలను విడిపించుకొని పాఱిపోవుటకుఁ బ్రయత్నించిరి. కాని వీలు కాలేదు. దొరతనమువారిచే నిర్బంధింపఁబడిన ఖైదీల నంద ఱను విడిపించుటకు పితూరీదారులు మఱియొక పన్నుగడ

పన్నిరి. ఈపితూరీదారు లందఱును పాలకొండతాలూకా లోని 'అచ్చపవలస' కోటలో మార్చి 9 వ తేదీని సమావేశమైరి. వీరి నెదిరించుటకు మార్చి 9 వ తేదీని Lieutenant Curre అను సేనాని బయలుదేరి వెళ్ళెను. పోరాటములో సేనానికిఁ గొన్ని తీవ్రమైన గుండుదెబ్బలు తగిలెను. పితూరీదారులు పాఱిపోయిరి. కాని యాకోటలోఁ గొన్ని యుత్తరములు మాత్రము దొరకెను. అందులో పెద్దజగ్గయ్యమ్మ పితూరీదారులకు వ్రాసిన కొన్ని యుత్తరములు కలవు. ఆయుత్తరములో అమీనును, గవర్నమెంటుమేనేజరును చంపుమార్గములును సైన్యములను నడిపించుకొనివచ్చు మార్గమును, మందుగుండుసామానులను పితూరీదారులకుఁ బంపుట, పితూరీదారులకు ధనసహాయ మొనరించుట మున్నగు విషయము లన్నియుఁ గలవు. ఈసందర్భమున 'రసూల్' కొంతసైన్యమును పాలకొండకోటలోని కంపి కూర్మరాజును పెద్దజగ్గయ్యమ్మను మఱి పదిమందియనుచరులను బంధించి తెప్పించెను. ఇందులో నారుగురు కోర్టుమార్షలుక్రింద విచారింపఁబడి యిద్దఱు నేరస్తులుగా నిరూపింపఁబడిరి. పెద్దజగ్గయ్యమ్మకును కూర్మరాజునకును మొదట మరణశిక్ష విధించిరి కాని పిమ్మట శిక్షను తగ్గించి స్టేటుఖైలుదీగాఁ జేసిరి. కూర్మరాజు 1834 వ సంవత్సరమున గూటీకోటలో మరణించెను. ఇంత

టితోఁ పాలకొండపితూరీయును, పితూరీతోఁబాటు జమీం దారీయును నంతరించెను.

పిమ్మట యీతాలూకా కొంతకాలము 'ఆర్బత్ నాట్' కంపెనీక్రింద నుండెను. అటుపిమ్మట క్రమముగా గవర్నమెంటువారే తమచేతిక్రిందికిఁ దీసికొనిరి. ఇప్పటికిని నీతాలూకా గవర్నమెంటుతాలూకాగనె యున్నది.

—: గొలుగొండపితూరీ 1845_48 చిన్నభూపతిరాజు. :—

ఈగొలుగొండకు మొదట గొల్లకొండ యనిపేరు. ఇది నర్సీపట్టణమునకు పశ్చిమమున పదిమైళ్లదూరములో నున్నది. జయపురముజమీందా రగు విజయచంద్రాఖ్యునకు (1476_1510) ఇరువురు పినతల్లికుమారులు కలరు. వారు విజయచంద్రాఖ్యమహారాజులుంగారికి ఛత్రిచామరములు పట్టుచుండిరి. వా రిరువురికిని కొంతరాజ్య మిచ్చి రాజ్యాధిపతులుగాఁ జేయవలెనన్నయుద్దేశముతో నొకనికి మాడుగులు, వేఱొకనికి గొల్లకొండయును నిచ్చిరి. ఈజమీందారీలతోఁబాటు "భూపతి" యను బిరుదమునుగూడ నుభయులకును నొసఁగబడెను. పూర్వమీగొలుగొండచుట్టును గొందలు గొల్లరాజులు పరిపాలించుచుండిరి. ఈరాజ్యములపైకి శ్రీకృష్ణదేవరాయలు దండెత్తివచ్చినప్పుడు జయపురమును భైరవదేవుఁడు పరిపాలించుచుండెను. కాలక్రమమునఁ గొన్నిశతాబ్దములు గడచినపిమ్మట నీజమీందారు లందఱును విజయనగరముసఁ

స్థానమునకు సామంతరాజులై యుండిరి. ఈగొలుగొండరాజులు (వీరభూపతి, భైరవభూపతి) విజయనగరమునకు సంవత్సరమునకు 23 వేలరూపాయిలు కప్పము కట్టుచుండిరి. పద్మనాభముయుద్ధములో విజయరామగజపతి చనిపోవువఱకు వీరు విజయనగరమునకు సామంతరాజులుగ నుండిరి.

1836 వ సంవత్సరమున గొలుగొండరాజగు అనంతభూపతికి పరిపాలనమునందు శక్తిలేకపోవుటచే సంస్థానము పాడైనది. అందుచే నీరాజ్యమును వానివంశములోనియామె యగు జమ్మదేవమ్మ కిచ్చివేయుమని కంపెనీవారు కోరిరి. ఆఁడుది పరిపాలించుటకు ముఠాదారులును వజీరులును నంగీకరించలేదు. అంతియకాక యీజమ్మదేవమ్మ జీవించియుండిన నెప్పటికైనను కంపెనీవారీమెకే రాజ్యము నిచ్చెదరని తలంచి వారిలోఁ గొంద ఱీమెను చంపివేసిరి. ఇదే సమయముగా జిల్లాకలెక్టరక్కడికేగి గొలుగొండ జమీందారుని గూటీకోటకు పంపివేసెను.

1837 వ సంవత్సరమున నీజమీందారీ వేలము వేయఁబడెను. ఆ వేలములో దొరతనమువారే యీజమీందారీని 100 రూపాయిలకు కొని కొండసర్దార్లకును, ముఠాదార్లకును మునుపటివలెనె దొరతనమువారు కౌళ్ళ నొసఁగిరి. ఐనను దొరతనమువారి యాక్రమణమునకు ముఠాదార్లు సంతుష్టి

నొందక 'భూపతి' వంశస్థులకే మరల జమీందారీ నిచ్చు నుద్దేశముతో పితూరీ లేవఁదీసిరి.

19 సంవత్సరముల యీడుగల 'చిన్నభూపతి' యను నాతని నీపితూరీకి నాయకునిగా నిలఁబెట్టిరి. ఈపితూరీ 1845 సంవత్సరము మొదలు 1848 వ సంవత్సరమువఱకును సాగించి తుదకు పితూరీదారులు దొరతనమువారితో సఖ్యపడిరి. చిన్నభూపతికిని యతని ముగ్గురుసోదరులకును సాలునకు 4000 రూపాయిలు రాఁబడిగల గ్రామములను కంపెనీవా రొసఁగిరి.

—: కంపెనీరాజ్య మస్తమించుట 1857 :—

ఇంచుమించుగా నీకంపెనీపరిపాలన మంతయు నల్లరులతోడను, తిరుగుబాటులతోడను పితూరీలతోడను నిండియుండెను. కంపెనీపరిపాలనము జమీందారులకుగాని ప్రజలకుగాని సంతృప్తిని కలుగఁజేయలేకపోయెను. వీరు ప్రజలక్షేమలాభములకంటె ఆత్మలాభమునె యెక్కువగాఁ జూచుకొనుచు సమయము దొరికినప్పుడెల్ల నేదోయొక నెపమును కలుగఁజేసికొని జమీందారుల యొక్కయు ప్రజలయొక్కయు జన్మహక్కుల నడఁగద్రొక్కుటకే తమ యావచ్ఛక్తిని వినియోగించుచుండిరి. తుదకు వారి కొలువులో పనిచేయుచుండిన సిపాయిలకుకూడ వారిపై పడక 1857వ సంవత్సరము నవంబరుమాసములో యావద్భారతదేశమునంగల సిపాయిలందఱును కంపెనీవారిపై తిరుగు

సిపాయిల తిరుగుఁబాటు

బాటుచేసి ఐరోపియనులను బెక్కండ్రి హతమొనరించిరి. ఈవిషయమంతయు నింగ్లాండులో శ్రీ విక్టోరియామహారాజ్ఞికి తెలిసి భారతఖండపరిపాలనము కంపెనీచేతినుండి తప్పించి తనచేతిక్రిందికి తెచ్చికొనెను. నాంటినుండి నేంటివఱకును ఇంగ్లాండుప్రభువులే మనదేశమును పరిపాలించుచుండిరి.

ఇస్టిండియాకంపెనీవారు 1767 మొదలు 1857 వఱకును గల 90 సంవత్సరములు పరిపాలించిరి.

—: బ్రిటిషుపరిపాలనము 1 నవంబరు 1858 :—

ఇండియాలో సిపాయిల యల్లరి జరుగుచుండిన దినములలోనె వెనుకటియుద్దేశములతోడనే చిన్నభూపతి యన్న కుమారుండగు సన్యాసిభూపతి మఱియొక పితూరీ లేవదీసెను. అప్పుడు Captain Owen అనునతండు పర్వతప్రాంతమునకు జని కొందఱు కొండసర్దార్ల సహాయముతో పితూరీ నడచివేసెను. సన్యాసిరాజును నతనిమేనమామయును బట్టుపడిరి. దొరతనమువారు వీరిని న్యాయస్థానములో విచారించి వీరిని స్టేటుఖైదీలుగాం జేసిరి. కాని వీరిగ్రామములవలన వచ్చుచుండిన రాంబడిని వీరి కిచ్చివేయుచుండిరి. సన్యాసిభూపతి 1886 వ సంవత్సరమున మృతినొందెను. అప్పటి కీయనవంతునకు 913 రూపాయిలు వచ్చుచుండెను.

గోలుగొండపితూరీ సన్యాసిభూపతి 1857-58

—: గోలుగొండపితూరీ వీరయ్యదొర 1879-80 :—

దొరతనమువారు కొండముఠాలలో 1864-65 సంవత్సరముల నడుమ కొన్ని పోలీసుస్టేషనులను గట్టించిరి. అవి కట్టినపిమ్మట కొంతకాలము నెమ్మదిగనె కాలము గడచినది. కాని గోదావరీమన్యప్రాంతమున 1879-80 సంవత్సరముల నడుమను బుట్టిన రంపపితూరీ విశాఖపట్టణముజిల్లాకుఁ గూడ వ్యాపించినది. దీని నడచుటకై జయపురమునుండి 'కెప్టెన్ బ్లక్సు లేండ్' (Captain Blax land) అను సేనాని కొంత సైన్యముతో కొండలమీఁదుగా వచ్చెను. మార్గమధ్యమున నొకయడవిలో పితూరీదారులకును వీరికిని 1879 వ సంవత్సరము జూన్ 3 వ తేదీని యొక పోరాటము జరిగెను. అందు పితూరీదారులు బ్రిటిషుసేనానిని వెనుకకు తఱిమివేసిరి.

ఆమఱుచటి సంవత్సరము గూడెము, పాతవీధి ముఠాదారగు వీరయ్యదొర పితూరీలోఁజేరి నడిపించెను. ఇతఁడు కొండకంబేరుస్టేషనును దోఁచుకొనెను. ఇంతలో దొరతనమువారి సైన్యము లాపప్రదేశమునకుఁ జని వారిని పాఱఁద్రోలెను. అక్టోబరు 7 వ తేదీని వీరయ్యదొరకూడ గుండుదెబ్బ తగిలి చనిపోయెను.

—: గుణుపురము పితూరీ 1864 :—

పదునెనిమిదవ శతాబ్దాంతమున కిమిడెజమీందారగు నారాయణదేవు జయపురమువారినుండి గుణుపురముతాలూ

కాను బలవంతముగా నాక్రమించుకొనిదానిని తన తమ్ముం డగు ప్రతాపదేవున కొసంగెను. కాని సీతారామరాజు గుణు పురముతాలూకాను ప్రతాపదేవునుండి తీసికొని వాని నచ్చ టినుండి పంపించివేసెను. ఈతాలూకావ్యవహారములను జూ చుటకు సీతారామరాజునకు తీరుబడి లేకపోవుటచే దీనిని జయపురమువారి కతం డిచ్చివేసెను.

1864 సం॥ జూలై నెలలో సవరజాతితో పోలీసువారి కొక పోరాటము సంభవించెను. ఒక సవరనాయకుని పొట్ట సింగి పోలీసువా రన్యాయముగా నిర్బంధించుటచే పోలీసు ఇన్‌స్పెక్టరును, మఱి నలుగురు పోలీసువారిని సవరలు చంపి వేసి పోలీసుస్టేషనును తగులంబెట్టిరి. వీరిని పట్టుకొనవలసిన దని దొరతనమువారు జయపురముమహారాజావారికి వ్రాసిరి. జయపురమువారు ప్రయత్నించి పితూరీదారులను పట్టుకొని దొరతనమువారి కప్పంజెప్పిరి. దొరతనమువారు వారిలో 19 గురిని యావజ్జీవకారాగారవాసులుగ నొనరించి 5 గురిని పొట్టసింగియొద్దనున్న 'జాత్తేరు' దగ్గర ఉరితీసిరి.

అంతటితో వెంటనే యాప్రదేశమున శాంతివాతా వరణము కలుగలేదు. 1865 వ సంవత్సరములో నచ్చట పోలీసుస్టేషను నేర్పాటుచేయుటకై పోలీసువారిని దొరతనము వారు పొట్టసింగికిం బంపిరి. అచ్చటి పితూరీదారులు పోలీసు వారిని తీవ్రముగా నెదిరించి పోలీసువారిని మఱలి పాఱిపోవ

నట్లు కొట్టి తరిమిరి. 1886 వ సంవత్సరమున పోలీసువారు మరల మఱికొంతమందితో పొట్టసింగి వెళ్ళి మిక్కిలి ప్రయాసముపైని నచ్చట పోలీసుస్టేషను నేర్పాటుచేసిరి. పితూరీ నాయకులలో ముగ్గురు పట్టుబడి యావజ్జీవ కారాగారశిక్ష విధింపఁబడిరి.

—: గొలుగొండపితూరీ కొండదొరల గురువులు 1886 :—

1886 వ సంవత్సరమున ముప్పదిమంది కొండదొరల గురువులు కలసి కొండదేవతలు పితూరీ లేవఁదీయుమని తమతోఁ జెప్పినట్లు గ్రామములవెంటఁ దిరిగి చాటనారంభించిరి. వీరు గూడెము వెళ్ళి యచ్చటి పోలీసుస్టేషను రాధాకిబంగళాయును దోఁచుకొని దానిని తగులఁబెట్టిరి. అక్కడనుండి మఱునాఁడు చింతపల్లె వెళ్ళి యాగ్రామమును దోఁచుకొని దానిని తగులఁబెట్టిరి. పిమ్మట లమ్మసింగి వచ్చిరి. అచ్చట పితూరీదారులు పట్టుబడిరి. లమ్మసింగిముఠాదారుకూడ పితూరీదారులకు సహాయముచేయుటచే వానిముఠాను దొరతనమువారు తీసికొని చింతపల్లెలో కొంత రిజర్వు నేర్పాటు చేసిరి.

—: గొలుగొండపితూరీ 1891 శాంతభూపతి :—

ఈపితూరీకి శాంతభూపతి నాయకుఁడు. ఇతఁడు చిన్న భూపతిరాజు కుమారుఁడు. దొరతనమువారు తన కిచ్చుచుం

డిన తబ్జీతో నితఁడు సంతృప్తినొందక యీపితూరీ లేవ దీసెను. 1891 సం॥ మే నెల 23 తేదీని రెండువందలమంది పితూరీదారులతో నీతఁడు బయలుదేరి, వీరయ్యదొరను చంపిన కాన్‌స్టబులును మొట్టమొదట చంపి పిమ్మట మిగిలిన పోలీసు వారిన్ని చంపెను. తరువాత కృష్ణాదేవుపేటపోలీసుస్టేషనులోఁ బ్రవేశించి యచ్చటి తుపాకులన్నిటిని దీసికొని 5గురు పోలీసువారిని చంపి స్టేషను తగులఁబెట్టెను. మఱియొక నెలవఱకెచ్చటనో దాగియుండి జూన్ 24 తేదీని శాంతభూపతి మన్యజ్వరమువలన మృతినొందెను. పితూరీదారు లందఱును క్రమముగాఁ బట్టుపడిరి. శాంతభూపతి చనిపోవునప్పటికి ఆయన కొకకుమార్తెయును తల్లియును భార్యయును గలరు. వారి పోషణార్థమై దొరతనమువారు కొంతధనము నొసఁగుచుండిరి.

ఈపితూరీలో ముఠాదారు లెవరును దొరతనమువారికిఁ దోడ్పడకపోవుటచే, 1 కొయ్యూరు 2 చిట్టంపాడు 3 బండవలసముఠాలను దొరతనమువారు వశపఱచుకొనిరి. 1 లమ్మసింగి 2 కొత్తవీధి 3 లోతుగెడ్డ ముఠాదార్లను తప్పించి వారి ముఠాలను వారి వారసుల కిచ్చిరి. గూడెముముఠాదారుని శిక్షించి వాని ముఠాను వాని కుమారున కిచ్చిరి.

—: కొట్టువానివలసపితూరీ 1900 కొట్టు మల్లయ్యదొర :—

పాచిపెంటపర్వతప్రాంతమున కొట్టువానివలస యని

యొకగ్రామము కలదు. క్రీ. శ. 1900 సంవత్సరము వఱకును దీని పేరెవరును నెఱుఁగరు. అచ్చట కొట్టిసుల్లయ్యదొర యను పేరుగల యొక కొండదొర కలఁడు. అతఁడు భగవంతుఁడు తనకావేశమగునని చెప్పుచు అట్లే తాను ప్రవర్తించుచుండుటచేత నిత్యమును వానియొద్దకు వేనవేలు ప్రజలు వచ్చి వానిని దర్శించి పోవుచుండిరి. ఇట్లు కొంతకాలమగు వఱకు వానిచుట్టును 4-5 వేలమంది కొండవారు చేరిరి. 1900 సం॥ ఏప్రిల్ నెలవఱకును నాభగవంతుని యావేశమువలన ప్రజల కెట్టియిబ్బందియును గలుగలేదు.

1900 సం॥ ఏప్రిల్ నెలలో, తా నర్జునుని యంశమువల్ల జన్మించినట్టును, తనకుమారుఁడు శ్రీకృష్ణుని యవతారమనియును బ్రిటిషువారిని భారతఖండమునుండి తఱిమివైచుటకుఁ దా మవతారముల ధరించితిమనియును వెదురుకఱ్ఱలను తుపాకులుగా మార్చు శక్తి తమకుఁ గలదనియును ప్రజలకు బోధింప నారంభించెను. ఇట్లు బోధించి తనసేవకుల కందఱకును వెదురుబొంగులను తుపాకులవలె ఖండించి యాయుధములుగా నొసఁగెను. ఈ మల్లయ్యదొరపరివారమంతయు నాతనిని "స్వామి" యని పిలుచుచుండిరి. ఈ మల్లయ్యదొర తన శిబిరముచుట్టును వెదురుబొంగులతో నావరణ మేర్పాటు చేయించెను.

ఒకనాఁటిదినమున పాచిపెంటను దోఁచుకొనుటకు వచ్చెదమని యచ్చటివారికి మల్లయ్యదొర కబురంపెను. ఈ విషయమును గనిపెట్టుటకు మే నెల 1 తేదీని యిద్దఱుపోలీసువారచ్చటికేఁగ వారిని పితూరీదారులు చంపిరి. ఈవార్త మండలాధికారి (కలెక్టరు) విని, విశాఖపట్టణము, పార్వతీపురము, జయపురము, రిజర్వుపోలీసులతో మల్లయ్యదొరశిబిరములో నాకస్మికముగా మే నెల 7 వ తేదీ యుదయమున చీఁకటి యుండఁగనే ప్రవేశించి మల్లయ్యదొరను వానిప్రధాననాయకులను పట్టుకొని నిర్బంధించెను. ఉభయబలములపోరాటములో పెక్కండ్రు హతులైరి. పట్టుబడినవారిని విచారించి యిరువుర కురిశిక్షయు మిగిలినవారికి కారాగారశిక్షయు విధించిరి. మల్లయ్యదొరయును నాతనికుమారుఁడును మాత్రము తమ కురిశిక్ష విధింపఁబడకముందె శరీరములను విడిచిపెట్టిరి.

—: రంపపితూరీ అల్లూరిసీతారామరాజు 1922 :—

ఈ యల్లూరి సీతారామరాజుగారి పితూరీగురించి యెఱుంగని వారెవ్వరును నాంధ్రలోకమున లేరు. ఈపితూరీ నాయకుఁడు క్షత్రియకులసంభవుఁడు. ఇంగ్లీషు, తెలుఁగు సంస్కృతభాషలు చక్కఁగా చదువుకొనినవాఁడు. 25 సంవత్సరములకు తక్కువ వయస్సుకలవాఁడు. విచిత్రమైన చరిత్ర కలవాఁడు. వైద్యశాస్త్రము జ్యోతిషశాస్త్రములలో నభిరుచి

కలవాఁడు. మంచి యోగాభ్యాసకుఁడు. యుద్ధమునందు మంచినేర్పరి. ఇతఁడు పట్టణములోపుట్టి పట్టణములో పెఱిగినవాఁడయ్యు కొండలలో నవలీలగా సంచరించు శక్తికలవాఁడు. సన్యాసాశ్రమమున నున్నవాఁడు.

ఇతనిపితూరీకిని తదితరులపితూరీలకును చాల వ్యత్యాసము కలదు. ఇతని యుద్దేశములకును నితరపితూరీదార్ల యుద్దేశములకును చాల తారతమ్యముకలదు. ఇతనిపితూరీలో అహింస చాలవఱకుఁ గనఁబడుచున్నది. ఇతరపితూరీదారులలో హింసయు దౌర్జన్యమును కనఁబడుచున్నది.

దొరతనమువారియుద్యోగస్థులు కొండప్రజను పెట్టుచుండినబాధను వారు సహింపలేక యీసీతారామరాజును నాయకునిగా నేర్పాటుచేసికొని యీపితూరీని లేవఁదీసిరి. సీతారామరాజు చాల నేర్పుతో పితూరీ రెండుసంవత్సరములు కొనసాగించెను.

జర్మనీయుద్ధములో పేరుపొందిన యిద్దరు ఐరోపియను లీపితూరీలో మరణించిరి. తుదకు పితూరీనాయకుఁడును మరణించెను. ఇతనికి బాసటయై నిలిచిన గాంమల్లుదొర గాంఘంటందొర మొదలగువారును పట్టుబడి శిక్షింపబడిరి



# I అనుబంధము.

| | కళింగదేశపురాజులు. | వంశము. | తేదీ. |
|---|---|---|---|
| ౧ | వజ్రహస్తుఁడు | గంగవంశము | 1038-69 |
| ౨ | రాజరాజు | | 1069-77 |
| ౩ | అనంతవర్మదేవుఁడు | | 1077-1147 |
| ౪ | కామార్ణవుఁడు | | 1147-57 |
| ౫ | రాఘవుఁడు | | 1157-72 |
| ౬ | రాజరాజు | | 1172-92 |
| ౭ | రెండవఅనంగభీమదేవుఁడు | | 1192-1202 |
| ౮ | రాజరాజు | | 1202-11 |
| ౯ | మూడవఅనంగభీమదేవుఁడు | | 1211-38 |
| ౧౦ | వీరనరసింహదేవగజపతి I | | 1238-64 |
| ౧౧ | వీరబానుదేవగజపతి | | 1264-78 |
| ౧౨ | వీరనరసింహదేవగజపతి II | | 1278-1305 |
| ౧౩ | వీరభానుదేవగజపతి II | | 1305-27 |
| ౧౪ | వీరనరసింహదేవగజపతి III | | 1327-53 |
| ౧౫ | వీరభానుదేవగజపతి III | | 1353.78 |
| ౧౬ | అరాజకము | | 1378-1402 |
| ౧౬ | వీరనరసింహదేవగజపతి IV | | 1402-24 |
| ౧౭ | వీరభానుదేవగజపతి IV | | 1424-34 |

| | కళింగదేశపురాజులు. | వంశము. | తేదీ. |
|---|---|---|---|
| ౧౮ | కపిలేశ్వరగజపతి | గంగవంశ | 1434-69 |
| ౧౯ | పురుషోత్తమగజపతి | ము | 1469-96 |
| ౨౦ | ప్రతాపరుద్రగజపతి | | 1496 1539 |
| ౨౧ | వీరభద్రగజపతి | | 1539-41 |
| ౨౨ | గోవిందదేవు | మంత్రి | 1541-48 |
| ౨౩ | ఇతనిముగ్గురుపుత్రులు | | 1548.60 |
| ౨౪ | ముకుందహరిచందనుఁడు | ఆంధ్రుఁడు | 1560-68 |
| ౨౫ | ఇబ్రహీంకుతుబ్ శాహి [హ | కుతుబ్ శా | 1568-80 |
| ౨౬ | మహమ్మద్ కూలీకుతుబ్ శా | హ | 1580-1611 |
| ౨౭ | అబ్దుల్లాహుస్సేన్ కుతుబ్ శాహ | ,, | 1611-58 |
| ౨౮ | తానీషా | ,, | 1658-87 |
| ౨౯ | ఔరంగజేబు(జమీందార్లు) | మొగలా | 1687-1707 |
| ౩౦ | జమీందారులు | యీూ | 1707-24 |
| ౩౧ | నైజాముల్ ముల్కు (విజయరామగజపతి) | | 1724-1734 -1748 |
| ౩౨ | విజయరామగజపతి | క్షత్రియులు | 1734-1757 |
| | ఫ్రెంచివారు-- | | 1753-58 |

| | కళింగదేశపురాజులు. | వంశము. | తేదీ. |
|---|---|---|---|
| ౩౩ | ఆనందగజపతి | క్షత్రియులు | 1757-60 |
| ౩౪ | విజయరామగజపతి II | ,, | 1760-94 |

ఇంతటితో కళింగరాజ్యమంతరించెను.

| | | | |
|---|---|---|---|
| ౩౫ | ఈస్టిండియాకంపెనీ | ఇంగ్లీషువా | 1794-1858 |
| ౩౬ | బ్రిటిష్ పరిపాలకులు | రు | 1858 |



# అనుబంధము II.

| | శ్రీకాకుళము సర్కార్ ఫౌంజుదారులు. | తేదీ. |
|---|---|---|
| ౧ | షేర్ మహమ్మద్ ఖాను | 1652_[illegible] |
| ౨ | ముస్తాఫాఖులీఖాను | 1682_90 |
| ౩ | రుస్తుందిలేఖాను | 1697_97 |
| ౪ | ఫకీరల్లీఖాను | 1698_1700 |
| ౫ | మోహాదిన్ ఖాను | 1700_1701 |
| ౬ | ముస్త బందఖాను | 1701_1702 |
| ౭ | రుస్తుందిలేఖాను (2nd time) | 1702_1708 |
| ౮ | ఫకీరల్లీఖాను (2nd time) | 1704.1721 |
| ౯ | హాబీబ్ ఖాను | 1710_1717 |
| ౧౦ | అరబీఖాను | 1717_1720 |
| ౧౧ | హాలాఖాను | 1720_1724 |
| ౧౨ | విజయరామగజపతి | 1724_1725 |
| ౧౩ | అన్వరుడ్డీనుఖాను | [illegible]2[illegible]_1740 |
| ౧౪ | జాఫరల్లీఖాను | 1740_174[illegible] |
| ౧౫ | బహారుల్లాఖాను | 1746_17[illegible] |
| ౧౬ | జాఫరల్లీఖాను (2nd time) | 1750_17 |
| | లేరు— | 1753_1 |
| ౧౭ | ఇబ్రహింఖాను | 1754_ |
| | లేరు— | 1756 |
| ౧౮ | అనేదల్లీఖాను | 175' |

గంగవంశము (ప్రాచీనలేఖమాలా)

కోలాహలః

విరోచనః

⋮

(81 రాజానః)

⋮

వీరనరసింహః

- కామార్ణవః I
- దానార్ణవః, 656-96 (40)
  - కామార్ణవః II (50) 696-746
- గుణార్ణవః I,
- మారసింహః
- వజ్రహస్తః